

విజయ జ్యేష్ఠము

# భారతి

సంపుటము 30
సంచిక 6

# శ్రీ వాగీశ్వరి

★

శ్రీ చల్లా పిచ్చయ్యశాస్త్రి

అవ్యక్తప్రమదాబ్ధి కేగు రసవాహంబందు దోఁగాడి శ
క్తి వ్యుత్పత్తులు తూగి కొల్వ ననురక్తిఁ గాంతి జాల్వాలుగా
గావ్య శ్రీపుట భేదనమ్మునను వేడ్కన్ భావసౌధంబున
న్నవ్యక్తంబగు నిన్ను గన్గొనిన చో జూపోపు! వాగీశ్వరీ.

శరదారంభ నదీజలంబువలె స్వచ్ఛంబై స్ఫురత్సూచికాం
కురముంబోలె నిశాతమై విషయపంక్తుల్ మెల్చి యానందమం
దరహింకెందు మనీషయే మధురచంద్ర జ్యోతిరున్మేష భా
స్వరమౌ నీరుచి నున్న దాన్నటులఁ గాంచంజాలు వాగీశ్వరీ.

రాగంబుల్ పదిపాడవచ్చు గళసారస్యమ్ముతో సందఱున్
త్యాగయ్యం బలె గ్రోలగాఁగలరె నాదానంద మాధుర్యమున్

ప్రాగల్భ్యమ్మునఁ జూడవచ్చు బహుళగ్రంథమ్ములన్ దగ్ధ్వని
శ్రీ గగ్గోఁగవివోలె నేర్వరితరుల్ సిద్ధంబువాగీశ్వరీ.

భక్తిం బాదయి యొప్పి పూర్వము కవిబ్రహ్మల్ మహాభాగు లా
సక్తింగొల్చిరి నీ స్వరూపమును విశ్వాసమ్ముతో నేటికిన్
వక్తల్ శ్రోతలు దైవతంబులని కొల్వన్ నిల్చి రవ్వారి ధీ
శక్తిం జేర్కొన నెవ్వ రోపుదురు విశ్వధ్యేయి వాగీశ్వరీ.

నిను సింహాసనమందు నిల్పిన నృపుల్ నీమంగళాకారము
న్గనులం జూపిన సత్కవీశులును లోకంబుద్ధరింపంగ నే
డును గ్రంథాకృతి దోచుచుండిరి విరాట్టుంబోలి బోధామృత
ప్రణయప్రస్ఫురణ ప్రపోషితసమగ్ర శ్రీక! వాగీశ్వరీ!



# స్త్రీల కథాగేయములు

★

'కృష్ణశ్రీ'

కల్పనా రసానందమూ పండితుల ప్రత్యేక హక్కులు కావు. జనసామాన్య మంతటిలోనూ మనస్సులు కల్పననీ, హృదయాలు రసానందాన్నీ కోరుకుంటాయి. చిన్నపిల్లల లేతమనస్సులూ హృదయాలూ కూడా కల్పనల్ని మెచ్చుకోడమూ, రసాత్మక రచనలకి ఝల్లుమనడమూ వారి కథాశ్రవణ సమయాల్లో మనకి అనుభవమే. మానవుని అనుభవాలు విన్న మానవహృదయాలు ఝల్లుమనడమూ, మానవుని కల్పనల్ని మనస్సులు ఆమోదించడమూ నైసర్గికమే. ఇది స్త్రీలకుకూడా చెల్లుతుందని వేరే చెప్పడమెందుకూ? సభలలో నిన్నటివరకూ పురుషులు వెలివెట్టినా, గృహసీమలలోనూ, గ్రామసీమలలోనూ, మంగళ సమయాలలోనూ స్త్రీల సంస్కృతి సహజ సౌందర్యాన్ని పెంచుకుంటూనే వుండినది. ఈ అందపు సంస్కృతికి దోహదము చేసినవే కథాగేయాలు. అకృత్రిమత్వమూ, హృదయాభిముఖత్వమూ ఈ గేయాల జన్మహక్కులు. వీటి శ్రోతలు అమలిన మనస్కులూ, స్వార్థాహంకార రహితులూను. వారు కోరవి రీతీ, అలంకారమూ, గుణమూ, ధ్వనీ, అని ఏర్పడిపోయి ఉండవు. అందువల్ల వారి కానందాన్నిచ్చే పద్ధతులు నైసర్గికములే గాని కృతకములు కావు. మాత్రాబద్ధములై వుండడమూ, పరిమితి కలిగివుండడమూ మాత్రమే వీటికి వర్తించే నియమాలు. వీటిని తీర్చిదిద్దేది రచయితల మనస్సులు కాదు, హృదయము. కాబట్టి సార్వజనీనభావాలే వుంటాయి వీటిలో. అక్కడక్కడ మాత్రం నక్షత్రాల లాగ— కాదు మెరుపుల లాగ—వ్యక్తుల రచనాసౌందర్యము తళుక్కుమంటూ ఉంటుంది. ఇది చూడండి.

ఎనకా వెనకా వేములతోట
కనకా పళ్ళా కామనరూపు
వాగూ నీళ్ళూ వనమూ పత్రీ
తెల్లని గుళ్ళో నల్లనిస్వామికి
నాల్గుచేతులా నమస్కారాలు.

ఐదు పంక్తులు! తల్లీ పిల్లా గుడికి వెళ్ళినదృశ్యము. వెనకవైపున 'కనక' పండ్లతో వేము 'తోట!', వాగూ, నీళ్ళూను. గుడిచుట్టూ వనమూ, పత్రీ. తెల్లగా వెల్ల వేసిన గుడిలో నల్లని లింగము! చిత్రకారులు ఇంతకన్నా చక్కగా అదృశ్యాన్ని కళ్ళకి కట్టించగలరా? ప్రతివతి నమస్కారము నాలుగుచేతులతో చేస్తోంది. స్వామి ఉబ్బులింగడాయె. ఇంక లోటేమిటి?

కలవారి కోడలు కలికి కామాక్షి పుట్టింటి ప్రయాణము చూడండి. ఆమె పప్పును కడవలో పోసి కడుగుచున్నది. 'అప్పుడే యేతెంచె ఆమె పెద్దన్న; 'కాళ్ళకు నీళ్ళిచ్చి కన్నీళ్లు నింపె,' "ఎందుకు కన్నీరు ఏమికష్టమమ్మ, తుడుచుకో చెల్లెలా ముడుచుకో కురులు, ఎత్తుకో బిడ్డను ఎక్కు అందలము, మీ అత్తమామలకు చెప్పిరావమ్మ" అన్నాడు అన్న. 'కుర్చీ పీటమీద కూర్చున్న అత్తా, మా అన్నలొచ్చారు మమ్మంపుతారా?' అని అడిగింది. ఆమె 'నే నెరుగనే నెరుగ నీ మామ నడుగు' మన్నది. కామాక్షి వరసగా 'పట్టెమంచము మీద పడుకున్న మామ' నీ, 'భారతము చదివేటి బావ పెదబావ' నీ, వంటచేసే తల్లి 'అక్క' గారిని పై రీతినే అడిగి అందరూ అలాగే 'నే నెరుగననీ' తరవాతి వారి దగ్గరికి వెళ్ళమనగా, చివ్వరికి 'రచ్చలో మెలిగేటి రాజేంద్ర భోగి' ని అడిగింది. అయనగారు 'పెట్టుకో సొమ్ములు కట్టుకో చీర, పోయిరా సుఖముగా పుట్టినింటికని' అన్నాడు. సామాన్య జీవితములోని ఈ చెలువుతనముక పండితుల దృక్పథంలో పడగలదా? దీని బరువంతా నియమబద్ధమైన అవిభక్త కుటుంబంమీద వుంది. అయినా కామాక్షీ కాముడు 'రాజేంద్ర భోగి' హుందాగిరీ చక్కగా కనపడుతుంది. బాలకృష్ణుడు పళ్ళుకొనుక్కునే కథవినండి చిత్రంగా వుంటుంది. 'అంగడికి చెంచెత పండ్లమ్మ తెచ్చె', 'అమ్మ నాకో పండ్లు అడిగె కృష్ణమ్మ, 'ముంగిటా వున్నాది ముత్యాలరాశి, వట్టింట వున్నాది రత్నాలరాశి, తవ్వకో కృష్ణమ్మ దోసిళ్ళనిండ' అన్నది గోపెమ్మ.

'పట్టవే చెంచెతా పెట్టవే పండ్లు' అన్నాడు స్వామి. పెట్టంగ ఒక పండు గంపలో పడెను. సరే, జరగవలసి వది జరిగింది. గంపలో పండ్లన్నీ కనకంబులాయె, గంపకిందీ చుట్ట మాణిక్యమాయె, అది కట్టిన మసిపాత పట్టుచీరాయె. కోరిన కుచేలునికి సిరి ఆలస్యముగా అందింది కాని కోరని చెంచెతకు విశ్వవిభుని కర స్పర్శ సద్యఃఫలితము నిచ్చినది.

పెండ్లిళ్ళలో స్త్రీలదే పెత్తనము. సరదా, శోభా వారిదే. కనక వారి పాటలలో పెండ్లిళ్ళు ఎక్కువ వినబడతాయి. శాంతా కల్యాణానికి అవ తారిక వినండి:

పదికోట్ల చెలికత్తెలు ఆ పణతిని గొల్చుచుండ్రి
కూతుర్నీ క్షించి రాజూ కుందనంపు ప్రతిమనెను
బాలనీక్షించి రాజు బంగారు బొమ్మనెను
మాతల్లి రమ్మని ఆరాజు తొడలనుంచె
ఆడిక స్త్రీనమ్మ మేనెల్ల చెమ్మటబట్టె
ముద్దుగ నిలిచి ఆబాల ముడిసవరించు కొనెను
తండ్రిచాటున ఆబాల కిలకిలమని నవ్వేను
పెండ్లి ప్రాయము శాంతాకూ ప్రేమతో చేశా
　　　　　　　　　　　　　　　　మనెను

దశరథ రాజు కూడా మనలాంటి గృహస్థుడే. ఆడు తూన్న శాంతను అట్టేచూచి, 'పిల్లకు పెండ్లిచెయ్యా లని సంకల్పించాడు. సీతాకల్యాణం ఈరీతిగా నిశ్చ యము కాలేదు.

'బాలప్రాయమువాడు నాతి పాడుచునూ
వేల్పులె త్తగలేని విల్లు తానెత్తే
చూచి జనకామునీ చోద్యంబు నొందీ
ఈ సీత నెవ్వరికి ఇత్తునని దలచీ
ఘనులు రెవ్వరురానీ కరమునా బట్టీ
పూని వంచితెయిత్తు పొలతివారికినీ'

అని నిశ్చయించుకున్నాడు. 'రఘువంశ తిలకుడు రామచంద్రుడూ, మునుకొని హరివిల్లు ముమ్మారు వంచి, గుణధ్వనులు చేసెను! తరువాత దశరథ రాజుకు 'కబురు' వెళ్ళింది. సన్నాహము చేసుకుని బయ ల్దేరాలి.

'రారమ్మ యీ వేళ రాము పెండ్లికినీ
పట్టంచు చీరెతో పణతి రావమ్మ
మట్టెలా పిల్లేళ్ళ మగువ రారమ్మ
నీలంచు చీరతో నెలత రావమ్మ
చెరుకాకు చీరతో చెలియా రావమ్మ
కరకంచు చీరతో కలికీ రావమ్మ
మల్లెపూవుల చీరె మగువ రావమ్మ
ఉల్లిమళ్ళ చీరె యువిదరావమ్మ'

అని యువిదల నందర్నీ పిలిచారు. వారంతా ముందు పసుపు దంచి, తర్వాత ధాన్యాలు దంచారట. ఎన్ని రకాల ధాన్యాలో చూడండి. "గరుడవాహనాలు గోరీ కుంకాలూ, కురువబాణాములూ, కృష్ణా భోగాలూ, వంకసన్నము పెద్ద వడ్లాణములూ, కంక ణములు లక్ష్మీనారాయణములూ, మా దేవి కాటుకలు మల్లెచిన్నాలూ, దూదిభోగాలను దొంతి మల్లెలును, గోరుప్రాయగాలు గోడబధాన్యములూ, ముత్యాల ధాన్యములు ముక్కుధాన్యములూ, బంగారు తీగెలూ బలిగుతాములనూ, గంగాబాలెలేమి కామభోగాలూ, నీవిశాధాన్యాలూ" దంచినారట. స్త్రీలైతే సాధా రణపు చీరలే కట్టేరు గాని, వారి తాహతు చూడండి. 'పవడంపు రోకళ్ళు బంగారు కట్లూ, మిసిలా చంద్రుని మించు మోములు మెరయా, భాసిల్లు రత్నాల బావిలీలు మెరయా, గంధకస్తురి పూత కలికి చెమరింపా, పందిటి దండలా జారినపయ్యెదలు, కుడి ఎడమ బాహుల కూడి బట్టుచునూ, నాటరాగములతో పాడి ఆడుచునూ, కొట్నాలు తరుణులందరూ దంచే రట...శశిరేఖ పెండ్లి చాలా అల్లరిగా జరిగింది. అందరికీ శశిరేఖ లాగే కనపడే ఘటోత్కచుణ్ణి చూచి లక్ష్మణకుమారుడు

అయ్యరొయ్యి పెద్దపులి అమ్మరొయ్యి పాము
అమ్మరొయ్యి సింహము అమ్మరొయ్యి తేలు
అమ్మరొయ్యి వెలుగుబంటమ్మరొయ్యి శత్రి
అమ్మరొయ్యి గండుబిల్లి అమ్మరొయ్యి రేచు
.................................
అమ్మరొయ్యి రాక్షసి అమ్మరొయ్యి భూతం
(తకతకిట తకతకిట తకతకిట తకతకిట)

'అనుచు గడగడ వణకి అవతలకి' పోయాడు...... లింగంపల్లి గోపయ్య రచించిన వరదరాజు పెండ్లి చాలా సొగసుగా ఉంది. 'కవులకల్ల మేటిరైన కాళి దాసు మదిని దలతు కార్యంపు కర్తయైన స్వామి దల చెదా!' అని ఉపక్రమించాడు పాట, సముద్రుని తనయ పేరుందేవి తల్లిదగ్గరుండగా, 'పొన్నపూలు కోయుటాకు పోదమనుచు' కొంత ఒక్కతె ఆమెను 'కన్ను సన్న జేసి' పిల్చింది. తల్లి 'రాణివాసమెల్ల విడిచి రమణి తోట్ల నెంట నేగ భావ్యమా?' అని గార వించింది. 'వినక నా పెరుందేవి కొంగుగట్టిన వరహా లన్ని పారజల్లెనూ, ఘల్లుఘల్లు మనుచు తన గజ్జె లందెల్ రవము సేయ మెల్లగంధి హారములు మ్రోగ

చుండెనూ, తరుణిచేరు చుక్కబొట్టు నుదుట సొట్టమాలు సేయ, కొప్పున ముడిచిన పూలదండ గునిసియాడెనూ, కన్యకా దిగులు జెందె జాలిపడ్డ చందమయిన తల్లి చేరదీసి అపుడు పోరుమాన్పెనూ, తల్లి గర్భమపుడు కరిగి తనయ నవ్వ దెత్తుకొని పూలు గోయ బోవుమని బుజ్జగించెనూ.' 'పోరుమాన్పెను,' 'తల్లి గర్భమపుడు కరిగి' అని వాద్యము చెయ్యకుంటే హోరాల ధ్వనికి ఇంకా గొప్పశక్తి అలవడియుండును.

పెరుందేవి పన్నీట జలకమాడి చెంగావి చీర కట్టె, వన్నె మీరు జడవేసుకుని, నీటుగా శృంగారించుకుని, పసిడిగూడ చేతబట్టుకుని పొన్నపూలు కోయబోయింది. తోటలో ఆమెకు అతివలంతా 'తక్తు' గావించి, పన్నపూల సురటిగాలి విసిరి, రుద్రవీణ మీటినారు. కుందరదన చేతులెత్తి గునిసియాడింది. అప్పుడు కంచి వరదరాజు పొంచిచూశాడు. ఆయన 'కరుణ' వల్ల కొమ్మలకు కోయకుండానే పొన్నపూలు గూడలలో నిండిపోయాయి. బుజబుజ రేకులూ, నాలు స్తంభాల ఆటా ఆడేరు. అప్పుడు వరదరాజు

పట్టుదట్టి మొలనుజుట్టి బంగారు చిక్కటమున
వంకె మొలనుజుట్టె కంచి వరదుడప్పుడూ
కర్ణమూల చవుకగండు నీలంపు ఛాయ సం
దిట దండలాను వంకీలు మెరయగా
ముని చేతులాకు మంచి ముత్యాల కడియములూ
(తకిట తకిట తకిట తకిట తకిట తకిట తకిట తకిట)
మొలగంటల రవమూలు మ్రోగుచుండగా
(తకిట తకిట తకిట తకిట తకిట తకిట తా:)

వచ్చి, భామయెదుట నిలుచుండి 'చంకచాచి' గెదిరించాడు. అతివలంతా వణుకుతూ నీళ్లలోకి వెళ్లారు. 'పోదురే పణతులార పొన్నపూలసుంక మీక ఏపు మీర మా వనముల కేలవత్తిరే, గూడు కొక్కమాడ యిచ్చి భామ చనుదెంచుమంటె పసిడి బొమ్మ కోపమేలె పణతి నీకునూ' అన్నాడు. అప్పుడా పెరుందేవి పైటచెంగు కప్పుకొనుచు మెప్పుగా పలికె కంచి వరదుతోడనూ 'మాడపుచ్చుకొనాలేవు రూకపుచ్చుకొనాలేవు, నాచేత ఏకా రాగికాసు కొండువటర! జాడజూచి వనములోకి అరుగ' నున్నది. 'కలికి చిలుక నెత్తికొని కంచిపురము కరుగవలె, వలదులార మీరు చనగ వేగిరమ్మనా' అన్నాడు స్వామి. జడిసింది పాపం. 'శనివారమ్ము అని వనాభోజనమ్ము కోస్తె, ఘనము సేసి వోరి యింత ఘాతిజేతువా! కోపినా పువ్వులన్ని కోమలి పారజల్లుకొని,' మరి వేగిరమున బోయి చెలులతో కలుసుకొన్నది. చెలులంతా తన గూడలలోని పూలు ఆమె గూడలో పోసి, భయము వుడిపి గారవించారు. పెరుందేవి ఇంటికివెళ్ళి 'జరిస్తివా' అన్న తల్లికి 'అమ్మా! మాదారికి కుంజరము అడ్డువచ్చిందని' చెప్పి తప్పించుకుంది. కంచి వరదుడు నాటినుంచీ అన్నము ముట్టలేదు. శివుడూ బ్రహ్మసముద్రుడి దగ్గరికి రాయబారం వెళ్ళారు. సరి. ఇక చెప్పడానికేముందీ? ఆకాశమంత పందిరివేసి, భూమి అంత అరుగులూ వేసి పెళ్ళిచేసి, కనకంపు పళ్ళెరములలోని ముత్యాలు తలబ్రాలు పోయించి, అప్పగింతలు పెట్టి సముద్రుడు, కౌగలించి తనాసుతను గారవించి ముద్దుపెట్టి, పూలు కోయబోయి పొలతి విభుని దస్తివా?" అన్నాడు. తరువాత బంగరపు మేడలోను పన్నీరూ, అత్తరూ చిలికించి, మల్లె విరజాజులూ సంపెగలు జల్లిన పసిడి పాన్పుమీద వరదరాజస్వామి పెరుందేవితో 'సుంకరీలంతోటి నీవు జూదమాడి వోడితివా, (ఇప్పుడు) అంత ధనము గెల్చుకొనె ఇందువదనా' అన్నాడు.

పండితుల కావ్యాలు పెండ్లితో సరి. స్త్రీల కావ్యాలు పెండ్లిని ఏమంత పెద్దగా చూడవు. జీవితములో పెండ్లి ఒక్క ఘటన. 'జీవితము పెండ్లితో ప్రారంభము' అనవచ్చును కూడాను. పెండ్లిలోని ఒడిదుడుకులు ప్రారంభిస్తాయి. కనక స్త్రీల కథాగేయములలో పెండ్లిలో ప్రారంభించే అచ్చట్లూ ముచ్చట్లూ అన్నీ ప్రవేశిస్తాయి. శ్రీరాముడు వివాహపు రోజుల్లో ఒకనాడు అలిగి దశరథుని నగరికి (అనగా విడిదికి) వచ్చి మేడలోపల కూర్చున్నాడు. జనకుడు అతని అలక తీర్చుటకు 'తకులకు గుజ్జనలు పోక కట్నాలు, కోకలదిండులే కొమరు రుమాళ్ళు, గంధపు గిన్నెలు పువ్వుల దండలు, సొమ్ముల తలుకులు, నాలుగు వేళ్ళ ఉంగరాల్, నవగ్రాహి బటువు, సన్నదుప్పట్లు, జోడుశాలువలు, నడుకట్లు చిళ్ళల నేవళము బిగువు మొలత్రాడు, పచ్చల పతకములు పతకహారములు, చంద్రహారములు, బంగారు మురుగులు, చౌకట్లూ పట్టించు దోవతులు, జలతారు పాగ బంగారు తురాయి తెచ్చాడు. ఇంతేనా? సీతమ్మని, సిగవేసి, పసుపలది, పన్నీరు జలకముదీర్చి, పారాణి బెట్టి, గజ్జెలు కడియాలు నుట్టెలు పిల్లెన్లు, ముగువక మర్చి, డోమసుమీద చౌడోలు వేయించి, ఢంకా నౌబత్తులు మ్రోయుచుండగా, రంభ పూర్వసి మేనకాదులు ఆడుచూ పాడుచూ ముందురాగా, సకల సన్నాయిలూ కంచుదివిటీలూ, ధవళఛత్రములూతో దశరథ నగరికి జేంచేశారు. దశరథుడు తివాసులు

జంబుకానాల్ కంబళ్ళు చాపలు పర్చిపరిపించాడు. ముత్యము లమర్చిన ముకురముల యెదుట, రత్నాల దీపములు రంజిల్లుచుండగా ముత్యాలగద్దెపై మురహారిని ఉంచి, రత్నాలగద్దెపై సీతమ్మనుంచి, రాము వద్దను సీత గూర్చుండబెట్టి, రాముణ్ణి బ్రతిమాలుతున్నారు.

గుర్రమునెక్కి ఈకొమ్మ వచ్చినదీ
గోత్ర చింతామణి లేచిరావయ్యా
అందలము యెక్కి ఈ యతివ వచ్చినదీ
అందమయిన పెండ్లికొడుక లేచిరావయ్యా
మట్టెలా పిల్లేళ్ళ మగువ వచ్చినదీ
మదన కందర్పుడ లేచిరావయ్యా
నూడిదమ్ముల్లపెట్టి సుదతి వచ్చినది
చుక్కల్ల చంద్రుడ లేచిరావయ్యా

అని అనేక విధాల బ్రతిమాలితే నోరువిడింది స్వామికి.

ధర్మసరుకులు రెండు జారి చెంబులనూ
అరణమిస్తే కాని లేచిరానెనూ
అధిక సంపన్నుడే మామ జనకుండు
ఇచ్చాను శ్రీరామ లేచిరమ్మనెనూ

కాని అది ఒక్కటే కాదు ఆయనగారికి కావలిసినది! మంచి గంధపు చెక్క చుక్కల్లపాన, ఘుమిడి సున్నపు కాయ చిలుకలసెకత్తెరా, బంగారు గొలుసుతో పావురము పిట్టా, వెండికొగులు మంచి ఘుమిడి గోలెములూ, పాడావుల మంద, పంటభూములూ, అరణమిస్తేగాని లేచిరా నన్నాడు. జనకుడు అన్నీ ఇచ్చాడు. ఆణి ముత్యాల అమరపతకాము, ఆ సీత వేసెను రాముని మెడనుసీతదగ్గరకురా గానే 'సిగ్గునశ్రీరాముడిగ్గువాలేనా' సరి,ఇటువైపు మురిపెము తీరిపోయింది. ఇంత అల్లరి చేశాక పేరంటాండ్రు ఊరుకుంటారా? 'గుఱ్ఱము లేదనీ యేలలిగినావూ అందలముయెక్కి నీవు లేచిరావయ్యా, పల్లకీ లేదని యేలలిగినావూ పక్షితేజినెక్కి లేచి రావయ్యా,' అని దెప్పి, 'పత్తిగింజల కుడితి పాచియున్నాది, పాడావు మందలకు పంపిరావయ్యా, చేబియ్యమన్నము చెల్లకున్నాది వదినె మరదళ్ళను చెల్లించమనుము,' అని ఎగతాళిచేస్తూ సీత విడిదికి తీసుకువెళ్ళారు. పెళ్ళిళ్ళల్లో జరిగే అచ్చట్లూ ముచ్చట్లూ అన్నీ సామగ్రే స్త్రీలపాటలకి. స్త్రీలు నిన్నటిదాకా కేవలం గృహిణులే. కనక గృహజీవిన ఘట్టాలన్నీ వారి కానందదాయకాలే. ప్రతీ ఘట్టము లోనూ సొగసుంటుంది. ఈ సొగసే స్త్రీలపాటలకి ముఖ్యాధారము. సీతని అప్పగిస్తున్నారు: "నెయికాచ నేరదు నెలత ఓ వదిన। నేర్పుతో పనులెల్ల నేరుపావమ్మ। మా బాలలలో నొక్క బాలగా చూడు। బుద్ధి తెలియగదు మంకు బుద్ధులే కాని। బుద్ధివచ్చినదాక దిద్దుకోవమ్మ।" ఇవి మన పిల్లలపట్లనే చెల్లుతాయి గాని సీతమ్మకు చెల్లవని అందరికీ తెలుసు. ఇక లక్ష్మీదేవికి బుద్ధులు చెప్తున్నారు వినండి. "చెలగి మా అత్తింట్లో బుద్ధిగనుండవమ్మ — యెవ్వ రేమాడినా యెదురాడకమ్మ—పలుమారు పలుకరచి నవ్వబోకమ్మ—నాతోటి చేసిన మంకుపోరల్ల—యెరుగని అత్తింట్లో చేయబోకమ్మ—నెలవంటి బాలుడే నీల మేఘమురీతి – నెలతరో యెడబాయకుండు మాయన్న—యిన్నాళ్ళవలె కోపముందబోకమ్మ—నీవు యేమన్నాను మేము విన్నాము—అత్తవారింట యేమన బోకుమమ్మ" అని. అన్నీ తమ పిల్లకేనా? అల్లుడికో? "అల్లుడవూ, చెలికాడవు తల్లివి దండ్రివి నీవే" చాలు. లక్షలు చేస్తుంది ఆమాట. ఇక బయలుదేరించి, 'మదపుటేనుగులు పదివేయి। గడియెక్కిన తేజీలు లక్షలు గుర్రములు గట్టియిచ్చె। భామలు భూములు రత్నపు సొమ్ములు భాను తేజ కపురుదూ। బంగరు రథములు పల్లకీలనేకుడు తాను యిచ్చే।" సారెపెట్టి సీతమ్మని అత్తవారింటికి పంపేరు.

తల్లిదండ్రులూ బంధువులూ ఒప్పుకుని చేసిన పెండ్లిలో ఈ ముచ్చట్లు అన్నీ తీరేయి. అర్జునుడు సుభద్రని ఎత్తుకుపోయాడు. అతనికి ఈ అంకాలు ముట్టలేదు; సుభద్రతో అంటాడు: "పున్నమ్మవాడైన అట్లు వండుకుని, అల్లుడా రమ్మనిపిల్చిరె మీవాళ్ళు, కనుము నాడైనాను గారెలొండుకుని, కాముడా రమ్మని పిల్చిరె మీవాళ్ళు?" ఆమె ఏమి తక్కువదా? "మావాళ్ళు పేదవాళ్ళు మాకేమిగలదు, పెట్టగల పెద్దింట పెళ్ళాడితేను, అచ్చటా ముచ్చటాలన్నియూ జరుగు" నన్నది. మగరాజుకి కోపము వచ్చింది. 'అతివ పల్కులువిని గుడ్లెర్రజేసి, రోషము మీసం దువ్వి పాంకోళ్ళు యెత్తి, పావకోళ్ళతో తన్ని పక్కనా నవ్వె.' పాపము ఏంచేస్తుంది? 'అరటాకు వంటేది ఆడజన్మంబు.' 'గోలుగోలుమని గోడపై కొరిగి, వంటి సొమ్ములందీసి భరణిలో నుంచి, మాసిన బట్టగట్టి ముసుగులువిప్పి, మువ్వలముద్దుణ్ణి చంకబెట్టుకుని, వెళ్ళెను సుభద్ర అన్నవాడిలకు. వాకిళ్ళ వారన్న నిద్ర శయనించె.' వదిన యెదురుగావచ్చి, ఆడబిడ్డను చూచి అతి జాలినొంది, 'నిద్రబోతున్నావు నీలవర్ణుండ, నీ చెల్లెలొచ్చింది నిద్రలేవయ్యా' అని లేపింది. 'నా ముద్దుచెల్లెలా ఏమె సుభద్ర, యేనుగలు ఉండంగ గుర్రాలుండంగ, హొదాలుండంగ పల్లకీ లుండ, కాలినడకలతోను వంటరిగ నీవు, విడిబడి

వచ్చుటకు వరిగడ్డమేమెరా?" అని బుజ్జగించాడు. చెప్తోంది.

"పున్నమ్మ నాడైన బూరెలొండుకుని
పుణ్యుడా రమ్మని పిల్చిరె మీవాళ్ళు
అమవాస్య నాడైన అట్లు వండుకుని
అల్లుడా రమ్మని పిల్చిరె మీవాళ్ళు
.............................
పుల్ల విరుపుల మాటలాడి పురుషుండు
సుల్లెర్రగా జేసి పాదాలవిస్నె"

పాపము కష్టపడ్డాడు ప్రభువు. చెల్లెలను వోదార్చ చేరంగ దీసి, 'కంట తడిబెట్టకుమ కాంతరో నీవు,' అని,

"దండెమున్నా వున్న కొత్తచీరల్లు
ఇవిగోనె చెల్లెలా నీకు అరణమ్ము
పెట్టెలో వున్నాయి పట్టుచీరల్లు
ఇవిగోనె చెల్లెలా నీకు అరణమ్ము
గూట్లోను వున్నాయి గుండు గిన్నెల్లు
అటక మీదున్నాయి అంచు బిందెల్లు
ధరణెల్లో వున్నాయి పతకముల పేర్లు
ఇవిగోనె చెల్లెలా నీకు అరణమ్ము"

అని సుభద్రకు సారె ఇచ్చిపంపేడు.

సారెలూ, అరణాలూ తప్పవే అవసక్కర లేదు. ఏపాటె మనసెరిగి వర్తింపకున్నా వధువుకి చిక్కే. ఒకనాడు శ్రీరాముడు పడకటింట సీత కొరకు ఎదురుచూచాడు.

'జాజుల తనువునా జవ్వాది యలది
వేచియు తానుండె దేవిరాకలకు
ఎదురెదురు చూచెనూ వెలదిరాదనుచూ
తెవెవచ్చ్యోరాదని తొందరా పడుచూ
సూర్యవంశజా డపుడు చాల కోపించి
ఘడియ గ్రక్కున బెట్టె కౌకుస్థతనయుం
సీతతో నీ పనులు శోధిస్తు వేగ
అవనిజా మైమరచి నీవు ఉన్నావ
అనుచు తలపంకించి కడు భ్రమను జెంది
శయ్యపై పవళించె రామచంద్రుండు'

ఇక సీతమ్మో! 'అత్త కౌసల్యకు అడుగులువత్తి, మామ దశరథులకు మడిచలందిచ్చి, సుమిత్ర కైకకూ సుర టీలువేసె—పరగ కౌసల్యకూ పాన్పునూ పరచె (సీతమ్మ!) తరవాత 'మజ్జనంబులుజేసి పసుపుల్లు బూసి, బంగారు పూలచీర బాగమరగట్టి, దువ్వి పాపటతీసి తింత్రిణీబెట్టి, తింత్రిణీలా ముత్యాల పతకంబుబెట్టి—రవ్వలా ముత్యాల జల్లిడిగవేసి—వేయి జేయు కమ్మలూ వెలయంగబెట్టి—రెండువేలూజేయు హారములు వేసి—మూడువేలూజేయు ముంగెరాబెట్టి నాలుగువేలూజేయు నాను మెడవేసి — పదివేలూ జేయు పతకంబుబెట్టి—గంటల వడ్డాణం కాంత తాబెట్టి—నీలాలు తాపిన కీలుకడియములూ—నీల వర్ణుని దేవి నేవళంబెట్టె — కడనుంచీ కన్నులకు కాటుకాబెట్టె—ఈ సింగారాల దండికి నాయకమణి చూడండి.' నిలువుటద్దములోన తన రూపుజూచి—చూచి ముచ్చటజెంది మగువనవ్వుచును,' జిలుగు బుటేదారు పచ్చడం గప్పి—బంగారు కలశముతో ఉదకంబుబట్టి — మల్లెలు మొల్లలు విరజాజులును కొప్పున ముడిచి సంతోషమున విభునిదగ్గరకేగ నిందీవ రాక్షీ. కాని ఆయన తలుపులు బిగించాడు. 'తలుపేయ కోపమును తాళనూగలనా' అంది, నిలుచుండ పాదాలు చేతులును నొచ్చె, నంది. 'పటపటా చినుకు పడి పైకొంగు తడిసె' నంది. 'రత్నహారం బిస్తు తియ్యవో ఘడియ' అంది. కరుణించి దీస్తివా కాళ్ళ కడనైన, మరచి వక నిద్రైన శరనొందిపోదు' నన్నది. తీశాడు కాదు. అత్త కౌసల్యకు అన్నీ చెప్పింది. ఆమెవచ్చి. 'దశరథుల పుత్రుడవు జనకు లల్లుడవు—భూమి దేవల్లుడివు బుద్ధటరనీకు, సీత జేసిన తప్పు శీఘ్రమున జెప్పు' మన్నది. ఏమి చెప్పగలడు? తప్పే కాదు: 'అమ్మ నీ కోడల్ను అతి గారవమునా—నలి నాక్షీ పెంచితే నన్ను గైకొమనా' అని చిరునవ్వు నవ్వుచూ, రాముండు తీసెనూ తలుపు.

సాధించింది సీతమ్మ. చూడండి విజయగర్వము! 'మా మామ దశరథు వక్కరున్నారు, అత్త మీరూ పొండి మా మామ కడకు' అని చెప్పింది. 'ఆడవారి కోపంబు రొట్టెతో యనుచు—నుల్ళి పరుండెను రవి వంశజుండు.' 'అగ్గి చెంతటె వెన్న యెంతతడవగునో, ఆడవారి కోపమ్ము అట్టిదే యనుచు, శీఘ్రమున కలిసెను శ్రీలక్ష్మి యంత'...ఈ కథలన్నీ సామాన్య గృహస్థుల ఇండ్లలో జరిగే కథలే. వాటికి కావ్య గౌరవము తేవడానికి ఓ వాతావరణము సమకూర్చారు కవిగారు. ఆ కూర్పులో కనబడుతుంది మనకి వారి కల్పనా సౌందర్యము. అనుభవాల్ని పెంచి అందంగా రచించడమే కాని అతిలోక దృశ్యాల్ని భావనా బలమువల్ల సాధించే యత్నము ఈ పాటల్లో కనపడదు. వీటిలోని పాత్రలందరూ ఈ లోకము లోని వారే. ఆకాశము మీదనుంచి ఊడిపడ్డవారు కారు. కనక కథాసౌందర్యమే మనకి స్ఫురిస్తూ వుంటుంది గాని రచనాచాతుర్యము స్ఫురించదు.

కవులం పాటలో నంతటా అదృశ్యులే. పాట చివర కూడా పేరుపెట్టుకోరూ. వారి స్వార్థమంతా కలిపి, ఫలశ్రుతి రూపాన్ని "పుడమిలో ఈ పాట పాడినా విన్నా—అయిశ్వర్యవంతులయి అతివలుం డెదరూ" అని చివ్వర వుంటుంది. దేశి సారస్వత మంతటా ఈ ఫలశ్రుతి కనబడుతునే వుంటుంది.

మాటల సందడిని దారి తప్పిపోయాము. శ్రీరాముని కోపాన్ని కాదూ చూచాము? సీతామ్మవారి అలక చూద్దాము పదండి. ఆటకూటములో ఆటచే అలసి శ్రీరాముడు చెమట తుడువరమ్మని సీతమ్మను బిలిచాడు. ఆమె 'చిలకకు మేతిడుచు చీకాకు పడెను.' దానితో శ్రీరాముని రౌద్రని కనులకు కోపము వచ్చింది. పువ్వులబంతితో పూబోణిగొట్టె.' ముద్దరాలు సీతమ్మ మూర్ఛబోయింది. పరిమళపు పన్నీరుజల్లి, మల్లెపూవుల పాన్పువేసి, శేట వుదకముతో ముఖము కడిగితే ఆమెకు తెలివొచ్చింది. కోపముతో వంటి స్తంభపు మేడలో, పైడి తరిమెనకోళ్ళ పట్టెమంచమున ముప్పదిమూరల ముతక పచ్చడము ముసు గమరబెట్టి కలవరంబుతోడ కొంత నిద్రించె. రాముడి కాపంగతి తెలిసింది. ముద్దుచిలకని 'కొమ్మ జాడలు నీవు క్రమ్మర దెల్పుము'న్నాడు. కీరవాణిని జాడ కీరమంతటను ఆకాశవీథేగి అచ్చటను వ్రాలె. ఉత్తరపు ద్వారమూ, దక్షిణపు ద్వారమూ, తూర్పు పడమరల ద్వారాలూ మూసిఉన్నాయి. గాలి తెరతో కిటికీలద్వారా వెళ్ళి 'పణతిదగ్గర జేరి పాదముల కెరగె. ఆమె మొక్కు పుచ్చుకొనదు మోమెత్తదు. చిలక అడిగింది. 'భూదేవి కూతురవు యిన బుద్ధి నీకు, ఆటపరియాచకము అది తప్పులగునా' అని సీతమ్మ తన 'తప్పు' చెప్పి 'మగవారి కింత దురుసుతనమేల' అని చిలకను పొమ్మంది. చిలకవెళ్ళి రాముడితో చెప్పతున్నది: 'పువ్వుల వంటిది పూబోడి దేహం కాక మాటలకు కాగియున్నాది' అని చెప్పింది. శుకము మాటలు విని రాముడు లేఖ రాసి పంపేడు. చిలక మళ్ళీ బుద్ధులు చెప్పబోయింది. సీతమ్మ 'వదరకే వో చిలుక వద్దనుండాకు, తలబగల గొట్టేను తన్ని చంపేను' అని బెదిరించి తరిమేసింది. అప్పటికి లక్ష్మణస్వామి వేటనుంచి వచ్చాడు. చిన్నబోయిన చిలకనుంచి సంగతులు తెలుసుకుని, దానికి అసలైన మంత్రము చెప్పాడు. చిలకవెళ్ళి సీతకి వినబడేటట్టుగా 'రఘురామ వంట్లోను లఘువు దప్పింది' అన్నది. వెంటనే శుకవాణిలేచి బయల్దేరింది! తిన్నగా పడకటింటికివెళ్ళి రామభద్రుడు గప్పిన ముసుగు తీసింది. 'ఫక్కు'మని నవ్వేనే బాలరాముండు.' ఈ మాయ లెవరు కల్పించారు? అని అడిగితే సౌమిత్రి కల్పించా డన్నాడు. కథ తిన్నగా, సూటిగా, నేటి చిన్న కథలాగ సాగిపోతుంది. పేరుకే రాముడూ సీతా, కోటలూ, ఒంటి స్తంభాల మేడలూగాని, పెంపు అంతా మన జీవితాల్లోని ఒడిదుడుకులే. ఈ సుందరశయ్యలలో పురాణగాథలు ప్రవహిస్తాయి. శయ్యలు పరిచితములే అయినా నీరు కొత్తనీరు. ఇంపుగా ఉండదా మరి? గాథలు పౌరాణికములు కావు; జీవితఘట్టాలే అవడానికి ఉపపత్తి ఈ గాథల వక్రగతి. పురాణగాథలకి విరుద్ధముగా కూడా వుంటాయి కొన్నిచోట్ల. 'సుభద్ర సారె' లో అర్జునుడు కోపంవచ్చి తంతే సుభద్ర 'ముద్దులా ముద్దుణ్ణి చంక బెట్టుకుని, గంటలా బాలుణ్ణి చెట్టబట్టుకుని' అన్నవాడలకు వెళ్ళిందిట. సుభద్రకి ఇద్దరు కొడుకులెవరూ? 'సీతామ్మవారి వసంతం'లో 'జపమంటపములోను జగదేకరాము, కనులు మూసుకు జపం చేయుచుండగను, గంటల వడ్డాణం మ్రోయకుండగను, పందిట గజ్జెలు ఘల్లుమనకుండ, పాదాల అందెలు రవము విడకుండ, స్వర్ణకలశముతోను వసంతము దెచ్చి, చల్లి యా పద్మాక్షి జరిగిపోయిందట. శ్రీరాముడు జపము చేశాడా? సరే, దానికేమి అసలు కథ వినండి. సీతా మహాదేవి (శ్రీరాముని మరచి) చెల్లెండ్రతో బొమ్మరిల్లు కట్టుకుని ఆడుతోందట. శ్రీరామచంద్రుడు ఆమెని ఉడికించాలని, రంభాదులను పిలిచి ఆడించాడట. ఏమిటీ గలగలలని సీత బంగారు తలుపు కొంచెము లాగిచూచిందట. రాముడు సీతను చూచాడట. అంతలో ఆమెకి అతనివిూద (ఆ రకంగా వినోదిస్తున్నందుకు) కోపమువచ్చి ఆ పసిడిమేడలు దిగిపోయిందట. రాఘవుడు సీతమ్మ తన్నుజూచి రంభానాట్యముచూడక మరలిపోయినదని ఆమెను పిలుచుకరమ్మన్నాడు. 'నాకు సిగ్గమ్మ నేను రానం'ది. చెల్లెళ్లూ అందరూ వచ్చి తీసుకువెళ్లారు. ఆమె రాగానే రాఘవుడు ముత్యాలహారాలతో పైడి స్తంభాలకు పణతిని ముడివేసి, 'జానకీ, పాపము సిగ్గానీకూ, విల్లు విరవడానికి మేము వచ్చినప్పుడు ఆ సభలో ఉండడానికి సిగ్గు రాలేదా? నీనాటకం నేనెరుగుదునులే' అన్నాడు. ఆమె తల వంచింది, చేతులు వణికేయి. మనసులోని గురగుర పేరూ! నీలవర్ణుండు అర్ధాంగినెత్తుకుని అంతఃపురములోకివెళ్ళి సేవచేశాడు. ఆమె గునిసింది. ఆ నొడవలో పూబంతి తగిలి ఆమె మూర్ఛపోయింది. చెలికత్తెల్ని పిలిచి వారి కప్పగించి వెళ్లాడు. తేరుకొన్న తర్వాత మళ్ళీ బొమ్మరిల్లాటలు ప్రారంభించారు. కౌసల్య

అక్కడికివచ్చి, అన్నపానాదులు లేకుండా ఆటలేమి టని సీతమ్మను తీసుకువెళ్ళి పెడిపళ్లెములో భోజనము పెట్టింది. సీతమ్మ భోజనముచేసి, రాముణ్ణి వెతుకుతూ, జపమంటపములో చూచి, పైన చెప్పినవిధంగా వసంతం జల్లి మెల్లిగా అత్తలలో చేరింది. వారీమె జాడను గుర్తించి, 'ఏమమ్మా నీగుండెలదురుచున్నాది, నీతోటి ఆడేవా చెలికత్తెలెవరు, నినుబట్టుకోరాగ పారివచ్చితివా?' అని దగ్గరతీశారు. జపమును చాలించి జగదీశుడపుడు, కొప్పెర్ల వసంతం కోరిచేయించి, చిమ్మన గ్రోవితో వసంతము తెచ్చి, చెలియనో నామీద వసంతముజల్లి, నుచ్చువలె నే వచ్చి దాగియున్నావా?' అని వసంతము సీతమ్మమీద పోశాడు. ఇంతలో కొలువు చాలించి దశరథేశ్వరుడు వచ్చి, సీతమ్మని చూచి, 'ఇదియేమిచోద్యమని అడిగేడు. కౌసల్య చెప్పింది. దశరథునకు నేను చూపలేదు, ఏదేది మళ్ళి కానిమ్మని సుమిత్రను కోరేడు. ఆవిడ రాముణ్ణీ సీతనీ రప్పించి కొప్పెర్లలో చేయించిన వసంతం కిర్చి పెట్టించింది. ఎంత ఉజ్వలమైన పాత్ర స్త్రీలపాటల లోని సీత! మునిమాణిక్యంవారి కాంతానికి గురువు. రాముడు మునిమాణిక్యంకంటె ఘటికుడు. అయితే అడుగడుగు మరిచిపోయినానూ, దశరథుడు దెక్కణ్ణించి వచ్చాడూ? ఈపాటలలో వాల్మీకి కథ అందపు మెలికలు తిరిగింది. ఊర్మిళా, మాండవీ, శృతకీర్తికూడా కనబడుతున్నారు. రచయితమాత్రము అజాంతా చిత్రకారులవలె అదృశ్యులైయ్యే ఉన్నారు.

ఈ కథలన్నిటిలోనూ ఇన్ని వేశచమత్కృతియే గాని కథాచమత్కృతి ఉండదు. అందమైన ఊహా చుట్టూ అల్లుతారు ఒక బంగారపుగూడు. 'సీతాదేవి వామనగుంట లాడుపాట'లో ఆ ఆటే వినోదము. 'లక్ష్మీదేవి సొగటాలాట'లో రుక్మిణీకృష్ణుల అలంకృతి ఎక్కువగాఉంటుంది. వారిద్దరూ 'తిత్తిగతివంచా అది చక్కా పగడా అచ్చరిక అచ్చొగ అతిభార యనుచు పందెములువేసి ఆడుకొంటగా, కృష్ణునికి ద్రౌపది మొర్ర వినబడింది. ఆయన 'అక్షయ' మని పాచికలు వేశాడు. అక్కడ చీరలూ రవికలూ అక్షయమైపోయాయి. ధృతరాష్ట్రుని కొలువు కూటమున కలవారెల్ల పట్టుచీరెలు బంగరు రవికెలు కట్టుకొనిరట నీరజాక్షులు. అది గుర్తించి శ్రీకృష్ణుడు పక్కుననవ్వి నాడు. ఇక్కడ రుక్మిణికి నవ్వు అర్థము కాలేదు. తన పూర్వచరిత్రని తలుచుకున నవ్వేడేమోనని చిన్నబుచ్చుకుని అడిగింది. ఆయన ఆమెసందేహము తీర్చేశాడు... కృష్ణుడు సత్యభామవలలో తగులుక్కున్నాడని రుక్మిణి పలవించడమే 'రుక్మిణీదేవి ముచ్చట్లు!' అక్కడ సత్యభామ కృష్ణుడిముందు ఆతని అవజ్ఞని ఆడిపోయ్యేను 'సత్యభామ సరసము!' సీతమ్మ రెండునెలల గర్భిణీఅయివున్నపుడు శ్రీరాముడు ఆమెఅశ్రద్ధనుచూచి 'ఏమి జనకసుతే నీవున్నదినము, కారడవి తిరిగావు కష్టపడ్డావు ఆనాడు ఈరీతి వదిలుంపలేదు' అని విచారించి 'నీవిగ్నము లక్ష్మన్న కరిగించవలెను (!)' అంటాడు. ఒకగడియ లక్ష్మన్న లేకపోతే గడువదు శ్రీరామునికి!...సీతమ్మ శుభగోష్ఠి కోరింది రాముణ్ణి ఒకనాడు. ఏకథ చెప్పగలదూ? తమకథ నేచెప్పాడు. ఇది "సీతశుభగోష్ఠి"! అశోకవనములోని సీతకోయిలతో, 'మెడలో హారంయిస్తా కోయిలారో, ప్రాణేశుతో దెమ్మ కోయిలారో' అని 'కోయిల రాయబారం' పంపుతుంది... ఈ వినోద కథాగేయాల తలమానికము 'సీతాదేవి ఆనవాళ్ళు' సంస్కృతకావ్యాల్లో మేఘసందేశం ఎలాంటిదో స్త్రీలసారస్వతములో సీతాదేవి ఆనవాళ్లు అట్టిది. సీతమ్మను గుర్తించి నమ్మించుటకు ఆనవాళ్ళిమ్మని హనుమంతుడుకోరితే, తమ సుఖజీవనములోని ప్రణయఘట్టాలు శ్రీరాముడు నెమరువేసుకుంటాడు. వాటిని పట్టికవేసి పాడుచేయ్యను. చదవండి 'సీతాదేవి ఆనవాళ్లు.'

'ఉషాస్వప్నము'లో ఘటనే ఏదీలేదూ! అనిరుద్ధుని కలగన్న ఉషతీరు వర్ణిస్తారు చెలికత్తెలు. ఇందులో బాలికల ఆటలపట్టిక చక్కగా ఉంది! 'కుందెనగిరి, గుప్పచ్చి, గుడిగుడిగుంజము, దాగుమూతలు, ఊగుటుయ్యెల, దాటిబిళ్ళ, తట్టిఆట, కన్నెఆట, నెత్తపరాళ్ళు, కత్తిబద్దాట, వామనగుంటలు, పాచికలు, వాలలు, జంతులు, చింతగింజలు, బొమ్మలు, బూజము, నిమ్మలు, వాయప్పనవలము, ఆకునెమ్మలు, వరుసలు, గొల్లచల్ల, వన్నెలవత్తులు, దుద్దుకదురు, కాళ్ళగజ్జె, వెలగమొగ్గ, దోపుడుపుల్ల, తామరమొగ్గలు, టెల్ల, చమ్మచక్క, లోపబంతి,' వంటి ఆటలేవి ఆడదటఉష! చెలికత్తెఒకతే 'తారొత్తుగట్టిదను తరుణీరో చెప్పవె తగదిటు కృశియింపగ' అన్నదట. ఉష అనసవ్వచు 'భూతమంటలే దలివరో యాత్మచోరుడువచ్చెనే' అన్నది. 'అనగానె చెలికత్తె అంతయును దెలిసికొని అతివ యింద్రుడు వచ్చెనే' అనగానె కాదమ్మ యమరనాయకుడన్న నతిపాప మబ్బునాకు 'మళ్ళి చెలికత్తె అబ్జభవుడు, పార్వతీవిభుడు...' ఇలాగ తెనిసినవారినందరినీ ఆక్షేపకారంగా పేర్కొని చివరకు అనిరుద్ధుణ్ణిచెప్పి ఉష తలవంచితే చేతితో తలగొత్తినవ్వినా, ఉష సిగ్గుతో తలయెత్తలేదట! ఈపాటలలో చెప్పినపాదములానే మళ్ళీమళ్ళీ చెప్పడము మామూలు. ఉషాస్వప్నము, శ్రీకృష్ణుని జననము, లక్ష్మీదేవి సొగటాలాట,

సీతామ్మవారి అలక, గంగాగౌరీ సంవాదము, ధర్మరాజుజూదము, సత్యభామసరసము, వీటన్నిటిలోనూ ఎక్కడో ఒకచోట చెప్పినమాటే కొంచెం మార్చి చెప్పడము కనబడుతుంది. అవతారాల ప్రశంసకివీలుంటే సరి అన్ని అవతారాలూ ఏకరువు పెట్టేస్తారు. నగలు, ధాన్యాలూ, సేనలూ, పువ్వులూ, లాంఛనాలూ, ఆటలూ వీటిపేర్లన్నిటినీ సందుదొరికితేచాలు ఏకరువు పెట్టేస్తారు. చెప్పినపాదాలే మళ్ళీ — ఒక్కమాట మార్చి చెప్పడము పురాతనపు కథకళకొక్క. చిన్న పిల్లలకిచెప్పే పేదరాశి పెద్దమ్మ, ఏడుచేపలూ, నూతిలో పడ్డనూడీ, చలిచీమా పులిచీమా, కోతిముల్లు—, కథల్లోవచ్చినమాటలేవన్నా వినే లేతమనస్సులకి కథ తెలుస్తోందన్న నమ్మకం పుట్టిస్తాయి. చిన్నపిల్లల్నించి పెద్దవారిదాకా అందరూ వినే ఈ పాటల్లోని అ(మేడితొలుకూడా అందుకేనేమో. ఇక వస్తువిధూతినివర్ణించడము ప్రబంధాల వన, సరోవర, వర్ణనలలోనూ, పెళ్ళిళ్ళలో ముహూర్తానికి ముందుచేసే రత్నాలా—, దేవాలా—, పట్టికల్లోనూ, ప్రబంధాల ఆశ్వాసాంత పద్యాలలోనూ మనకి గోచరిస్తూనే వుంటుంది. ఇది ఒకరకమైన విద్యావిధానం. స్త్రీలకి పాటల్లో ఇవ్వడం సులువు. అందు కవతరించాయేమో ఇవి.

ఈపాటల్లో ఒక అవతారానికీ, ఇంకొక అవతారానికీ కథలోనేగాని వ్యక్తుల్లో తేడా లేదు. కృష్ణుణ్నీ, రాముణ్నీ, వామనుణ్నీ ఒక్క వ్యక్తిగానే జమచేస్తారు ఈ పాటల కవులు. అలాగే రుక్మిణీ, పెరుంబేవీ, సీతా, ఒక్క వ్యక్తే — లక్ష్మి. ఇంత మాత్రంచెప్తే దీనిసొగసు తెలియదు. రుక్మిణీదేవి సీమంతములోకృష్ణుడు రుక్మిణితో 'నాతిరో నీకేమైనా మనసులు కలిగున్నాను! నాగలోకమంతా సాధించి తెచ్చేనే!" అంటాడు. అందుకు లక్ష్మిదేవి "ముందు రామావతారములో మునుపడిగిన కోరికకూ, తమ్ముని యడవులకిచ్చి చంపబంపితిరి మీర"నెనూ. దీనికి ప్రభువు సమాధానము చెప్పలేదు. వామనుడు రెండడుగులతో భూమ్యాకాశా లాక్రమించి మూడోఅడుగుకి చోటు చూపమంటాడు. దానికి బలిచక్రవర్తి జవాబు 'కాళింగుశిరసుపై నుండుపాదములు। అహల్యశాపంబు బాపు పాదములు। నా తలమంచుమి నళినాయతాక్ష!' అని. తన్ను కరుణించిన బాలకృష్ణుని అర్చించుటకు కాళింగుని గంగాజలము తెప్పించి, 'అవనియొక్కడుగుగా గొలుచుపాదములు, అహల్యశాపము బాపినట్టి పాదములు, బలిశిరస్సున మోపినట్టిపాదములు' భమిడి పళ్ళెరములో భక్తితో నుంచి, కడిగినాడట.

ఇవీ, ఇంకా ఇలాంటి ఉదాహరణలూ చూస్తే ప్రబంధకవులలోవలెనే గేయకవుల వంగడములోకూడ తమ పూర్వులు రచించినగేయకావ్యాల్ని చదివి అందమైనచోట్ల వాటి ననుకరించడము కలదని తెలుస్తుంది. 'కాళింగమదుగు'లో కాళింగుని భార్యలు కృష్ణుడితో అంటారు: "అబలప్రాయమునాటిదది పెండ్లిగాదూ, నీవుకేయుమి పెండ్లి నిక్కముగ నాకు"అని. రుక్మిణీదేవి సీమంతములో కృష్ణుడీకథని రుక్మిణితో చెప్పతూ, "నీవుజేసినదీ పెండ్లి నిక్కమూ భద్రమూ। చిన్ననాటిది పెండ్లి మరి పెండ్లిగాదని' పలికినా రంటాడు. 'యశోద కొంగపాట'లోనూ 'సుమ్మడి పాట'లోనూ కూడా నోరు తెరచి సకలబ్రహ్మాండమునూ చూపిన కృష్ణుడికి యశోద "కన్న బలిమిని నెరతువని పలికితిని గాని" అంటుంది. "కన్న బలిమి" అన్నది చక్కని మాట. ముందు యశోద కొంగపాటలోనున్న ఈ జాతీయాన్ని 'సుమ్మడుపాట' రచించిన హరిదాసు గ్రహించి ఈ సన్నివేశాన్నే అందంగా రచించాడేమోనని నా యూహ. ('తిరుమంత్రము' వ్రాసినవాడీ హరిదాసేనా?)

ఈ పాటలఛందస్సు చాలా సరళమైనది. సామాన్యముగా 'తకకిటతక' అనే అరక్షరాల ఆవృతాలు నాలుగేసి ఉంటాయి పాదానికి. ఏపాదానికి ఆపాదమే అయిన శాంతాకల్యాణంలాంటిపాటల్లో, చివ్వరి ఆవృతము 'తకకిటతా' అనీ, సీతాకల్యాణమూ, శ్రీరాములవారి అలకా, సుభద్రసారెవంటి పాటల్లోలాగ 'తకతా' అనీ ముగుస్తుంది. ఈ ముగింపువల్ల పాదము తర్వాతిపాదములోకి ప్రవహించి పాటకి నడక నలవరుస్తుంది. వరదరాజు పెండ్లిపాటలో 'తకిట తకిట' అని ఏడావృతాలున్నా 'తా' అనే ఎనిమిదో అవృతమున్నా చేరి రెండేసిచరణాలుగా నడుస్తుంది పాట. శశిరేఖ పెండ్లి 'తకతకిట'అనే అయిదక్షరాల అవృతాలుగానూ చదువుకోవచ్చు, 'తకకిటతక' అనే ఆరక్షరాల ఆవృతాలుగానూ పాడుకోవచ్చు. మొదటిపద్ధతి ద్విపదకి దగ్గిర. కాని పాటగా దిగేసరికి అరక్షరాల అవృతాలే నడుస్తాయి.

# రంభాకులం

★

శ్రీ భాగవతుల సూర్యనారాయణశాస్త్రి

శ్రీకరంబైనట్టి - సిరిపురములోన
చెన్నొంది యున్నట్టి - శ్రీలక్ష్మిదేవి
వాడలో వెలుగేసి - వాడవాడల నిన్ను
గోముగాకొల్చుకొని - పాడుకొంటున్నాము
జేజేలు గైకొనుము - పూజలివిగో తల్లి—

అంటూ రత్నపురివీధిలో వాకిట నిల్చొని పాడుతూ వుండగా మొట్టమొదటిసారిగా సుందరిని చూసేను. ఇప్పుడిక సుందరిలేదు; సరికదా ఆవాడలో వెలుగేసి ఎలుగెత్తి పాడగల ఆడకూతురుకొత్తగా లేదు- అన్నాడు తాతయ్య.

సరిగ్గా ఇవే మాటలు గత సంవత్సరం ఇవాల్టి రోజునే అన్నాడు. అందులో ఏమీ అనుమానం లేదు. మళ్ళీ అవేమాటలు ఇప్పుడన్నాడు. అయితే అప్పటి లాగనే ఇప్పుడుకూడా కళ్ళనిండా నీళ్లు నించుకొని అన్నాడు. అందుకే.—

అనాడన్నప్పుడు వూరుకున్నా — ఈనాడు మాత్రం వూరుకోలేకపోయేను. నిజమే! ఎలా వూరుకో గలను? నిరుడు అన్నాడు, ఈయేడు అంటున్నాడు- వచ్చేయేడుకూడా అంటాడేమో!

అలాఅయితే ప్రతీయేడూ అదేపేరు తల్చుకోడంలో ఏదో విశేషం వుండితీరాలి. లేకపోతే కళ్లంట నీళ్ళు తెచ్చుకోడం మాటలా అనిపించింది. అందుకే ఇప్పుడిక వూరుకోలేక తాతయ్యదగ్గరకు వెళ్లేను.

తాటాకులచాప వేసుకొని తాతయ్య అరుగుమీద కూర్చున్నాడు. ఆయనదగ్గరసా వెళ్లి కూర్చుని "సుందరి ఎవరు తాతయ్యా?" అని కదలేశా. శూన్యదృక్కులతో శున్యంగా చిరునవ్వు నవ్వేడు. మళ్లీ తాతయ్య కళ్లు చెమ్మగిల్లాయి. కళ్లొత్తుకుంటూ ఏదో చెప్పబోతు న్నట్లు గొంతు సవరించుకున్నాడు.

మరొకసారి కళ్ళూ, మొగమూ తుడుచుకుని బాసిపట్టు వేసుకకూర్చుంటూ "సుందరి ఎవరో ఒకటి రెండుమాటలతో చెప్పడానికి వీలుపడదు. అదొక భారతం; సాంతం వింటానంటే చెప్తా"నన్నాడు.

"ఊఁ, వింటాను చెప్పు" అన్నాను. అదేమిటో తెలిసికోవాలన్న ఆత్రంకొద్దీ. సరేనని మొదలు పెట్టేడు.

రత్నపురివెళ్ళడం నాకు కొత్తఅయినా, అంతకు ముందు రెండుమూడుసార్లు పరిచయం కావడాన్ని చంద్రం ఇంటికని బయల్దేరాను. అలా వెళ్తూ వుండగా ఆవాడలో సుందరి నుంచుని పాడుతూ వుండడం చూసేను.

ముగ్గుబుట్టలా వున్న తల, పండుతమలపాకు లాంటి మొగమూ, పసినిమ్మపండు ఛాయతో తంగేడు పూచినట్టుగా వున్న సుందరి అప్పటికే వయసు చెల్లిన దైనా—వయసుగాళ్ళకికూడా వలపు పుట్టించే తళ తళలతో కలకల్లాడుతూ కనిపించింది.

ప్రదోషవేళప్పుడు ఆవాడకట్టున ఆడదినుంచుని పాడడం ఏమిటా అనిపించింది! ఇంతకూ అలా పాడు తున్న ఆ వృద్ధబాలిక ఎవరు? ఎందుకు పాడుతోంది? అన్నేప్రశ్నలకి సమాధానాలేమిటో ఎంత ఆలో చించినా తోచడంలేదు. అలాఆలోచిస్తూనే చంద్రం ఇంటికి వచ్చేను.

లోపలికివెళ్తూనే సుందరినిగురించి, అలా పాడ డంలో గల విశేషాన్నిగురించి చంద్రాన్ని ప్రశ్నించ

కుండా వుండలేకపోయేను. చంద్రం వాటికి సమాధానం చెప్పలేదు; కాని, "నేను చెప్పడంకన్న ఆవిడ చేతనే ఆ పుణ్యకథ చెప్పిస్తే బాగుంటుంది. రండి, వెళ్దాం" అంటూ సుందరింటికి దారి తీసింది. నేను కూడా మౌనంగా వెంటబడ్డాను.

సుందరింటికి వెళ్లగానే "అవ్వా! సంజవేళ నువ్వుపాడుతూవుండగా అయ్యగారు చూశారట— ఆ కథావివరాలు తెలుసుకోవాలంటున్నారు. నీచేతనే చెప్పిద్దామని తీసుకొచ్చాను" అంది చంద్రం.

"రండిబాబూ! కూర్చోండి. పుణ్యపురుషులు పురాణకథలు వినదల్చుకోడంలో అబ్బుర మేముంది; అలాగే చెప్తాను" అనిచెప్పి కాళ్ళు కడుక్కుందికి నీళ్ళిచ్చి "చంద్రా! బాబుగారికి తమలపాకులు చిలకలుచుట్టి ఇస్తూ వుండు; కాళ్ళూ, చేతులు కడుక్కొస్తా"నంటూ సుందరి లోపలికెళ్ళింది.

వాళ్ళఆచారాలు నాకు కొత్తవికాకపోయినా, అప్పటి ఆ పద్ధతులుమట్టుకు వింతగా కనుపించక పోలేదు.

కాళ్ళూ, చేతులు మొహం కడుక్కువచ్చి, దివ్యభవనంలావున్న ఆ ఇంట్లో దేదీప్యమానంగా దీపాలు వెలిగిపోతూవుండగా, అద్దాలూ పటాలతో అలంకరించబడ్డ ఆ హాలుమధ్యనున్న తివాసీమీద టెక్కాని చేరబడి కూర్చున్నాను. అక్కడే వెండి చెంబుతోవున్న దాహంపుచ్చుకుని, చంద్రం ఇస్తున్న తమలపాకుల చిలకలు వేసుకుంటున్నాను.

ఇంతలో సుందరివచ్చి గంధపుగిన్నె, పన్నీరు బుడ్డి, అత్తరువు, అగరొత్తులు వున్న పళ్లెం తెచ్చి నాముందుంచి కూర్చుంది. ఆ పళ్లెంలో పొగాకు చుట్టలుకట్టకూడా వుంది. చుట్టలంటే మామూలు చుట్టలుకావు — కొబ్బరి నీళ్ళతో తడిపి ఆరబెట్టిన పొగాకును చేతులకి పునుగు అద్దుకుంటూ చుట్టిన చుట్టలు.

నేను చుట్టతీసి ముట్టించుకూవుండగా సుందరి కత్తెరతో వక్కపలుకులు కత్తిరించి వేసుకుంటూ తాంబూలచర్వణ కుపక్రమించింది.

"వజ్జలవారింట గజ్జెకట్టిననాడు బాబుగారితో పరిచయమైంది. ఆతరువాత రెండుమూడుసార్లు తారసిల్లడం తటస్థపడ్డా, బాబుగారు ఇక్కడికెప్పుడూ రాలేదు. ఇదే కొత్త. మనింటికి వస్తూవుండగా దార్లో నువ్వు పాడుతూండడం చూశారట. ఆ కథావివరాలు తెలిసికోవాలంటున్నారు" అంటూ సుందరికి నన్ను పరిచయంచేస్తూ చంద్రం మళ్ళీ చెప్పకొచ్చింది.

తల పంకిస్తూనే ఇదంతా వింటూ సుందరి తాంబూలంవేసుకోవడం పూర్తిచేసింది.

ఎడమచెయ్యి మోకాలికానిచ్చి కుడిచేత్తో అభయముద్రపట్టి బాసిపట్టు వేసుకకూర్చుంటూ సుందరి కథ చెప్పడం మొదలుపెట్టింది.

"అయ్యగారూ! అవధరించండి, సావధానంగా చిత్తగించండి. మున్నూరేండ్లకి ముందుగా సిరిపురం అనబడే ఈ రత్నపురంలో కూవాడలోకల్లా రత్నావతీ దేవి ప్రసిద్ధికెక్కింది. ఆయమ చదువుల సరస్వతి, చక్కదనాలచుక్క, ఆటపాటలలో మేటి, జగదేక సుందరి.

అప్పటి ఈసీమనేలే రాజుగారికి ఆమె సుగుణగణాదులు విన్నమీదట మక్కువపుట్టి భోగకాంతగా స్వీకరించడమేకాకుండా రత్నావతీదేవిని రాణులలో ఒకతెగా చేశారయ్యా! అప్పట్లోనే ఆమెపేర ఈపట్నాన్ని రాసి ఇచ్చేసి పాలించుకోమన్నారు. అంతతో ఈవూరికి సిరిపురం అనే పేరుపోయి రత్నపురం అనేపేరు వచ్చింది.

రాజుతోనే రాణువ; రాజు వలచిన రత్నావతీదేవి సమస్తరాజోపచారాలూ అనుభవిస్తూ వుండేది. ఆతల్లి కేవలం తన భోగభాగ్యాలే చూచుకొని అవం దించకుండా కవులను పండితులను ఆదరిస్తూ, కళలనన్నిటిని పోషిస్తూ, ధర్మపక్షంగా జనానందమే తనానందంగా భావించి పాలిస్తూవుండేది.

ఆతల్లిపాలనలో అన్ని వర్ణాలవారు ఒకరితో ఒకరు అవినాభావసంబంధం కలిగివుంటూ ఎవరి కులధర్మాన్ని వాళ్లు పాటిస్తూ దారిద్ర్యం అంటే ఏమిటో తెలీకుండా కాలం గడుపుతూ వుండేవారు.

ఒక్కమాటలో చెప్పాలంటే ఆమె ఏలుబడిలో రత్నపురం నిత్యకళ్యాణమూ పచ్చతోరణంగా వుంటూ వుండేది.

ఇలావుండగా ఆ రత్నావతీదేవికి ఒక్కతే ఆడ పిల్ల; ఆమెకి మళ్ళీ సుందరి అనే ఒక్కగా నొక్క కూతురు వుంటూవుండేవారు. ఆసుందరి నిజంగా అతి రూపసుందరి, అందాల పుట్ట; అన్నివిధాలా ఆ అవ్వకి తీసిపోని మనుమరాలనిపించుకుంటూ వుండేది.

ఆసమయంలో చిన్మయమూర్తి అనే ఆసామీ రత్నపురానికి ఆగంతుకుడుగా వచ్చేడు. అయితే ఈనాటికికూడా ఆయన కులగోత్రాలేమిటో రత్నపురవాసులకి తెలీదు; కాని ఆయన సామాన్య మానవుడు కాడనిమాత్రం తెలుసు.

ఆ చిన్మయమూర్తి చతుర్వేద పారాయణుడు, షట్‌శాస్త్రవేది, సర్వవిద్యాపారంగతుడు. ఇంకా చెప్పాలంటే కవి, గాయకుడు, శిల్పి, చిత్రకారుడు, నటకుడు, నాట్యాచార్యుడు; ఒకటేమిటి అష్ట భాషాపరిజ్ఞాత, అరవైనాలుగు కళల్లో ఆరితేరిన వాడున్నూ.

ఆయన అతిచిన్నతనంలోనే తల్లిదండ్రులని వదిలిపెట్టి దేశాటనానికి వెళ్ళిపోయేడట. చిన్నతనం అంటే తన స్వగ్రామమేదో పేరుకూడా చెప్పలేని, పోల్చుకోలేనంతటి చిన్నతనంట. అలా ఎందుకు వెళ్ళి పోవలసివచ్చిందో ఆయనకి అప్పటికి గుర్తులేదట. అంతేకాకుండా తన తల్లిదండ్రులెవరో వాళ్ళు అప్పటికి వున్నారో లేరో కూడా తనకి నిజంగా తెలీదన్నాడు. అయితే—

ఏదో చేతబడి, చిల్లంగిలాంటివాటిల్లో ఏదో ఒక కారణాన్ని ఆ చిన్మయమూర్తి అలా వెళ్ళిపోవడం జరిగివుంటుందేమోనని రత్నపురవాసులు అనుకుంటూ వుండేవారు. పైగా, అలావెళ్ళిపోవడంవల్లనే అంతటి విజ్ఞాని, విద్యావంతుడూ కాగలిగాడేమోననికూడా అనుకుంటూ వుండేవారు.

మొత్తానికి ఏదైతేనేం, ఆ చిన్మయమూర్తి ఛప్పన్న దేశాలూ తిరిగి రత్నపురి చేరుకున్నాడు. రత్నావతీదేవిసమక్షమందు ఆయన తన విద్యాపాటవాన్ని చూపించి ప్రభువువారిచే సన్మానం పొందిన తరుణంలో అటువంటివిద్యలనిధికవద్ద విద్య నేర్చుకోదలచింది సుందరీదేవి.

అయితే, దేనిమీదనూ మమకారంలేనివాడున్నూ దేనికీ కట్టుబడనివాడున్నూ అయినప్పటికీ, గానానికి గంధర్వులని, దానానికి దధీచినిమించిన ఆచిన్మయమూర్తి సుందరీదేవిని శిష్యురాలిగా స్వీకరించాడు.

సకలవిద్యల చదువరిగా పేరుపొంది, గురి కుదిరిన గురుత్వంలో గురువును మించిన శిష్యురాలనిపించుకుంది ఆ సుందరీదేవి.

ఆ సమయంలో కోటికి పడగెత్తి, కోటకి తలుపెత్తిన కోటయ్య ప్రభువులు కొమరొప్ప వేంచేసి సుందరీదేవిని చేబట్టదలచారయ్యా! కానీ, సుందరీదేవి అందు కిష్టపడక "గురుగాతలచేను, పతిగా వలచేను. బహుశా మరొక జన్మలో నేమో చెప్పలేనుకాని, ఈజన్మలోమాత్రం ఆయనమీది మనసు మళ్ళించుకోవడం సాధ్యంకాద"ని రత్నావతీదేవితో నిష్కర్షగా చెప్పేసింది.

అప్పు డారత్నావతీదేవి "అమ్మా! పాలుపోని పసికందువు, కన్ను విప్పని కన్నె పడుచువు; కనుక బహుశా ఈ సందర్భంలో మనజాతి పుట్టుపూర్వోత్తరాలు చెప్పడం అవసరం అనుకుంటాను" అంటూ సుందరీదేవిని కూర్చోబెట్టి చెప్పడం మొదలు పెట్టింది.

యజ్ఞం చేసినవాళ్ళూ, దానం చేసినవాళ్ళూ యుద్ధంలో మరణించినవాళ్ళూ అయిన యోధులు, భోగులు యోగులు, మొదలైన పుణ్యపురుషులందరూ స్వర్గలోక ప్రాప్తిపొందుతూవుండేవారు. ఆపుణ్యపురుషులందర్నీ సంతోషపెడ్తూ దేవేంద్రుని ఇష్టదేవేరులలో ఒకతె అయినరంభాదేవికి ఒకప్పుడు నరకలోకం చూడాలనే వింతకోరిక కలిగిందిట. ఆవార్త దేవేంద్రుడికి తెలియజేయగా "ఓ అదెంతభాగ్యం; తప్పకుండా చూపిస్తా" నంటూ ఒక మంచిముహూర్తాన రంభాదేవిని తీసుకొని సకుటుంబ సపరివారంగా బయలుదేరాడు నరకలోకానికి.

యమధర్మరాజు దర్బారు చిత్రగుప్తుడి చిట్టాపాపుల విచారణ మొదలైనవి శేషాలన్నీ చూసినతర్వాత శిక్షలనుభవిస్తున్న పాపులను ఒక్కొక్కరిగా చూసుకుంటూ వెళ్తున్నారు రంభ దేవేంద్రుడు మొదలైనవాళ్ళు. అలా చూసుకుంటూ ఒకచోటికి వచ్చేసరికి రౌరవనరకం అనుభవిస్తున్న పాపిని చూడ్డం తటస్థపడ్డది. దేవేంద్రుడు, డావైనవారాలు రంభాదేవితో చెప్తూ వుండగా రంభ చటాలునవెళ్ళి ఆ పాపాత్ముణ్ణి కౌగలించుకొంది.

దేవేంద్రుడంతటివాడున్నూ త్రుళ్ళిపడి కొంత నిశ్చేష్టుడయాడు ఆ సంఘటనకి. కాని అంతలోనే తేరుకొని, స్వర్గలోకప్రాప్తి చెందినవాళ్ళని సంతోషపెట్టవలసినరంభ — నరకలోకంలోవాడికి ఆలింగన

సౌఖ్యం ఇచ్చిందుకుగాను, నరలోకంలో నీచకులంలో పుట్టి నానాజాతి సంపర్కము కలుగునట్లుగా శాపం ఇచ్చేడు ఆ దేవేంద్రుడు.

"రంభాదేవికికూడా శాపమా!" అంటూ దేవత లందరూ హాహాకారాలు చేసిన సందర్భంలో శ్రీమన్నారాయణులవారు వేంచేసి "రౌరవం నరకం అనుభవిస్తున్నప్పటికీ రంభాలింగనసౌఖ్యాన్ని 'పొందగల్గడం ఆ జీవిచేసుకున్న పూర్వపుణ్యవిశేషంవల్లనే జరిగింది. లేకపోతే ఎన్నడూ లేనిది రంభకి నరకలోకం చూడాలన్న కోరిక పుట్టడమేమిటి? తీరా చూసినతర్వాత ఆపాపిని కౌగలించుకోడం ఏమిటి? ఇదంతా 'కించిద్భోగం భవిష్యతి"అన్నట్టుగా ఆ పుణ్యవిశేషమే కాని మరొకటికాదు. అందుచేత ఇందులో రంభతప్పుగాని ఆజీవి నేరంగాని ఏమీ లేదు కనుక రంభకి ఎంతమాత్రం శాపంలేదు. కాని, దేవేంద్రశాపానికి తిరుగులేదు కాబట్టి రంభ పేరను ఆశాపంలోని నియమాలకి తగ్గట్టుగా భూలోకంలో ఒక కులం వెలుస్తుంది అని చెప్పి దేవేంద్రుడు మొదలైనవాళ్ళని సమాధానపర్చేడు ఆ దేవదేవుడు. అయినప్పటికీ.

శాపం లేకపోయిన రంభ శాంతపడక తన పేరు మీదుగా అలాంటి కులం పుట్టడం తనకి అవమానకరం కదా అని మొరపెట్టి ఏడ్చిందిట. అప్పుడా విష్ణుమూర్తి "మరేం ఫర్వాలేదులే. ఇవాళ ఉన్న పేరు రేపు లేకపోవడం భూలోకంలో సహజమే కనుక అతి తొందరలో ఆ పేరు మారిపోతుందిలే" అని రంభాదేవిని వూరడించాడంటూ ఇదీ మన కులంతాలూకు పుట్టుపూర్వోత్తరాలని మా అవ్వ చెప్తూవుండేది.

అలా ఆ తల్లి పేరను వెలిసిన కులం ఆనాటినుండీ రకరకాలుగా మారి ఈనాటికి ఇలా వెలిసింది. అయితే అప్పుడూ ఇప్పుడూ కూడ కులవృత్తి చెయ్యని కుల కాంతలు కుడిపైట వేసుకుని, ముక్కు పాపటతీసుకొని, మంచి లక్షణమైన ప్రాపకం చూసుకొని, సలక్షణంగా వుంటూ వుండేవారు. అలాంటివారిలోకల్లా రాచ ప్రాపకం పొందగల్గింది ఒక్క మనవంశీయులే.

అనాదినుండీ రాచప్రాపకం పొందే ఈ వంశపు ఆడకూతుళ్లు—నాగరం, జడగంటలు; రాగిడి, చంద్రవంక; తమలపాకు, మొగలిరేకు; సూర్యుడు, చంద్రుడు; చేర్చుక్క, పాపడ, పింజరీలు మొదలైన సమస్తమైన తలసజ్జు, మొలసజ్జు, చెంపసరులు అలంకరించుకునే వారు—చీని చీనాంబరాలతో చిద్విలాసంగా వుంటూ భామవేషం గణియం కట్టినట్టుగా మూడు ముస్తాబులతో ముచ్చటాడుతూ వుండేవారు. అంతేకాకుండా విద్యకోసం, వినోదంకోసం వారు సంగీతం, నాట్యం, సమస్తం నేర్చుకునేవారు; శాస్త్రాలుకూడా చదువుకునేవారు. వారిని చేరదీసిన ప్రభువులున్నా పలుకులకు భమిడి, నవ్వితే నవరత్నాలు, కన్నుకదిపితే కనకాభిషేకమూ చేస్తూ వారిని సంతోషపెడ్తూ, తాము సంతసించెడివారు.

అయితే అలాంటి ప్రభువులు ఇప్పటికీ దేశం మీద లేకపోలేదు; కాబట్టి, కులగౌరవం కుటుంబ గౌరవం కాపాడుకుంటూ రాచప్రాపకం చూసుకోవడం మంచిది. అలా కాకుండా నువ్వు ఆ కుల గోత్రాలు లేని ఆసామీనే పెళ్ళిచేసుకుంటానంటే రాచవారి కోపానికి గురికావలసి వస్తుందని నయానీ భయానీ చెప్పింది ఆ రత్నావతీదేవి. అయినప్పటికీ ఆయనమీది మనసు మళ్ళించుకోలేనని ఖచ్చితంగా చెప్పేసింది సుందరీదేవి.

ఇదంతా చాటునా మాటునా విన్న చిన్మయ మూర్తి తన మూలంగా ఆ కులగౌరవ కుటుంబ గౌరవాలకి భంగం రాకూడ దనుకున్నాడు. కాని మనసూ మమత తెంచుకోడం ఎలాగు? ఆమెను పెళ్ళిచేసుకోకుండా తప్పించుకునే ఉపాయం ఏమిటి? అనే ఆలోచనలతో క్షోభపడుతూ వుండగా అవ్వా మనుమరాళ్ళవల్ల మరొకసారి విషయమంతా విన్నాడు. ఔను, కాదు అని ఏదీ చెప్పలేకపోయేడు; అంగీకారంగాని అయిష్టతగాని సూచించలేకపోయేడు. కాని ఆ రత్నావతీదేవి సమక్షమందు "నాకొక నియమం వుంది. అదేమిటంటే నవద్వారమంటప మధ్యను నిలబడి నాగనృత్యంచేసి నన్ను మెప్పించగల్గితే నిన్ను పెళ్లిచేసుకుంటానే పిల్లదానా!" అని సుందరీదేవితో చెప్పేడు.

అందుకు సిద్ధపడ్డ సుందరీదేవి అంగీకార సూచకంగానున్నా, పరీక్షాధికారిగా నిలబడ్డంతోబాటు వంతనాట్యానికి వప్పుకోవలసిందిగా నియమిస్తూనూ చిన్మయమూర్తికి తాంబూలం ఇచ్చింది. ఈ సంగతి తెలుసుకున్న ప్రభువు వారు సభతీర్చి సభలో నృత్య ప్రదర్శనం ఏర్పాటుచేసేందుకి అంగీకరించారు.

అనుకున్న ప్రకారంగా ప్రభువువారు కొలువు తీర్చి కూర్చున్నారు. రత్నావతీదేవి, కోటయ్య రాజులుంగారు కూడా సభకి వేంచేసేరు. దిగ్దంతులైన శాస్త్రజ్ఞులు, దిగ్గజాలలాంటి సామంతులు సభలో కొలువుతీరి కూర్చున్నారు. రత్నపురివాసులు ఆబాల గోపాలం అక్కడే వుండడాన్ని సభాసదనం కిటకిటలాడుతోంది. అలాంటి విషమపరీక్షకికూడా జంకు లేకుండా సుందరీదేవి సిద్ధపడినప్పటికీ సభలో వున్న ప్రతిఒక్కరి మనస్సూ అల్లకల్లోలంగానే వుంది.

సభకి మధ్యస్థంగా నవద్వార మంటపం ఏర్పాటు చేయబడింది. పంచవన్నెల పువ్వులు ముడిచి అల్లిన నాలుగుపాయలజడతో, పాము కుబుసంలాంటి పద్మాల పట్టుచీరకట్టి నవద్వార మంటపమధ్యను నిలచున్న సుందరీదేవి సభానమస్కారంచేసి నృత్యం ఆరంభించింది.

పుట్టలోంచి వెలికివచ్చిన నాగుపాము విహరిస్తూ వుండగా వేటగాడువచ్చి పట్టుకోబోతాడు. పట్టు తప్పించుకుని పగబట్టినపాము వేటగాణ్ణి వెన్నంటుతోంది. పుట్టమీద పుట్టిన చెట్టెక్కి, గుట్టు చప్పుడుగా గ్రుక్కుమింగిన పాము, పిట్టకంటబడి పిట్టతో పోట్లాడుతోంది. కళ్ళు తెలీని స్థితిలో వేటగాడికి పట్టుబడబోయి నేర్పుతో తప్పించుకోవడం, కుబుసువిడిచిన వుమ్మగులో వెన్నంటే వేటగాడికి కాటువేయడం మొదలైన నానారకాల విన్యాసాలతో నాట్యం చేస్తున్నది సుందరీదేవి. చిన్మయమూర్తి వంతనృత్యం చేస్తూనే ప్రతిభంగిమను పరీక్షిస్తున్నాడు. సభాసదులంతా తన్మయత్వంతో చూస్తున్నారు.

వసంతవిహారం చేస్తున్న కోడెతాచు, నాగుపాములు వాసనాశక్తివల్ల ఒకదాని వునికి ఒకటి తెలుసుకొని పరవశమైనట్టుగా పరవళ్ళు తొక్కుతూ సుందరీ చిన్మయమూర్తులు నృత్యం చేస్తున్నారు. చిట్టచివరకి నవద్వార మంటపమధ్యను కాలి బొటనవ్రేళ్ల మీద నిలచి వెన్నువైపు వంగి వెనక్కి చూస్తున్న సుందరీదేవిన్ని, మంటపానికి వెలుపల ఒంటికాలిమీద నిలిచి ముందుకి వంగిచూస్తున్న చిన్మయమూర్తిన్ని, కోడెతాచు, నాగకన్యలు సరాకుర్పించుకునే ముద్ర పట్టగా నాలుగు పెదవులు కలుసుకున్నాయి.

ఆ సమయంలో స్థిరసంకల్పంగాని, వుపాసనా బలంగాని లేనిదే చెయ్యడానికి వీలుపడని అంతటి మహానృత్యాన్ని కూడా చేసి తన్ను ఒప్పించింది కదా అని చిన్మయమూర్తిన్ని — అంతటి నృత్యాన్ని చెయ్యడంలో సాధించగల్గినందుకు సుందరీదేవిన్ని ఆనంద పరవశులయేరు. ఆనందపారవశ్యంలో చుంబనవశంగా వున్న సుందరీ చిన్మయమూర్తుల ప్రాణవాయువులు శూన్యంలోకి ఎగిరిపోయి అనంతవాయువుల్లో లీనమై పోయేయి.

సభంతా కొంతసేపటివరకూ నిశ్శబ్దంగా వుండి ఆతర్వాత జేజేలతో, హాహాకారాలతో మిన్ను ముట్టింది. రత్నావతీదేవి, కోటయ్యరాజులుంగార్లతో పాటు ప్రభువారికి కళ్ళు చెమ్మగిల్లేయి. అప్రయత్నంగా ఆ ముగ్గురూ చెయ్యెత్తి మొక్కేరు.

ఆతర్వాత వారిద్దరి దేహాలనూ వుత్సవంతో వూరేగించి, చందనపు చెక్కలతో ఏకచితిమీద దహన సంస్కారం చేసేరు. ఆ స్థలంలో ఒక సమాధి కట్టించి సుందరీ చిన్మయమూర్తుల పేరు సువర్ణాక్షరాలతో చెక్కించారు.

అలాంటి పుణ్యదంపతులని ప్రేమైకజీవులని వేరుచేయ దలచినందులకు కోటయ్యరాజులుంగారు కించపడడమే కాకుండా ఆనాటినుండీ ఆ వంశానికి రాచసంపర్కం తప్పించేరు.

ఆనాటినుండీ ఆ వంశపు ఆడకూతురు ఆ తల్లి పేరు పెట్టుకొని పుట్టడమే కాకుండా, వుదయసంజలు రెండువేళలా వాడలో వెలుగేసి వాడకట్టున నించుని ఆ యమ్మని పాడుకోవడం ఆచారమైంది. ఆ వంశానే కాకుండా ఆ వాడలో ఏ ఆడకూతురైనా సరే ఆ తల్లిని తల్చుకుని చెయ్యెత్తి మొక్కనిదే ఏపనీ చేసేవారు కారు.

ఇది జరిగి ఇప్పటికి ఏడుతరాలు గడిచి నాతో ఆరోతరం నడుస్తున్నది. నా తరవాత ఈ వాడలో పాడగల ఆడకూతురు లేదంటూ సుందరి చెప్పింది.

ఆనాటి సుందరి అబద్ధం, ఈనాటి సుందరి నిజం అనుకున్నాను. అలాంటి సుందరి గత సంవత్సరం ఇవాల్టి రోజునే పోయింది. ఇప్పుడిక సుందరి లేదు సరికదా ఆ వాడని పాడగల ఆడకూతురు అసలే లేదు. కథ ముగించి తాతయ్య కళ్లొత్తుకున్నాడు. అంతవరకూ నిస్తుపోతూ, వింటున్నా కథంతా విన్నమీదట నాకుకూడా కంటనీరు రాకపోలేదు!—

---

# బ్రదుకు బాట

★

శ్రీ బొడ్డు బాపిరాజు

అడుగడుగు నందు మొలుచు నిరాశవెంట
ఆశయొక్కటి మ్రాఁగ తృష్ణయగుచు నిలుచు!
కష్ట సుఖములు పడుగు పేకలుగ జేసి
బ్రదుకు నేయు నేదేవతా వస్త్రములనో?

ఏమియు లేనిచోట నొకయిమ్మున చక్కని తీవనాటి, త
త్కోమల వల్లి గెంజిగురు గూరిచి, తియ్యని మొగ్గదీర్చి, పై
నామని దెచ్చి, క్రొంబువుల నందము లార్చును నాశ; అంతట
న్నామజవట్లు వచ్చి చరణాహతి గూల్చు నిరాశ నవ్వుచున్!
ఉలిపిరి సూత్రమూడి తెగి యున్నత మేఘ పథాలు దాటి, క్రొ
మ్మిన్నుల మిలలాడి, తత్వర నిమేషమునన్ సుడిగాలి దూలి, చి
న్గుల దిగజారి, కోనలనో కొమ్మలనో నురియాడియాడి పే
రలమట జెందు గాలిపట మయ్యెను జీవిత ముజ్ఝితార్థమై!
అందిన పండ్లపై మమతలంటక, చిట్ట చిటారు కొమ్మనే
యందని పండుకో తలపులాడునహో! తుదకందు నిందు ని
ష్పంద సుఖానుభూతి కనుపట్టక పాలకు రాయిమోయుచు
న్వందురు చున్న ఈ బ్రదుకు బాటకు పాటకు నేముగింపులో?
తీయని తేనెలో మెదపి తీసిన చేదు విషమ్ము మ్రింగి "యో
హో!" యని మెచ్చి పైరుచుల; కుబ్బు విషాగ్నులకోడి, శీతల
చ్ఛాయల కంగలార్చెద దెసల్ పరికించెదగా కదర్శితో
పాయులు పూర్వ యాత్రికుల భారపదాంకము లెందు జూచినన్!
చేరువనున్న తీరమును చీకటిలో పసికట్టలేక యే
దూరపు కొండ కొమ్ముననో దోచియు దోచని వెల్గు రేకకై
యారటమందు నావికుని యట్లుగ నాయెదనున్న శాంతినే
యారయలేక యూరక దిగంతరముల్ పరికింతు వెఱ్ఱినై!

అదిగో అది పూలబాట లోయలకు జేర్చు
నిదిగో యిది ముండ్ల త్రోవపై చదలకెత్తు
ననుచు చూపిన ప్రథమ ప్రయాసకిష్ట
పడదు బ్రదుకేమనందునో ప్రభు! వచింపు?

# 'సౌందరనంద' పరిశీలనము

★

శ్రీ పి. గణపతిశాస్త్రి

ఆధునికాంధ్రకవిత మహాకావ్యము, ఖండకావ్యము, గేయము మొదలైన వివిధరూపాల్లో ఆవిర్భవిస్తున్నది. ఈ వివిధమైన వివిధరూపాల్లో ఆయాకవుల ఆదర్శ వైవిధ్యాన్ని బట్టి మళ్ళీ అనేక భేదా లేర్పడుతున్నాయి. నేటికాలంలో కేవల సాంప్రదాయిక ధోరణిలో పురాణాలు, కావ్యాలు రచించేవారున్నారు. చారిత్రికకథలు తీసుకుని సంగ్రహంగానూ, విపులంగానూ కథాకావ్యాలు రచించే కవులున్నారు.

వీరుగాక గురజాడ, రాయప్రోలు కవులతో ప్రారంభించిన ఆధునిక కవితామార్గాలలో ఆత్మాశ్రయమార్గం అవలంబించి ఖండకావ్య రచనలు చేసే కవులు ఇంకోవర్గంలోకి వస్తారు. మరీ అధునాతనులయిన కవులుకొందరు అభ్యుదయమార్గం అవలంబించి వినూత్నమైన కవిత రచిస్తున్నారు. వీరందరిలోను మళ్ళీ ఉత్తమ, మధ్య మాధమ భేదాలున్నాయి. ఆపైన గిడుగురామమూర్తి పంతులు వ్యావహారిక భాషావాదంవల్ల, మన వ్యాకరణాల అసమగ్రతవల్ల ఆధునిక కవులు వాడే భాషలోను, పలుకుబడిలోను, భావ వ్యక్తీకరణంలోను ఒక విధమైన నూతనత్వంవచ్చింది. ఆ మీద నేటిప్రపంచవాఙ్మయాల్లో బయలుదేరిన కవితావాదాల ప్రభావాలు కూడా తోడై మన కవితామార్గాలలో మరికొన్ని కొత్తమార్గాలు వెలయించాయి. ఇంత వైవిధ్యంగల కవితామార్గం మన ఆంధ్రవాఙ్మయంలో ఇదివరకెన్నడు బయలుదేరలేదు. ఈ పరిస్థితి నేటి ఆంధ్రకవిత్వంలోనే గాక మన భారతీయ వాఙ్మయాలన్నిటిలోను ఏర్పడినట్టు కనిపిస్తున్నది. ఈవిధమైన ఆధునిక కవిత్వం విమర్శించడానికి పూనుకున్నప్పుడు సాంప్రదాయిక పద్ధతిలోను, అధునాతన పద్ధతిలోను కావ్యాలు వ్రాసే కవుల కవితాస్వభావాలు, వారివిభిన్నలక్ష్యాలు జాగ్రత్తగా అవగాహన చేసుకోవాలి. ఉదాహరణకు కేవలం స్థూలమైన సాంప్రదాయికపద్ధతిలో అభ్యుదయ కవితా విమర్శగాని, లేక అలాగే అభ్యుదయపద్ధతిలో సాంప్రదాయిక కవితా విమర్శగాని సాగిస్తే చాలా దుష్టఫలితా లేర్పడతాయి. అందుచేత ఆయా కవుల కావ్యాలు పరిశీలించి ఆ కవు లేర్పరుచుకున్న లక్ష్యాల దృష్టిలో వా రెంతవరకు కృతకృత్యులైనారో నిర్ణయించాలి. విమర్శన సూత్రాలు కూడా ఆయా కవుల లక్ష్యాల పునాదులమీదనే నిర్మించుకుని, ఆ సూత్రాల దృష్ట్యా వారివారి కావ్యాల లక్ష్యసిద్ధి, సాఫల్యము, అంతరువు మొదలైనవి నిర్ణయించాలి. అంతేనేగాని విమర్శకులు మనస్సులో భావించుకొన్న అస్పష్టమైన లక్ష్యాలేవో ఆధునిక కావ్యాలలో కనబడడంలేదనడంవల్ల—ఆయా కావ్యాల కేమీ లోటు రాదుగాని—కేవలం విమర్శకుల అశక్తత మాత్రమే వెల్లడి అయి ఊరుకుంటుంది!

## ఆంధ్ర సౌందరనంద లక్ష్యం

మే నెల భారతిలో వ్రాసిన 'సౌందరనంద' సమీక్షలో సంస్కృత సౌందరనంద కర్త అయిన అశ్వఘోషునికి బౌద్ధధర్మప్రచారమే ప్రధాన లక్ష్యమనీ తన పద్దెనిమిది సర్గల కావ్యంలోను అతడా లక్ష్యం సాధించుకున్నాడనీ సోదాహరణంగా వివరించాను. అటుపిమ్మట ఆంధ్ర సౌందరనంద కర్తలీ కావ్యం మూలదృష్ట్యా విభిన్నమైన దృష్టితో మలుచుకున్నారనీ, సుందరీనందుల పరస్పరానురాగం బౌద్ధధర్మ స్వీకరణంద్వారా విస్తృతమై పునీతమైన విధం వీ రభివర్ణించారనీ బౌద్ధధర్మప్రచారం వీరి ప్రధానలక్ష్యం కానేకాదనీ వ్రాశాను. ఈలక్ష్యం స్పష్టంగా అవగాహన చేసుకుంటేనేగాని వీరి కావ్య శిల్పం తేటతెల్లంగా బోధపడదు. అందుచేత ఆ లక్ష్య దృష్ట్యా వీరు కావ్యంలో ప్రదర్శించిన రచనాశిల్పాన్ని గురించి కొంచెం వివరించి వ్రాస్తాను.

## సుందరీ నందుల మానసిక పరిణతి

ఆంధ్ర సౌందరనందంలో సుందరీ నందుల ప్రణయప్రసంగం రెండవసర్గతోనే ప్రారంభిస్తుంది. వీరిద్దరు సౌందర్యంలోను, పరస్పరానురాగంలోను సాటిలేనివారని సౌందరనందం వర్ణిస్తున్నది.

"తానా సుందర నందు డవ్వెలదియా
తన్వంగలావణ్య శ్రీ
లానందైక నిధాన మెండ్గొరగల
ప్రేమాలాప కేళీ వినో
దానూనానుభవమ్ములా
మదన విద్యా దైశికమ్ముల్ సమల్
కానం రారు గదోయి! కామి జన
లోకమ్మందు నాదోయికిన్."

ఈ సర్గలో ఈ విధమైన సుకుమార వ్యంగ్య ధోరణిలో సుందరీనందుల శృంగార వర్ణనము, పరిహాసాది ప్రసంగ వర్ణనము సాగిపోతుంది. 'కామి గాక మోక్షకామి గాడు' అనే సూక్తిని పురస్కరించుకుని సౌందరనంద కవులీవిధంగా లలితంగా వీరి శృంగార వర్ణనం సాగించారు. కాని అంతలోనే బుద్ధుడు భిక్షార్థియై వచ్చి తరలిపోయిన వార్త నందునికి తెలుస్తుంది. వెంటనే అతడు సుందరి అనుజ్ఞ స్వీకరించి ఆందోళిత హృదయంతో అక్కడినించి కదిలి వెళ్ళిపోతాడు. దీనితో రెండవ సర్గ ముగిసిపోతుంది.

ఇక మూడవ సర్గలో నందుడు బుద్ధదేవుని 'మరలా నను భిక్షు స్వీకరింపవలసిం'దని వేడుకొంటాడు. కాని బుద్ధుడతనితో నాటికి భిక్షాశన మక్కరలేదన్న విషయం హస్తసంజ్ఞా మాత్రంచేతనే తెలియజేసి భిక్షాపాత్ర అతని హస్తంలో ఉంచి మౌనియై శాద్ధవిహారానికి సాగిపోతూఉంటాడు. నందునికి మళ్ళీ ఆందోళన ప్రారంభమౌతుంది. అప్పుడు బుద్ధుడు నందుణ్ణి అనునయించి విపులంగా ధర్మబోధ చేస్తాడు. సుమారొక పది వృత్తాలలో ఈ బుద్ధుని ధర్మబోధ ముగిసిపోతుంది. ఆపిమ్మట బుద్ధుని ఆజ్ఞప్రకారం గౌతమ శిష్యుడొకడు నందునిచేత ధర్మదీక్షా స్వీకారం చేయించబోతే మళ్ళీ నందుడతనికి అడ్డు తగులుతాడు. ఆపైన గౌతమశిష్యుడతనికి 'ఈ విషయంలో నీవు చాలా అదృష్టవంతుడవే సుమా' అని బోధించి ధర్మదీక్షా స్వీకారం చేయిస్తాడు. తరవాత తిరిగీ డోలాందోళితమైన నందుని మనఃస్థితి వర్ణనతో ఈ సర్గ ముగిసిపోతుంది.

క్రమికమైన నందుని మనఃపరిణతిలో అడుగడుగునా ఉద్భవించే వేదన, ఆందోళన స్పష్టత స్ఫురింపచెయ్యడానికి కవులు చూపించిన శిల్పనైపుణి ప్రదర్శించడానికే నేనీ విషయాలింతగా వివరించి వ్రాస్తున్నాను.

సుందరికూడా నందునివలెనే అనేక విధాలయిన మనోవైకల్యాలకు లోనవుతుంది. ఈమెకూడా చివరికి ధర్మదీక్ష స్వీకరింపబోతున్నది. కనకనే కవులింతగా ఈమె మనఃపరిణతి ప్రదర్శించడానికి ప్రయత్నించారు. ఇందువల్లనే నాలుగో సర్గఅంతా ఆమె మనః పరితాపంతోనే ముగిసిపోతుంది. ఇటుపైన ధర్మదీక్ష స్వీకరించిన తరవాతకూడా పూర్వవాసనా బలంవల్ల నందుని హృదయపరితాపం సమసిపోలేదు. ఆ పూర్వవాసనా బలంవల్ల ఏర్పడిన పరితప్త మనస్థితి అంతా 'అనుతాపం' అనే అయిదో సర్గలో కనిపిస్తుంది.

అటుపిమ్మట మళ్ళీ బుద్ధుడాతన్ని అనునయిస్తూ ధర్మోపదేశం చేస్తాడు. ఆరోసర్గలో నడిచే ఇతివృత్తమంతా చాలావరకు గౌతముని ధర్మోపదేశమే. అప్పటికిన్నీ నందునికి తన అనురాగమే గొప్పదనే భావం పూర్తిగా సమసిపోలేదు. పిమ్మట బుద్ధుడతనికి కేవలం మమతావిరహితమైన అనురాగమే మహితమైనదనీ, ఒకే వ్యక్తిమీద కేంద్రీకృతమైన అనురాగం మమతావిరహితమై విశ్వవ్యాప్తమైనప్పుడది విరవధికమై విరాజిల్లగలదనీ ఆదేశిస్తాడు. ధర్మసంవాదంలోని గౌతమోపదేశ భాగంలోని ఈ వృత్తాలు రెండు ఈ భావం సూక్ష్మంగా ధ్వనిస్తున్నాయి.

"విరియం బూచెడు ప్రేమ పుష్పములన్
విశ్వమ్ము నిక్కెమ్మె క్రొ
వ్విరినీ వొక్కటి పుణ్కి తాలిచితి
వుద్వృత్తౌను రాగమ్మమై
సురమం, దయ్యది వాడిరాలునపు
డయ్యో! కంటకమ్మందు ని
ష్ఠురతన్ నాటును, దాని బుచ్చగల
నెజ్ఞాన్ మున్నెయోజింపుమా!"

"నిన్ను గృహమ్ము వీడుమని
నే వచియించుట కర్థమిట్టిదో
యన్న! మమత్వ శూన్యమును
వ్యాజవిహీనమునైన ప్రేమనే
నెన్నడు కాదనన్; సుకృతివీవు
రసార్ద్రిమ నీరొడంద యీ
తెన్నున బోయి సర్వజగతిన్
భజియింపుము నీకు మేలగున్."

ఈవిధంగా ధర్మోపదేశం చేసేసరికి నందుని మనస్సు నిర్మలమైనది. ఆపైన కేవలం మమతావిరహితమైన మనస్సులో ఉద్భవించిన కారుణ్య

భావంతో సుందరికికూడా ధర్మదీక్షాప్రవేశం కలిగించవలసిందని గౌతముణ్ణి ప్రార్థిస్తాడు.

"తేరి ప్రసన్నమై మనము
తెల్వి వహించెను శోక మోహముల్
దూరములై భవాంబుధుల
దూలిన జీవుల నుద్ధరింపగాఁ
గోరిక పుట్టె దొంటి వలకూర్మికి
దవ్వుల నిల్చి వేడెదన్
బూరుషు లెల్ల నర్హు లయి
బోటులు మాత్ర మనర్హ లౌదురే!"

అనంతరం కొంచెంసే పాలోచించిన తరవాత బుద్ధుడు సుందరి దీక్షాస్వీకృతికికూడా అంగీకరిస్తాడు. ఇక ఎనిమిదో సర్గలో కవులు కొంతవరకు విరక్త అయిన సుందరి మనస్థితి వర్ణించారు. అటుపిమ్మట బుద్ధ శిష్యుడు సుందరిచేత కూడా ధర్మదీక్ష స్వీకరింప చేస్తాడు.

ఇక తొమ్మిదో సర్గలో కవులీ సుందరీ నందుల పరస్పర ప్రేమ పునీతమై పరిణతమైన విధం చాలా మనోహరంగాను, సుసూక్ష్మంగాను ధ్వనించారు. 'సహధర్మచర్యం' అనే ఈ సర్గలో బుద్ధుడు సుందరికీ, నందునికీ ప్రత్యేకంగా నందుడు, సుందరి అనే అనాథ శిశువుల నిద్దరిని అప్పగించ పెడుతున్నాడు. వీరిద్దరు ఆసన్న మరణయై శల్యావశిష్ట అయిన ఒక అనాథ వృద్ధురాలి శిశువులు. సుందరికి నందగతమైన అనురాగం అంతా చివరికి ధర్మశిశువయిన నంద బాలకుని రూపంలో సాక్షాత్కరించింది. అలాగే నందునికికూడా అనాథ శిశురూపం ధరించిన శిశు సుందరీ రూపంలో భార్యానురాగం సాక్షాత్కరించింది. సుందరీ నందుల పరస్పరానురాగం ఈవిధంగా పరిణతమై పునీతమై అనాథ శిశుసంరక్షణ రూపంలో విశ్వతోముఖమయినది. దంపతుల పరస్పరానురాగం పుత్ర పుత్రికా రూపంలోనే పరిణతమై పవిత్రం కాగలదని మన ప్రాచీనసంప్రదాయమే కాక ఏ ధర్మసంప్రదాయమైనా అంగీకరిస్తుంది. అయితే ఇక్కడ పరస్పరానురక్తులయిన సుందరీనందుల పూర్వానురాగం బౌద్ధధర్మ ప్రవేశానంతరం ధర్మ పుత్రికా పుత్ర పరిపాలన రూపంలో పరిణతి పొందింది. ఇది కావ్య లక్ష్యమే కాక సూక్ష్మంగా బుద్ధుని కరుణాళుతకూడా ధ్వనింప చేస్తున్నది.

## బౌద్ధ జీవకారుణ్యం

బౌద్ధం ప్రపంచ మతాలన్నిటిలోకన్నా ఎక్కువగా జీవకారుణ్యం బోధించింది. మిగిలిన స్వల్పమైన లక్షణాలన్నీ విడిచి వేస్తే ప్రత్యేకంగా ఈగుణం ఒకటే బౌద్ధానికి మకుటాయమానంగా కనిపిస్తున్నది. కనకనే సౌందరనందకర్తలీవిషయం ప్రధానంగా స్వీకరించి చివరిసర్గలో అంతటా అది ప్రత్యేకంగా అభివర్ణించారు. ధర్మ శిశువులైన సుందరీ నందుల సంరక్షించే విషయం మూలంలో లేదు. సంస్కృత కావ్యంలో సుందరి ధర్మదీక్ష స్వీకరించే విషయమే సూచనా ప్రాయంగా కనిపిస్తున్నది. అయితే తెలుగు సౌందర నందకర్తలకు అనురాగపరిణతి ప్రదర్శనమే. పరమలక్ష్యంకాబట్టి వారీ ధర్మశిశువుల విషయం కొత్తగా కల్పించుకుని తమ కథ కొక మనోహర కిరీటం మలుచుకున్నారు. ఈ విధంగా చివరిసర్గలో వీరు చూపించిన కథాశిల్పనైపుణి వీరి శక్తికొక చక్కని తార్కాణము.

ఈ కవులకు బౌద్ధధర్మప్రచారం ప్రధానలక్ష్యం కాదన్నది చాలా జాగ్రత్తగా గమనించవలసిన విషయం. కనకనే వీరా ధర్మంలో విశ్వజనీనము లయిన విషయాలు మాత్రమే స్వీకరించి సూక్ష్మంగా బౌద్ధవాతావరణం కల్పించుకున్నారు. గౌతమ బుద్ధుడుగాని, అతని శిష్యులుగాని చేసే ధర్మోపదేశ సందర్భాలలో బౌద్ధమతసారం మాత్రమే ప్రతిఫలించడానికీ, ఈ కావ్యంలో అనవసరమయిన ప్రత్యేక బౌద్ధ సిద్ధాంతాలఘోష వినబడకపోవడానికీకూడా ఇదే కారణం.

## రస నిర్వాహణం

ఇక రసనిర్వాహణ విషయం. నిజానికి శృంగార శాంతాల కంగాంగీ భావం కల్పించి ఆ రెండు రసాలకు పరస్పరవిరోధం లేకుండా కావ్యం రచించడం కవిసామాన్యుల కసాధ్యమే. ఈ కావ్యంలో శాంతం అంగిరసం కనకనే కవులు ప్రథమసర్గ అంతా బుద్ధుని పునరాగమనంతోను, పౌరు లతనియెడల చూపించే భక్తిప్రపత్తుల వర్ణనతోను, ధర్మబోధతోను ముగించారు. శాంతిరసం అంగిరసం అనే దృష్టితోనే బుద్ధుని పునరాగమనంతో వీరీ కావ్యం ప్రారంభించారు. ఇక చివరిసర్గ అంతా సుందరీనందుల ధర్మాచరణానికి సంబంధించినదే. ఈ కావ్యం బుద్ధదేవుని నమస్కృతితో ముగిసి పోతుంది. కావ్యంలోని ప్రారంభము, అంతము పరి

పూర్ణమైన ప్రశాంతవాతావరణంతో నిండిఉన్నాయి. ఇక కేవలం రెండు, మూడు, నాలుగైదు సర్గలలో మాత్రమే కొంత శృంగారవర్ణనం కనిపిస్తుంది. నిజానికి కావ్యంలో రెండవ సర్గ మొదలుకొని ఉవ్వెత్తుగా బయలుదేరిన శృంగార తరంగం అయిదవసర్గవరకు శాంతరసంతో పెనగులాడుతూ, అక్కడినుంచి కావ్యాంతంవరకు క్రమంగా క్షీణమై శాంతంలో లీనమై పోతుంది.

సౌందరనందకర్త లీ విధంగా సుందరీనందుల మానసిక పరిణతికీ శాంతరస పరిణతికీ కావలసిన క్రమాభివృద్ధి చాలా నిశితమైన శిల్ప చాతుర్యంతో ధ్వనించారు. ఈ విషయంలో సుందరీనందు లిద్దరిలోను అడుగడుగునా ఉద్భవించే పరితాపాలు, పశ్చాత్తాపాలు చిత్రించడంవల్లనే వారిద్దరు మనకళ్ళకు సజీవులయిన మానవమూర్తులుగా భాసిస్తున్నారు. అలాగ కాకుండా అలంకారశాస్త్రంలో అజ్ఞాపించినట్లిందులో ఏదో ఒక మహాద్భుతసన్నివేశం కల్పించి, సుందరీనందులిద్దరు అమాంతంగా ఒక్కసారిగా ఋషీశ్వరులై పోయారని వర్ణించి ఉంటే ఇది అంతా ఒక చచ్చు చవకబారు సినిమాకథలాగ తయారయి ఉండేది!

ఆంధ్రసౌందరనందకర్తలు తమ కావ్యంలో ఏర్పచుకున్న లక్ష్యము, ఆలక్ష్యసిద్ధికి వారవలంబించిన కావ్యశిల్పము, రసనిర్వహణ పద్ధతి, రస విరోధ పరిహారము, కథాకథన ధోరణి జాగ్రత్తగా అర్థం చేసుకుంటే ఇవి ఈ కావ్యావగాహనకు సహకరించగలవనే ఆశవల్లనే నేనీ విషయాలన్నీ ఇంతగా వివరించి వ్రాయవలసివచ్చింది. ఈ విషయాలన్నీ సూత్రప్రాయంగా విజయ వైశాఖ భారతిలోనే సూచించాను. అయినా శ్రీ సీతారామరావుగారివి తిన్నగా అవగాహన చేసుకోకపోవడంవల్లనో ఏమో తిరిగీ ఈనెల భారతిలో వేరొకచోట (561. పు. చూ.) సుదీర్ఘమయిన ప్రతి విమర్శనం వ్రాశారు.

## ప్రతి విమర్శనం

ఈ విమర్శనంలో వారు చాలాచోట్ల పూర్వం ఉద్ఘాటించిన విషయాలే మళ్ళీ మళ్ళీ పునరుద్ఘాటించారు. ఏమైనాసరే సౌందరనందంవంటి చచ్చు కావ్యం లేదనీ, తాను చెప్పింది ఋషిప్రోక్తంలాగ స్వీకరించి తీరవలిసిందేననీ ప్రవచించారు! పైన వివరించిన విషయాలన్నీ వారు తెలుగు సౌందరనందం మీద చేసినదోషారోపణలకు సమాధాన దృష్టితో వ్రాసినవే. వీరీమాసం వ్యాసంలో అలంకార శాస్త్రాన్ని గురించీ ఆ శాస్త్ర సిద్ధాంతాలనుగురించీ కొన్ని కొన్ని కొంగ్రొత్తవిషయాలు వెలిబుచ్చి ఉండడంవల్ల ఆయా విషయాలను గురించి కొంచెం విశేషించి వ్రాస్తాను.

## అలంకారశాస్త్ర ప్రాదుర్భావం

విజయ వైశాఖమాసంలో వ్రాసిన వ్యాసంలో నేను 'ఏ వాఙ్మయలోకంలోనైనా ముందుగా లక్ష్యం బయలుదేరిన తరవాతనే లక్షణ వివేచనం జరుగుతుం'దని వ్రాశాను. దానికి సమాధానంగా వీరు అలాగ ఎప్పుడూ జరగదనీ అలంకార శాస్త్రమంతా భరతాదులు ముమ్ముందుగా దివ్యదృష్టితో ఆర్షమైన మనః ప్రవృత్తితో నిర్మించి దానిప్రకారం కావ్యములు పరిశీలించినట్లు కనిపిస్తుం దనీ లేకపోతే కాళిదాసాదులలో తప్పులు చూపించడం జరిగి ఉండేదనీ వ్రాశారు.

ఇది వట్టి హేతువాద శూన్యమైన అపసిద్ధాంతమని ఆక్షేపిస్తే నాకు బొత్తిగా ఋషీశ్వరులమీద భక్తిప్రపత్తులు లోపించి పోయాయని సమాధాన మిస్తారేమో! నాకూ ఋషీశ్వరులమీద చాలా భక్తిప్రపత్తులున్నాయి! అయితే ఆఋషీశ్వరులు చెప్పారుగదా అని వారు వారి కాలానుగుణంగా చెప్పినవన్నీ ఇక త్రికాలా బాధ్యా లన్నంత మూఢభక్తి నాకెప్పుడూ కలగలేదు!

ఆ ఋషీశ్వరులు తాము చెప్పినవన్నీ అన్ని కాలాల్లోను శిరసావహించాలని కూడా ఎక్కడా చెప్పి ఉండలేదు! ఉదాహరణకు ధర్మనిర్ణయం చెయ్యవలసి వచ్చినప్పుడు లోకంలో ఉండే శిష్టాచారంకూడా ప్రమాణంగా స్వీకరించాలని మన ధర్మశాస్త్రాలలో ప్రతిపాదించారు. అందుచేత ఎంతటి ఋషీశ్వరులైనావారు చెప్పిన వాటిల్లో అప సిద్ధాంతాలేమైనా ఉంటే మనకు పరమేశ్వరుడు ప్రసాదించిన స్వంత బుద్ధి కూడా కొంతవరకు ఉపయోగించి ఆ అపసిద్ధాంతాలన్నీ ఖండించి వెయ్యవలసిందే నని ఎవరైనా అంగీకరిస్తారు.

శ్రీ సీతారామారావుగారు ఋషీశ్వరులు 'ఆర్షమైన దివ్యదృష్టితో ముమ్ముందుగా అలంకారశాస్త్రం రచించారనీ, ఆపైన రూపకాది లక్ష్యాలు బయలు దేరాయనీ నిర్వచించడం చాలా హాస్యాస్పదమైన విషయం! ఈవిధంగా వీరు--'అసలు మన వేదాల్లోనే విమానాలు, రేడియోలు ఉన్నా'యని చెప్పేవారి ధోరణిలోకి దిగిపోవడం చాలా శోచనీయం!

## అలంకారశాస్త్ర సిద్ధాంతం

శ్రీ సీతారామారావుగారి భారతిలో మొట్ట మొదట అలంకారశాస్త్ర మాహాత్మ్యాన్ని గురించి విపులంగా ఉపన్యసించి, ఆధునిక కావ్య విమర్శకింత కంటె వేరేశరణ్యం లేదనీ, ఇక ప్రపంచంలో ఉండుకున్న విమర్శనమార్గాలన్నీ ఈ అలంకారశాస్త్ర సిద్ధాంతాలలో అంతర్భవిస్తాయనీ ఇక మిగిలిన విమర్శన మార్గాలన్నీ వట్టి గాలి కబుర్లనీ వ్రాశారు. ఇవన్నీ విచిత్రమయిన నిర్వచనాలు అలంకారశాస్త్ర మార్గంలో ప్రపంచ విమర్శ మార్గాలన్నీ ఎలాగ అంతర్భవిస్తాయి చెప్మా! ఉదాహరణకు మార్క్సిస్టు సూత్రాలమీద ఏర్పడిన అభ్యుదయ విమర్శనమార్గం అలంకార మార్గంలో అంతర్భవిస్తుందా? ఇది ఇలా నుండగా వ్యాసం చివర నామీద వీరు నాకాశాస్త్రం మీద గౌరవం లేదనే ఒక కొత్త అభాండం కూడా పడవేశారు!

అలంకారికులు తమ సిద్ధాంతాలన్నీ భారతీయ తాత్త్విక ధార్మిక సిద్ధాంతాల పునాదులమీద నిర్మించుకున్నారు. ఈరోజుల్లో ఎవరైనా ఆతాత్త్విక సిద్ధాంతాలుగాని, ధార్మిక సిద్ధాంతాలుగాని అసంగీకార్యాలే అని వివదిస్తే అలంకార శాస్త్రం అంతా ఎగిరిపోతుంది. అయితే నే నంతవరకు వెళ్ళడంలేదు. అలంకార శాస్త్రంలోని రసాది సిద్ధాంతాలు కొన్ని నేటికీ శిరోధార్యాలుగా ఉన్నాయని అంగీకరిస్తున్నాను. అయితే ఆ శాస్త్రంలోని కొన్ని సిద్ధాంతాలు నేటికాలానికి సప్పవనీ రసాది సిద్ధాంతాలుకూడా ఆధునిక కావ్యదృష్ట్యా జాగ్రత్తగా సమన్వయించాలనీ అంటున్నాను. అవన్నీ మక్కికి మక్కిగా నేటి కావ్యాలకు సమన్వయిస్తే చాలా దుష్టపరిణామాలు కలుగుతాయనీ, అందుచేత కాలానుగుణంగా వాటిని సమన్వయించాలనీ విన్నవించుకొంటున్నాను.

ఈ సందర్భంలో ఇంకొక ముఖ్యవిషయం జాగ్రత్తగా గమనించాలి. అలంకార శాస్త్రం కొన్ని ముఖ్య రసాలున్నాయనీ, వాటికి పరస్పర విరోధాలు రాకుండా జాగ్రత్త తీసుకోవాలనీ చెప్పి, ప్రాచీన రచనలలోనించి దిఙ్మాత్రంగా కొన్ని ఉదాహరణా లిచ్చింది. అంతేగాని సౌందరనందంలో రసవిరోధం వచ్చిపడిందని అలంకారశాస్త్రం చెప్పలేదుగదా! ఆ మాట చెప్పేది సీతారామారావుగారే! అయితే అయినదానికీ కాని దానికీ సంస్కృతోదాహరణా లిచ్చి గడబిడ చెయ్యడంవల్ల సీతారామారావుగారిదంతా అలంకార శాస్త్రమే చెబుతున్నదనే భ్రాంతి —అనమం కొంతమంది పాఠకులకైనా—కలిగించినవారౌతున్నారు!

అలంకార శాస్త్రం ప్రకారం కావ్యవిమర్శన చెయ్యడంలో తప్పేమీ లేదు. కాని ఆ శాస్త్రసిద్ధాంతాలు జాగ్రత్తగా బోధపరుచుకోవాలి. అవి అర్ధ కసిగా చదువుకుని హడావిడిగా విమర్శనకు దొరకబుచ్చుకోకూడదు! శ్రీ సీతారామారావుగారు శాస్త్రంలో రూపక లక్షణ సందర్భంలో చెప్పిన సంధి సంధ్యంగ విషయం వంటి ప్రాథమిక విషయం కూడా తిన్నగా బోధపరుచుకోలేదు. ఇది అధమ పక్షం విద్యానాథుని ప్రతాపరుద్రీయంవంటి ప్రాథమి కాలంకార శాస్త్రగ్రంథం పఠించినవారికి కూడా స్పష్టంగా తెలిసే విషయం!

## సంధ్యంగ సమన్వయం

విశాఖమాస భారతిలో నేను సంధ్యంగాలకు, కావ్యాలకు ఏవిధమైన సంబంధములేదనీ, ఈ విధంగా సమన్వయం చెయ్యాలని చెప్పిన ప్రమాణంగాని, ఉదాహరణగాని చూపించవలిసిందనీ ప్రశ్నించాను. పాపం! అసంఖ్యాకంగా ఉన్న అలంకార గ్రంథాలలో గాని, ప్రాచీన వ్యాఖ్యానాలలో గాని, వారి కెక్కడా అలాంటి ఉదాహరణలు దొరకలేదు! ధ్వన్యాలోకంలో దీనికి సంబంధించిన' భాగం ఉదాహరించారుగాని, దానిలో దీనికి సంబంధించిన లక్షణ సమన్వయం అంతా రూపకాలకే సంబంధించి ఉన్నదని వారే అంగీకరించారు. దీనికి వారిని హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను! కాని ఇంకా వారిది కావ్యాలకుకూడా సంబంధిస్తుందని వాదించడం శోచనీయం! పాపం వారికీ ధ్వన్యాలోక పంక్తిలోని "ప్రబంధస్యచేద ముఖ్యనుప్రఖ్యం నిబంధనం" అన్న వాక్య భాగంలోని ప్రబంధపదానికి అర్థం బోధపడలేదు! ధ్వన్యాలోక కారు డీ ప్రబంధపదం ఇక్కడ రూపకార్థంలోనే వాడాడు. అందుచేతనే దీనికి రూపకాల్లోనించి మాత్రమే ఉదాహరణలిచ్చి ఊరుకున్నాడు. ధ్వన్యాలోక వ్యాఖ్యాత అభినవగుప్తుడు కూడా ఇల్లాగే సమన్వయించాడు. 'కాళిదాసు మాళవికాగ్నిమిత్రంలో "భాస సౌమిల్లక కవిపుత్రాదీనాం ప్రబంధా నతిక్రమ్య—" అనే చోట ఈ ప్రబంధపదం వాడాడు. 'భాస సౌమిల్లకాదుల రూపకాలుండగా కాళిదాస

కవి రూపకా లభిమానించడం ఎందు' కని ఈ వాక్యాని కర్థం. ఆ కాలంలో ఈ ప్రబంధపదం రూపకార్థంలో వాడే అలవాటుండడం వల్లనే అనంద వర్ధనుడు ఆ అర్థంలో అది వాడాడు. అది తెలియక ఆ సందర్భంలో ప్రబంధం అంటే కావ్యంకూడా అవుతుందని అపార్థంచేసుకుని సీతారామారావుగారీ సంధి సంధ్యంగాల తతంగం అంతా సౌందరనందానికి పట్టించడం ప్రారంభించారు. దీని అసలు రహస్యం ఇదీ అని వీరి ఉదాహరణవల్ల తేలిపోయింది! ఈమాత్రం ప్రాథమికవిషయాలైనా తిన్నగా బోధపరుచుకో లేని వారంతా ఆ అలంకార శాస్త్రభక్తులు కావడంవల్లనే ఆ శాస్త్రానికీ, ఆధునిక కావ్యాలకు ఇంతటి తీరని అపచారం జరుగుతున్నది! సంస్కృత సాహిత్యాభ్యాసము, అలంకార శాస్త్రాభ్యాసము ఈ రోజుల్లో ఎంతగా లుప్తప్రాయమైపోయినా ఇంకా కొంతమంది అలంకార శాస్త్రవేత్త లీ దేశంలో అక్కడక్కడ ఉండిఉంటారని ఊహించి ఉంటే వీ రింతటి సాహసానికి దిగిఉండరని తోస్తుంది!

## బలాత్కార సన్యాసం

బలాత్కార సన్యాస విషయం విమర్శిస్తూ శార్ధసంప్రదాయాభిజ్ఞుడయిన అశ్వఘోషుడే ఇది ప్రవేశపెట్టాడనీ, సర్వజ్ఞుడయిన బుద్ధుని సంకల్పబలాని కిది వదిలిపెడితే దీనిలో విడ్డూమేమీ లేదనీ నేను వ్రాశాను. దీనికి సమాధానంగా వారు ఇలాంటి వ్యంగ్యానికీ కావ్యంలో సూచన ఏదీ లేదని వ్రాశారు. దీన్ని బట్టిచూస్తే అథమపక్షం వీరు సౌందరనందమైనా తిన్నగా చదవలేదని స్పష్టపడి పోయింది!

సౌందరనంద కావ్యకర్తలు కొన్నికొన్ని సర్గలకు మొదట కొన్ని పద్యాలువ్రాసీ ఆ సర్గరహస్యం అంతా సూక్ష్మంగా ఆయా పద్యాలలో ధ్వనించారు. ఇది నందుని సన్యాసం వర్ణించిన 'పరివ్రాజన' మనే తృతీయసర్గ మొట్టమొదటి పద్యం. ఆ పద్యం ఇక్కడ ఉదాహరిస్తున్నాను.

"హితము నహితమ్ము నుచితాను చితలను జెడి
హద్దుల నతిక్రమించి ఫలాను పేయ
ములను నార్యశుభారంభములను స్వస్తి
యగుత విశ్వమ్మునకు శ్రేయమగును గాత!"

ఈ పద్యంలో పూజ్యుల శుభారంభాలు సామాన్యుల హితాహితోచితానుచితాది అవధులను అతిక్రమించి ప్రవర్తిస్తూంటాయని ఈ కవులు స్పష్టంగా సూచించారు. ఈ మాత్రంగానైనా కావ్యం చదవకుండా నవ్యాంధ్ర విమర్శన సాహిత్యోద్ధరణకు పూనుకోడం న్యాయమేనా? అని వారిని సవినయంగా ప్రశ్నిస్తున్నాను.

## ప్రాథమిక శబ్దం

నేను వ్రాసిన వ్యాసంలో విశేషక ప్రాథమిక శబ్దాల విషయం విమర్శించి ఈమాత్రం ప్రాథమిక శబ్దజ్ఞానం లేనివారు కావ్య విమర్శ చెయ్యడం న్యాయమేనా? అని ప్రశ్నించాను. దాని మీద వీరు విశేషక శబ్దవిషయం చల్లచల్లగా జార విడిచివేశారు. ఇదేకాదు. నా వ్యాసంలో విమర్శించిన పగటి శృంగారము, రసాభాసము మొదలైన విషయా లన్నింటికి సమాధానా లివ్వకుండా దాటుకుపోయారు. ప్రాథమిక శబ్దంకూడా అలాగే జారవిడిచివేస్తా రనుకున్నానుగాని అది జరగ లేదు. దానికి లోకంలో (*Elementary*) అనే అర్థం ఉన్నదనీ అందుచేత ఇది తప్పనీ మళ్ళీ మొదలు పెట్టారు. సౌందరనందం గ్రాంథిక భాషాగ్రథితమైన కావ్యం. అందుచేత, అందులో ఉన్న శబ్దాల సాధుత్వ సాధుత్వాలు నిఘంటువులనుబట్టి నిర్ణయించాలిగాని లోకవ్యవహారాన్నిబట్టి నిర్ణయిస్తే ఎలాగ? సౌందరనందం వ్యావహారిక భాషాకావ్యమా? కానప్పుడు వీరీ పదం వ్యావహారికార్థం పట్టుకుని ఇంకా ఎందుకు వేళ్ళాడుతున్నారో మరి ఆ పరమాత్ముడికే బోధపడాలి!

సౌందరనంద కావ్యములోని లక్ష్యము, అలంకారశాస్త్రము, దాని లక్ష్యాలు, ఔచిత్యవిషయాలు, శబ్ద సాధుత్వాలు మొదలైన వాటిని గురించి ఇంతగా వ్రాసినా శ్రీ సీతారామారావుగారీ కావ్యం ఎందుకూ పనికిరానిదాని అదేపనిగా వాదించడం మొదలు పెడితే వారి నెవరు ఏమీ చెయ్యలేరు!

శ్రీ సీతారామారావుగారు తమవ్యాసం చివరి భాగంలో నావ్యాసాలకు సమాధానా లివ్వదలుచుకో లేదని భీష్మించారు. ఒక ఉత్తమకావ్యంమీద దుర్విమర్శచేసీ, న్యాయ్యమైన ప్రతివిమర్శ వచ్చి నపుడు సమాధానం ఇవ్వమని భీష్మించడం ధర్మమేనా? ఇలాంటి వాదోపవాదాలకు నేనున్నూ దూర దూరంగా తొలగిపోతూంటాను. అయితే ఈరోజుల్లో ఆధునిక కావ్యవిమర్శ అంతరువు బొత్తిగా దిగజారి పోతూండడంవల్లను, శ్రీ సీతారామారావుగారు సౌందర నందంవంటి ఉత్తమకావ్యంమీద కేవలం బాధ్యతా

రహితమైన విమర్శ చెయ్యడంవల్లను నే నీవిమర్శ ప్రారభించాను. వీరి కావ్యలక్ష్యం కొంచెమైనా అవగాహన చేసుకోకుండా అపార్థం చేసుకుని పాఠకులనుకూడా భ్రమింపచెయ్యడానికి ప్రయత్నించారు.

సౌందరనంద కావ్యంమీదనేగాక ఈదేశంలో మిగిలిన సుప్రసిద్ధ కవులకావ్యాలన్నిటిమీద వీరిల్లాంటి విమర్శనలే వ్రాశారు. వీరు చేసిన విమర్శనలనుబట్టి చూస్తే వీరు ఉత్తమకవులని ప్రశంసించినవారు కూడా ఉత్తమకవులు కారేమోనని కొంతమంది పాఠకులకు సందేహం కలుగుతుందేమో తెలియదు!

వీరి శాస్త్రతావిరహితవిమర్శకు ఒక ఉదాహరణ ఇస్తున్నాను. వెనకటి భారతిలో వీరు జాషువాగారి కవితనుగురించి విమర్శిస్తూ వారికి వ్యుత్పత్తిలేదని వ్రాశారు. వ్యుత్పత్తిలేదన్నప్పుడు వారికవితలో శబ్దపాండిత్యలోపంగాని, శాస్త్రపాండిత్యలోపంగాని, సూచించే ప్రయోగా లేమైనా ఎత్తి చూపించారా? లేదు! ఊరికే ఉత్తపుణ్యానికని ప్రసిద్ధుడైన ఒక కవిమీద ఇలాంటి అభాండం పడవెయ్యడం ధర్మమేనా! వీ రంతటితో ఊరుకోకుండా వారికి అభ్యుదయకవివర్గానికి ఆచార్యపీఠంకూడా అందించారు. దీనినిబట్టిచూస్తే వీరికి అభ్యుదయ కవితాస్వరూపంగాని, జాషువాగారి కవితాస్వరూపంగాని తెలిసినట్లు కనబడదు. ఆ పీఠానికి వారు, అభ్యుదయకవులు ఎంతవర కంగీకరిస్తారో తెలియదుగాని అదంతా శ్రీ సీతారామారావుగారి కవితా తారతమ్యజ్ఞానలోపాని కొక చక్కని తార్కాణంగా కనిపిస్తున్నది! అయితే ఇది అంతగా ప్రస్తుతానికి సంబంధించినది కాకపోవడంవల్ల — ఇంతటితో ఈ విషయం విడిచివేస్తున్నాను.

వీరు తమ వ్యాసంలో నా వ్యాసవిషయాలను గురించి బొత్తిగా తాడు బొంగరము లేనివేవేవో వ్రాశారుగాని అవి సమాధాన యోగ్యాలు కాకపోవడంవల్ల ఆ విషయాలజోలికైనా పోకుండా వదిలివేస్తున్నాను.

ఒక్కొక్క విమర్శకులు కావ్య విమర్శలు ప్రారంభించినప్పుడు కావ్యశక్తిసామర్థ్యాలు అపూర్వంగా పాఠకుల కవగతమైనట్టు భాసిస్తాయి. ఒక్కొక్కప్పుడు ఒక్కొక్క కావ్యమే విమర్శకుల లోపాలను వెల్లడిచేస్తుంది. సౌందరనందవిమర్శలో సరిగా ఇదే జరిగింది!

శ్రీ సీతారామారావుగారు తమ వ్యాసంలో నామీద ఏకవచనప్రయోగా లుపక్రమించారు. మరి ఈ వ్యాసం చూసినతరవాత ఇంకా తీవ్రధోరణిలోకి మారిపోతారేమో తెలియదుగాని — అయినా సవినయంగా వారిని అధునాతనాంధ్రకావ్యాలు చాలా జాగ్రత్తగా పరిశీలించవలసిందనీ, సౌందరనందకావ్యం కూడా నేను విమర్శించినదృక్పథంతో పఠించవలసిందనీ ప్రార్థిస్తున్నాను.

విమర్శకు లెవరయినా పాఠకులకు అత్యంత సన్నిహితులయిన సహకారులుగానే ఉపకరిస్తారు. అంతేగాని సాక్షాత్తుగా కావ్యాస్వాదం కలిగించడంలో విమర్శకులు తోడ్పడలేరు. ఈ ఆస్వాదకశక్తి ఆయాపాఠకుల అభిరుచిపరిణతినిబట్టీ, శక్తినిబట్టీ తరతమభావంతో మారుతూ ఉంటుంది. అందుచేత సౌందరనందకావ్యంలోనించి ఒకపద్యం ఇక్కడ ఉదాహరించి ఆ కవితాపరిణతి నిర్ణయభారం సహృదయులకే వదిలివేస్తున్నాను. ఈ పద్యం సౌందరనందలోని పరిపక్వ కవితారచన కొక చక్కని ఉదాహరణము:

ఇది సౌందరనందంలోని 'ధర్మసంవాద'మనే ఆశ్వాసానికి ప్రారంభంలో సూచనాప్రాయంగా రచించిన సీసము.

'దగదీరనీరమ్ము ద్రావియోలలవాడి
　　రారయ్య! యో బాటసారులార!
చల్లని యీ తరుచ్ఛాయలసేదదే
　　ఱ విశ్రమింపరారయ్య! సుంత
మగ్గిరాలినఫలమ్ముల నారగింపర
　　య్యా! మాకు నాత్మీయులైతిరింక
అడ్డమాటలు లేక యాడుడు! పాడు డు
　　య్యాల లూగుడు సంశయింపవలదు!
కేళిదీర్ఘిక కలవలు గూలద్రోసి
చూఱవదలిలి నలుగులు పాఱవిడిచి
అరమరలు లేక కొంచక యనుభవింప
రమ్మ! రాయంచలార! భృంగమ్ములార!

# తుది కోర్కె

★

శ్రీ పురిపండా అప్పలస్వామి

నిన్నె తలపోసి తలపోసి
నీ యుదారమూర్తి ఎదనిల్పి
మరణింతు నేను.
ఎపుడో
సంజతారకయో,
చిన్ని మబ్బుతునకో,
గాలిపిల్లలో వచ్చి నీచెవులనూది
నేను లేనన్న వార్త విన్పింతురేని,
కంట రానీకు మొక్క కన్నీటిచుక్క.
వలదు వలదొక్క వేడి నిట్టూరు పేని,
వలదు ప్రియతమా, ఒక్క నిట్టూరుపేని.
చిరుచివరి కోర్కె మన్నింతువేని సుంత
నీచరణధూళి నా ఎత్తిపోతలపుడు
నాచితా భస్మమున చల్లుమింత;
చాలు.
జన్మజన్మాల ఫల మంది కొందు నేను.

——

# విచారణ

★

మూలం:
టాల్ స్టాయి

అనుసరణం:
చంద్రుపట్ల సూర్యనారాయణ

గ్రామంలో కాశీనాథుడు భాగ్యవంతుడనే చెప్పాలి. ఊళ్ళో రెండు దుకాణాలూ, మంచి భూవసతీ అతనికున్నాయి. వ్యాపారం కూడా ఒడిదుడుకులు లేకుండా లాభసాటిగా సాగిపోతోంది. ఓనాడు తెల్లవారగట్లే లేచి కిరాణా దినుసులు కొనడానికి పట్నం వెళ్ళడానికి ఏర్పాటులన్నీ చేసుకుంటున్నాడు. బండివచ్చి వాకిట్లో నిలబడింది. అంతట్లో భార్య లోపలినుంచి నురగలు గక్కుకుంటూ సావిట్లోకి వచ్చిపడింది.

"యిదిగో చూడండి, మీకే చెప్పేది. ఏమైనా సరే మీరీవేళ బయలుదేరవద్దు. రాత్రి ఆ కలవచ్చినప్పటినుంచి భీతావహంగా ఉంది. యీవేళకి మాత్రం ప్రయాణం తలపెట్టకండి, పుణ్యముంటుంది."

"అసలింతకీ ఆ వచ్చిన కల ఏమని?"

"కల చెప్పకూడదండీ, చెపితే తప్పకుండా జరిగి తీరుతుందిట."

"అయితే మరేం! కల చెప్పలేదుగా, దాని ఫలితం యింక లేదులే."

"ఏమైనా సరే యీవేళకి మాని వేద్దురూ, వెడితే నన్ను చంపుకుతిన్నట్టే" అంటూ జాలిగా భర్తని బతిమాలింది. కాశీనాథుడు ఆమె తలనిమురుతూ మెల్లిగా చెప్పసాగాడు.

"మాకు కలకి ఏమన్నా అర్థముంటుందా? కల కల్ల అన్నారు. యిలాంటి పిచ్చి పిచ్చి నమ్మకాలు పెట్టుకుకూచుంటే వ్యాపారం సాగుతుందా? దేవుడి పేరు తలుచుకొని బయలుదేరితే ఏ దుస్వప్నం ఏమీ చెయ్యదు. నే చెబుతున్నాను, విను. నాకే ప్రమాదం రాదు. హాయిగా తిరిగి యింటికి చేరుకుంటాను. సరా?"

మొత్తానికి ఎల్లాగైతే నేమి, భార్యని ఒప్పించి, కొడుకు లిద్దర్నీ ముద్దుపెట్టుకొని సాహుకారు ప్రయాణం సాగించాడు. పోతూపోతూ బండిలోంచి తొంగి తొంగి చూస్తూ క్షేమంగా తిరిగివస్తాననీ, మరేం భయపడవద్దనీ, జాగ్రత్తగా ఉండమనీ బండి మలుపు తిరిగేవరకూ భార్యని హెచ్చరిస్తూనే ఉన్నాడు.

దారిలో మరో సాహుకారు తటస్థపడ్డాడు. అతనుకూడా సరుకులు కొనడానికే పట్నం పోతున్నాడు. 'శాంతి డాంగా'లో ఒక హోటలులో యిద్దరూ దిగి ఆ రాత్రికి అక్కడే ఉండిపోయారు.

అవి మాంచి వేసవిరోజులు. పగలల్లా ప్రయాణంలో బాగా ఎండదెబ్బ తిన్నాడేమో కాశీనాథుడు తెల్లవారు గట్లదాకా ఒళ్ళు తెలియకుండా నిద్రపోయాడు. హఠాత్తుగా మెలకువ వచ్చిచూసేసరికి తలుపులు తీసిఉన్నాయి. ఒక్కసారి ప్రాణాలన్నీ యెగిరిపోయినట్టుగా అయింది. రాత్రి తను తలుపులు గడియపెట్టి మరీ పడుకున్నాడు. బట్టలు, పాతలు, డబ్బు చూసుకున్నాడు. అన్నీ సరిగానే ఉన్నాయి. బహుశః కూడా ఉన్న ఆసామీ ఓ రాత్రివేళ బయటికి వెళ్ళివచ్చి గడియ వేయడం మర్చిపోయిఉండాలి. అతగాడు వంటినిండా ముసుగుదన్ని గాఢంగా నిద్రపోతున్నాడు. అటువంటి సమయంలో లేపడం వృథా అనుకొని కాశీనాథుడు బైటకొచ్చి బండిమీద చతికిలపడ్డాడు. బండి నడకసాగించింది.

ఎండ నిప్పులుకురుస్తూ ఉంది. మిట్టమధ్యాహ్నమైంది. ఎడ్లు నీళ్ళకోసం తహతహ లాడిపోతున్నాయి. నోట్లోంచి నురగలు గక్కుతున్నాయి. ఓ చెట్టునీడని బండి విప్పేసి విశ్రాంతి తీసుకుంటున్నారు. నీడని గడ్డిమీద గావంచా పర్చుకొని శెట్టి మేనువాల్చాడు. ఎడ్లు ఒట్టి గడ్డిపరకలు మేస్తున్నాయి. బండివాడు వంటప్రయత్నంలో ఉన్నాడు. యింతట్లో సపరివారంగా పోలీసు యిన్స్పెక్టరు వచ్చి

అక్కడ హాజరయ్యాడు. తిన్నగా కాశీనాథుడి దగ్గిరికే వెళ్ళి ప్రశ్నించడం ప్రారంభించాడు.

"ఏమయ్యా, యింటిదగ్గిర్నుంచి యెప్పుడు బయలుదేరావ్?"

"నిన్న ఉదయం."

"యెక్కడికి వెడుతున్నావు?"

"దినుసులు నిమిత్తం పట్నం పోతున్నాను"

"రాత్రి శాంతి డాంగాలో ఉన్నావా?"

"చిత్తం. ఉన్నాను."

"నీతోబాటు నీ గదిలో మరెవరు బసచేశారు?"

"ఓ సాహుకారు మాత్రం ఉన్నాడు. నిన్న దారిలో అతనితో నాకు పరిచయం అయింది. అయితే యీ ఘోగట్టా అంతా అడుగుతున్నారు కారణం తెలిసికోవచ్చా?"

"అతను చచ్చిపోయాడు. రాత్రే ఎవరో అతన్ని కత్తితో కంఠంలో పొడిచి హత్యచేశారు."

కాశీనాథుడు కంపించిపోయాడు. "హత్యే! హత్యచేసేశారా!!"

"ప్రక్కనున్న కాగితాలు చూస్తే అతనిదగ్గిర చాలా డబ్బున్నట్టు తెలుస్తోంది. హంతకుడు సొమ్ము దక్కించుకొని పారిపోయాడు. నువ్వు తప్ప ఆ గదిలో మరెవ్వరూ ఉన్నట్టు లేదు."

"లేరు. ఆ గదిలో మరెవ్వరూ లేరు. మేమిద్దరమే ఆ గదిలో పడుకొని ఉన్నాము."

యిన్స్పెక్టరు కాశీనాథుడినీ, సామానునీ సోదా చేశాడు. మొలనున్న గుడ్డసంచిలో బోలెడు డబ్బు దొరికింది. బిచానామీద అక్కడక్కడ రక్తపు చుక్కలు కనిపించాయి. తరగడా కిందనుంచి ఒక కత్తి బయటపడింది. అది రక్తపు మరకలతోటి నిండి ఉంది. కాశీనాథునికి నోటిమాట రాలేదు. ఆ పాదమస్తకం కంపించి కొయ్యబారిపోయినాడు.

యిన్స్పెక్టరు కఠిన స్వరంతో అన్నాడు "యీ మాటు ఒప్పుకుంటావా?" అని.

కాశీనాథుడు సొమ్మమాత్రం తనదేనని, యింతకు మించి తా నేపాపమూ ఎరగనని గోలపెట్టాడు.

యిన్స్పెక్టరు అంటాడుగదా "యిద్దరూ వర్తకులే. యిద్దరూ సరుకులు కొనడానికే బయలుదేరారు. యిద్దరిదగ్గరా డబ్బుంది. పడుకునే టప్పుడు తప్పకుండా గడియలు వేసే పడుకొని ఉంటారు. అవునా, కాదా?"

"అవును. నేనే స్వయంగా తలుపులు గడియలు వేసేసి మరీ పడుకున్నాను."

"పరిస్థితులన్నీ గమనిస్తే నువ్వే అతణ్ణి హత్య చేశావు."

"లేదండీ, బాబు. దైవసాక్షిగా చెబుతున్నాను. ఆ సంగతే నేనేమీ ఎరగను."

యిన్స్పెక్టరు కత్తి కాశీనాథుడి ముఖానికి ఎదురుగా పెట్టి చెప్పడం ప్రారంభించాడు. "యిదిగో చూడు. ఆ కత్తే యిప్పటికీకూడా రక్తంతో నిండి ఉంది. నీ తరగడా కిందనుంచే దొరికింది. యింతైన తర్వాతకూడా పాపం నువ్వేమీ ఎరగవ్. పోనీ అంటే నువ్వుతప్పితే గదిలో యింకెవ్వరూ లేరాయె."

"బాబూ, ఆ నారాయణుడికే తెలియాలి. యీ విషయంలో నేనే పాపమూ ఎరగను."

"కాశీనాథా! నేరం చేసినవాళ్ళందరూ అలాగే అంటారు. కోర్టులో అన్ని సంగతులు తేలిపోతాయి."

పోలీసులు కాశీనాథుడి చేతులికి సంకెళ్ళువేసి తీసికొనిపోయారు. యీ వార్త కాశీనాథుడి స్వగ్రామంలో అందరికీ తెలిసిపోయింది. యిప్పటివరకు అందరు అతన్ని మంచివాడుగానే ఎరుగుదురు. యీ వార్త విని ఆశ్చర్యపోయారు. కొంతమంది తెలివైన పెద్దవాళ్ళు బుర్రకాయలు ఆడించి 'యీ ప్రపంచంలో ఏదీ అసంభవం కాదు. సొమ్ము పాపిష్టిది' అన్నారు.

పాపం కాశీనాథుడి భార్య క్షోభ యింతా అంతా కాదు, ఆవిడిని పట్టుకోడం ఎవరివశం అయింది కాదు. ఏడ్చి, ఏడ్చి సొమ్మసిల్లి పడిపోయింది. నోటివెంట నురగలు కక్కుకుంది. తెలివివచ్చాక తల బల్లకేసి కొట్టుకుంది. నుదురంతా రక్తం చిమ్మింది. పిల్లలిద్దరూ చిన్నవాళ్ళు. చిన్నవాడు యింకా తల్లిదగ్గిర పాలు తాగుతున్నాడు. యిద్దరు పిల్లల్ని వెంటబెట్టుకొని వ్యయప్రయాసలకోర్చి ఆమె పట్నం చేరుకుంది. డబ్బు విశేషంగా ఖర్చుపెట్టి జైల్లో భర్తని చూడ్డానికి అనుమతి తెచ్చుకుంది.

ఇంక కాశీనాథుడి సంగతి. అతడు ఖూనీకేసు ముద్దాయి. చేతులికి సంకెళ్ళు. కాళ్ళకి బేడీలు. ఒక చిన్న కొట్లో ఒంటరిగా ఒక కంబళీమీద పడి

ఉన్నాడు. కళ్ళు రెండూ లోపలికి దించుకు పోయాయి. నల్లగా ఉండే తలవెంట్రుకలు నెరవడం ఆరంభించాయి. శరీరం ఎండిపోయి బక్కచిక్కింది. యీ కొద్దిరోజుల్లోను అతను జీవితంలో పదిసంవత్సరాలు గడిపివేసినట్టుగా ఉన్నాడు. యీ దృశ్యం ఆ దురదృష్టవంతురాలు చూసి సహించలేకపోయింది. భర్త కాళ్ళకు తలకాయ ఆనించి ఎంతసేపు ఏడ్చిందో. లేచి కళ్ళు తుడిచికొని చీరచెరగుతో అతని కళ్ళు తుడిచి దీనంగా అన్నది. "చాలాసేపు ఉండడం పడదు. ఉన్నంతసేపు ఏమన్నా రెండుమాటలు చెప్పండి, ఏడవకండి."

కాశీనాథుడు రుద్ధకంఠంతో అన్నాడు. "నీకల నిజంఅయింది సుమా."

"లేదు. లేదు. ఎంతమాత్రం నిజంకాదు. ఎప్పటికీ కల ఫలించదు. మీరే చెప్పారుగా కల నిజం కాదని. మీమాటా ఎప్పటికీ అబద్ధంకాదు. భగవంతుడు మనల్ని పరీక్షిస్తున్నాడు. కష్టాలు కొాపరం ఉండిపోవు. మళ్ళీ మనకి మంచిరోజులొస్తాయి." కాశీనాథుడు కళ్ళనీళ్ళు తుడిచికొని భార్యచేతిని తన చేతిలోకి తీసికుంటూ అన్నాడు" వింటున్నావా, మణికా! నేను అతను ఒక్కగదిలో నిద్రపోయాం. పడుకునేటప్పుడు నేనే స్వయంగా తలుపులు గడియలు వేశాను. గదిలో మరెవ్వరూ లేరు. ఆ రాత్రే హత్యజరిగింది. రక్తపు డాగులతో ఉన్న కత్తి నా బిచానాలోంచే దొరికింది. నేను చంపలేదని ఎవరు నమ్ముతారు.

"నమ్మకమా? మీరు చంపలేదని నాకు తెలుసు. మీవల్ల యీపని జరగదు. జరగలేదు కూడాను. భోజనానికి కూచుని తినబోయే కంచం అడుక్కోడానికి వచ్చిన ముష్టివాడికోసం నెట్టేస్తారుకదా, ఆస్పత్రిలో ఎవడో ముక్కు ముఖం తెలియని రోగికోసరం మీ రక్తం ధారపోసి వాడిని బ్రతికించి, రక్తం లేకపోవడాన్ని 6 మాసాలు మంచాన్న బడ్డారుకదా, అలాంటి మనుష్యులు యీలాంటి ఆ ఘాయిత్యాలు ఒక్కనాటికీ చెయ్యరు. ఆ నారాయణుడే అన్నీ ఎరుగును. మిమ్మల్ని నష్టపెట్టుకోడు. నిండుమనస్సుతో చెపుతున్నాను వినండి. మీకు విముక్తి కలిగి తీరుతుంది. ఎవరైతే మిమ్మల్ని యిలా హింసిస్తున్నారో వాళ్ళే మీరు నిర్దోషులని తెలిసికొని విడిచిపెట్టేస్తారు. బెంగపెట్టుకొని శరీరం అంతా పాడుచేసికొన్నారు. యికనైనా మీ ఒళ్ళు మీరు చూసుకోండి. మీరు యింకా బెంగపెట్టుకొని కృశించి పోతూంటే నేను చూసి సహించలేను. ఆ నారాయణ్ణే స్మరించుకోండి. ఆయనే మన కష్టాల్ని తొలగించగలడు."

కాశీనాథుడు ఒక దీర్ఘనిశ్వాస విడిచి అంటాడు గదా" అవును. మణికా! యింక యిప్పుడు బ్రతికించగలిగేది ఆ భగవంతుడే. అసహాయులకి సహాయం అతడే గదా. కాని, మణికా, అతణ్ని స్మరించడానికి నాకు శక్తి చాలడంలేదు. ఆ నారాయణుడు నా హృదయ కమలంలోంచి మాయమై ఆస్థానంలో నువ్వు, యీ యిద్దరు పిల్లలు స్థిరనివాసం ఏర్పరచుకొన్నారు. మనస్సులో కేవలం మీ చింతతప్ప మరొక ఆలోచన దరిచేరడంలేదు. మీరేమాతారు? నువ్వు అసహాయవి. యీ పిల్లల్ని తీసికొని ఎక్కడికిపోతావు. యీ చింతతోటి మనస్సు పరిపరివిధాల పోతున్నది. హే భగవాన్ ఆదినారాయణా?"

సిపాయివచ్చి టైం అయిపోయిందని బైటికివెళ్ళిపోవాలని చెప్పిపోయాడు.

మణిక భర్త పాదాలు పట్టుకొని చెప్పింది. "వెడుతున్నాను. మమ్మల్ని గురించి బెంగపెట్టుకోకండి. మనం అందరం కలిసిఉన్నప్పుడు ఆ భగవంతుడే రక్షించాడు. యిప్పుడూ అంతే. నన్ను, పిల్లల్ని, మిమ్మల్ని అతడే కాపాడుతాడు. ఆభారం నారాయణునికే విడిచి పెట్టండీ."

వాళ్ళు కనిపించినంతవరకు కాశీనాథుడు భార్యని, బిడ్డల్ని ఆ కటకటాల సందుల్లోంచి చూస్తూ ఆలాగే నిలబడిపోయాడు. వాళ్ళు కనిపించక పోవడంతోటే నేలమీదపడి దొర్లుతో ఏడుస్తో—'శ్రీహరీ! వాళ్ళభారం నువ్వే వహించాలి' అంటూ ఆదేపనిగా తనలో తాను గొణుక్కోవడం ప్రారంభించాడు.

మణిక యింటికివెళ్ళి విశ్వాసంతో తల్లి దుర్గమ్మకి పూజచేసి మొక్కుకుంది. మూడురోజులు ఉపవాసం ఉండి యిలవేల్పు నారాయణుడికి తులసిపూజ చేసింది. తన నగలు, భూమి, ధాన్యం, చెరువులు, తోటలు, సమస్తం అమ్మి భర్తకేసును గురించి ఖర్చుచేసింది. కాశీనాథుడివద్ద దొరికిన పైకం అతని స్వంతద్రవ్యమని కోర్టులో రుజువుచెయ్య గలిగినారు. అతడు నిర్దోషి అని మాత్రం రుజువు చెయ్యలేక పోయినారు. ఉరిశిక్ష అయితే కాలేదు గాని పధ్నాలుగు సంవత్సరాల కఠిన వరకం మాత్రం తప్పలేదు.

## 2

కాలచక్రం తిరిగి తిరిగి అయిదు దీర్ఘవత్సరాలు దొర్లిపోయాయి. కాశీనాథుడి జుట్టంతా ముగ్గుబుట్టలా పండిపోయింది. శరీరం వట్టి ఎముకలపోగులా గుంది.

పడిస్తే మెల్లిగా కాని నడవలేడు. బహుమితంగా మాట్లాడుతాడు. ఎప్పుడూ నవ్వు యెరగడు. జైల్లో తనకున్న పనిపాటలు చూసికొని తీరికదొరికినపుడల్లా భగవద్ధ్యానం చేసుకుంటూ ఉండేవాడు. రాత్రి వేకువఝామున కంఠంవిప్పి భజనకీర్తనలు గానం చేసేవాడు. చిట్టివయసులో ఉన్నప్పుడు మంచి గాయకుడు. సుదీర్ఘ కారాగారక్లేశంలో అతనికున్న సంపదలన్నీ నశించాయి గాని కంఠమాధుర్యం మాత్రం వీసం కూడా తగ్గలేదు. జైల్లోఉన్న నిర్భాగ్యులంతా యితని సుమధుర గానాలాపానికి తన్మయత్వం చెంది భక్త్యావేశంతో పరమేశ్వరుడికి నమస్కరించేవారు. జైలు వార్డర్లు యితనియందు అత్యంత ఆదరభావం చూపించేవారు. కొందరు చాలా అభిమానించేవారు. కొందరు అన్నా అని పిలిచేవాళ్ళు, కొంతమంది సన్యాసి అని పిలిచేవారు. క్రమేపీ జైలంతటిలో యితనికి 'సన్యాసి ఖైదీ' అనే సార్థకనామం వాడుకైపోయింది.

ఓ రోజున ఓ ముఠా కొత్తఖైదీలు మరొక జైలు నుంచి బదిలీ అయి యీ జైలుకి వేంచేశారు. రాత్రిళ్లు కొత్త పాత ఖైదీలమధ్య ఉబుసుపోక పురాణం ఎడతెగకుండా సాగిపోతోంది.—ఏ ఊరు, ఏం నేరం, శిక్ష ఎన్నాళ్ళు—యింకా ఎన్నెన్నో. ఓ ఖైదీ చెప్తున్నాడు గదా—'తనకి ఓ కిరాణా కొట్టుండేదిట. వాళ్ళవూళ్ళో ఓ ఆసామీ చెంబు తప్పేలా తన దగ్గర తాకట్టు పెట్టి డబ్బు అప్పుతీసికొని పోయాడట. కొన్నాళ్ళ తర్వాత పోలీసువాళ్ళువచ్చి తన దగ్గిర తాకట్టు వస్తువులు పట్టుకున్నారట. అవి దొంగ సామానులట. తాకట్టుపెట్టిన పెద్దమనిషి తనవికావు పొమ్మన్నాడట. సొమ్ము పోయింది. గిన్నెలా పోయాయి. పై పెచ్చు ఏపాపం ఎరగని తన్ను జైలుపాలు చేశారుట. మరో అపరన్యాయమూర్తి అంటాడు గదా—సరిగ్గా అలాగే జరుగుతూఉంటుంది. భాయి! యీ శాంతిడాంగా హోటల్లో ఒకతన్ని ఖూనీచేసి వెయ్యిరూపాయలు కాజేశారు. అసలు నిజంగా ఖూనీచేసిన ఆసామీ పత్తా దొరకలేదు. సరిగదా ఏ మాయా మర్మం ఎరగని ఓ శుద్ధ అమాయకపు కోమటిని పట్టుకొని పాపం పద్నాలుగేళ్ళ శిక్ష వేసేశారు. అతను మా ఊరువాడే. చూడండి ఎల్లా ఉందో."

మరొక బుద్ధిమంతుడు అంటాడు గదా—"అరే భాయి! యింత ఎందుకు? మంచివాళ్ళే పూర్వజన్మలో చేసుకున్న పాపంవల్ల యిప్పుడు జైలు శిక్షల్ని అనుభవిస్తున్నారు."

ప్రక్కగదిలో మౌనంగా కూర్చునిఉన్న కాశీనాథుడి చెవిలో యీ బాతాఖానీ ప్రతిధ్వనించింది. 'శాంతిడాంగా' మాట వినేటప్పటికి శరీరం అంతా సూదులతో గ్రుచ్చినట్లయింది. రెండు గదులమధ్య ద్వారబంధం, కర్రతలుపులు ఉన్నాయి. గొళ్ళెం వేసి పైన తాళంతో బిగించిఉంది. తలుపులు కొంచెం తోసి పట్టుకుంటే కొద్దిగా ఖాళీ ఏర్పడింది. ఆ సందులోంచి కాశీనాథుడు కొంచెం తొంగిచూశాడు. శాంతిడాంగా కథ చెపుతున్న ఆసామీ మరెవరూ కాదు. తను ఊళ్ళోఉన్న రజనీపాలే. మరేం సందేహంలేదు. బయటినుంచి పడ్డ ఎలక్ట్రిక్ దీపాల వెలుతురులో మరోమాటు చూసేడు, రజనీపాలే. ఈ ఖూనీకేసులో ముద్దాయి 'నిర్దోషి' అని యితనికెల్లా తెలిసింది? 'శుద్ధ అమాయకు' డని యితనికెల్లా తెలిసింది? 'సుమారు వెయ్యిరూపాయ' లని యితనికెవరు చెప్పారు? అయితే యీ రజనీ యిక్కడికెందుకు వచ్చినట్లు? కాశీనాథుడి గుండెల్లో ఊహాతరంగాలు ఊగిపోతున్నాయి. జరిగిపోయిన వెనకటి గాథ లెన్నో మళ్ళీ స్ఫురణకి వచ్చాయి. యిద్దరు ఒక్క బళ్ళో చదివారు. ఒకర్ని విడిచి ఒకరు ఉండేవారు కారు. యిద్దరిమధ్య ఎడతెగని మైత్రి ఉండేది. రజనీ పెళ్ళిలో తనెంత సంతోషంగా ఉండేవాడు? తన పెళ్ళికి రజనీ ఎంత సరదాగా ఉండేవాడు? అందర్నీ ఆడించి కడుపు చెక్కలయ్యేటట్లు నవ్వించేవాడు. అలాంటి వాడు చెడు అలవాట్లలో పడి అంతా పాడుచేసుకున్నాడు. యిల్లూ, వాకిలీ జప్తు అయిపోతుంటే కాశీనాథుడే సొమ్ము సర్ది ఉండడానికి కొంప నిలబెట్టాడు. రజనీ భార్యకి జబ్బుచేసి ప్రాణంమీదికి వచ్చింది. డాక్టర్ని పిలవడానికి రజనీచేతిలో కాణి డబ్బు లేదు. యీ సంగతి తెలియగానే కాశీనాథుడు పరుగెత్తిపోయి డబ్బు వెదజల్లి తగిన వైద్యసహాయం చేయించి స్నేహితుడి భార్యకి ప్రాణభిక్ష పెట్టాడు. కాశీనాథుడి పెద్ద పిల్లవాడి అన్నప్రాశనకి రజనీ పిల్లవాడికి ఒక వెండి చేతిగడియారపు గొలుసు చేయించి పెట్టాడు. మొన్న జైల్లో తన్ను చూడ్డానికి భార్యా, పిల్లలు వచ్చినప్పుడు తన పిల్లవాడి చేతిని ఆ గొలుసు యింకా ఉండడం కాశీనాథుడు చూశాడు. యితనేనా ఆ రజనీ—తన సుఖదుఃఖాల్లో భాగస్వామి, ఆ బాల్యస్నేహితుడు రజనీ?

మరునాడు కాశీనాథుడు రజనీని కలుసుకున్నాడు. మొదట్లో రజనీ గుర్తుపట్టలేకపోయాడు. తేరిపార అట్టే చూస్తూ నిలబడిపోయాడు. కాశీనాథుడు పలకరించాడు.

కాశీ: "మర్చిపోయావా, రజనీ? నేను, కాశీనాథుడిని శాంతిడాంగా ఖూనీకేసులో ముద్దాయిని."

రజనీ: "ఆఁ, కాశీనాథా?—ఆహా, ఎంత మారిపోయావు? నిజంగా ఆనవాలు పట్టలేకపోయినాను."

కాశీ: "సరే కానీ. నీకీ అవస్థ ఏమిటి?"

రజనీ: "ఏం చెప్పమన్నావు, భాయి. ఓ గుఱ్ఱం చోరీకేసులో సంవత్సరం శిక్షపడింది. నిజం చెప్పవలసివస్తే నేను దొంగతనం చెయ్యలేదు. యింటికి నడిచిపోతున్నాను. బీట్లో ఓ గుఱ్ఱం మేస్తోంది. మంచి వైశాఖమాసం రోజులు. పడమటిదిక్కున మేఘం కమ్ముకుంది. గబగబా యింటికిపోదామని గుఱ్ఱంమీద యెక్కాను. యిల్లుజేరగానే గుఱ్ఱాన్ని ఒదిలిపెట్టేశాను. గుఱ్ఱంకలవాళ్లెవరో గుఱ్ఱాన్నయితే హాయిగా కట్టేసుకునే కూర్చున్నారు. మేజిస్ట్రీటు నాపాద ఏమన్నావింటేనా? యీమాత్రానికి ఓ సంవత్సరం శిక్ష వేశారు"

కాశీ: "నువ్వు యిల్లువొదిలి ఎన్నాళ్ళయింది?"

రజనీ: "నాలుగుమాసాలయింది. మన రెండు యిళ్ళల్లోను అంతా క్షేమంగా ఉండగా చూసి మరీ వచ్చాను. నీభార్య బాగా నేఉంది. పిల్లలు స్కూలుకి వెళుతున్నారు కులాసాగానే వున్నారు."

కాశీనాథుడు ఓ పెద్దనిటూర్పు విడిచాడు. గుండెల్లో మంటమీద చల్లని వర్షపుచినుకులు పడి కొంచెం తాపోపశమనం అయినట్టుగా ఉంది. తన భార్య, తన పిల్లలిద్దరూను—అబ్బ! ఎన్నాళ్ళయింది వాళ్ళనిచూసి. ఏంపాపంచేసికొని వాళ్ళకి యిల్లా దూరమైపోయానోకద. తనకి భగవంతుడు అన్నీ యిచ్చాడు. అలాంటి భార్య — రూపంలో లక్ష్మి, గుణంలో సరస్వతి. అలాంటి కొడుకులు — చక్కటి రంగు, నవ్వితే కళకళలాడే మొఖాలు. వాళ్ళిప్పుడు స్కూల్లో చేరి చదువుకుంటున్నారు. యీపాటికి ఎంత పొడుగైనారో? వాళ్ళు వచ్చి వెళ్ళిపోయేటప్పుడు ఎంతసేపు వాళ్ళకేసి అల్లా చూస్తూ నిలబడిపోయాడో! పిల్లల్నిద్దర్నీ మళ్ళీ ఓమారు కౌగిలించుకొని తనివితీరా ముద్దు పెట్టుకుంటే ఎంత హాయి!!—యింకెక్కడి గూడ్డం? యింకెక్కడి తన బందిఖానా విడుదల మాట...?

కాశీనాథుడికిరోజులు యింకగడవడం దుర్భరం అయిపోయింది. ఇన్నాళ్ళు అతికష్టంమీద రోజులు ఎలాగో వెళ్ళబుచ్చాడు. కాని రజనీని చూసిన మరుక్షణంనుంచి మనస్సులో తుఫాను చెలరేగింది. తన సంసారం—తనభార్య, పిల్లలు, తన చెరువులు, వాటిల్లో చేపలు, ధాన్యపుకొట్లు, ఆవులు, దూడలు, పొలాలు ఒకటేమిటి, తన సమస్త వస్తుసంపదా దివారాత్రులూ, కళ్ళుతెరచినా, మూసినా తనముందు నాట్యం చేస్తున్నాయి. యీ కోలాహలానికి తన హృదయకుహరాలు ప్రతిధ్వనితో కంపించిపోతున్నాయి. ఒక్క ముహూర్తకాలంకూడ అతనికి విశ్రాంతి లభించడం లేదు. జైల్లో పనిచేస్తూచేస్తూ అలాగేచూస్తూ గంటలతరబడి ఉండిపోతాడు. వార్డర్లు చేత్తో తట్టిపిలిస్తే మెళకువ తెచ్చుకుంటాడు. భోజనానికి కంచంముందుకూర్చొని చేతిలోముద్ద చేతిలోనే ఉంచేసికొని అలాగే శూన్యాకాశంలోకి చూస్తూ ఉంటాడు. పక్కనున్న స్నేహితులు భుజంతట్టి 'సన్యాసిబాబా' భోంచెయ్యిఅంటే తింటూవుంటాడు. ఆరోజుకారోజు అతనిమతి స్థిరం తప్పిపోతున్నది. పగలల్లా యిదే ఆవేదన: రాత్రల్లా యిదే స్వప్న సంచారం.

ఒకనాటిరాత్రి ఏదో కలలోంచి హఠాత్తుగా మేలుకొని బిచానామీంచిలేచి కూర్చున్నాడు. వొళ్లంతా చెమటతో తడిసి ముద్దయింది. కణతలు టిక్ టిక్ మని కొట్టుకుంటున్నాయి. తల రెండుచేతులతోటి అదిమిపట్టుకొని కిటికీదగ్గిరకివచ్చి నిలబడ్డాడు. ఆరాత్రివేళ, చల్లటి మందపవనాలకి శరీరం, మనస్సుకూడా సౌఖ్యం అనుభవిస్తున్నాయి. గంభీరమైన రాత్రి, విశ్వవ్యాప్తమైన అంధకారం, పైన అఖండ శాశ్వతమైన నక్షత్రరాసుల క్షీణప్రభాకాంతులు—జగత్తు అపురూపసౌందర్యంతో తొణికిసలాడుతోంది. స్వచ్ఛంగా, స్నిగ్ధంగా, హృదయోల్లాసకరంగావున్న ఆ ప్రకృతిశోభనిచూసి ఆనందిస్తూ అలాగే వుండిపోయాడు. చూస్తూచూస్తూ కాశీనాథుడిమనస్సు మళ్ళీ శాంతి డాంగా దుర్ఘటనమీద లగ్నమయింది. ఆనాడు తాను శాంతి డాంగాహోటలులో బిచానామీద పడుకొని కిటికీలోంచి చూసింది యీ దృశ్యమే. ఆరాత్రికూడా యింత శోభాయమానంగానే ఉంది. ఆ తారకాఖచితమైన ఆకాశం, ఆ నక్షత్రకాంతులు సరిగా యివేళ ఉన్నట్టుగానే ఉన్నాయి. అప్పుడుకూడ సరీగా యిలాగే హాయిగా ప్రాణం లేచివచ్చేటట్టు చల్లగాలి వీచింది. తనతోపాటు నిశ్చింతగా పాపం అసాహుకారుకూడా నిద్రపోయాడు. 'పాపం! ఏపాపం ఎరగని నిరపరాధి. మంచినిద్రలో ఉండగా దుర్మరణం. పైగా వెయ్యిరూపాయలు పోవడం. ముష్టి వెయ్యిరూపాయలవల్ల ఏంపని అవుతుంది, రజనీ? ఆ వెయ్యిరూపాయలు నిన్ను జైల్లోంచి విడుదల చేయించగలవా? పాపం అదురదృష్టవంతుడి భార్యాబిడ్డలు శవంచూడ్డానికి పోయిఉంటారు. వాళ్ళు

హృదయవిదారకంగా ఏడ్చి ఉంటారు. ఆఖరికి పశు పక్ష్యాది సమస్త జీవకోటికూడా వాళ్లతో గొంతుకలిపి విలపించిఉంటాయి' పక్కనున్న రజనీగదిలోంచి ఏదో చప్పుడు వినవస్తోంది. గోడమీద సుత్తిపెట్టుగా చప్పుడు. ఆ అదురుకి సున్నమున్న ద్వారబంధం, తలుపులు అదిరి శబ్దంచేస్తున్నాయి. కాశీనాథుడు తలుపు సందుల్లోంచి పరకాయించి చూశాడు. ఒకమనిషి గునపంపట్టుకొని గోడని పొడిచి కన్నంచేస్తున్నాడు. ద్వారబంధం కదలినప్పుడికి ఆ మనిషి తవ్వడం మాని వేసి గునపంకిందపడేసి గోడపక్కన కాశీనాథుడి దగ్గరగావచ్చి నిలబడ్డాడు.

కాశీ: "రజనీ! నువ్వా!!"

రజనీ: "అవును. నేనే"

కాశీనాథుడు నోటినుంచి మాటరాలేదు.

రజనీ: "జైల్లో యింక ఉండలేను, కాశీనాథా! అందుకని పారిపోవడానికి ప్రయత్నంచేశాను"

కాశీ: "పారిపోవడమే! జైల్లోంచే!—పట్టుపడి పోలేదో!!"

రజనీ: "నాకాభయం లేదులే. మన పారా వాళ్లలో ఒకణ్ణి వశంచేసుకున్నాను. నేను జైల్లోకి వచ్చేటప్పుడే కొంత సొమ్ము దొంగతనంగా తెచ్చుకున్నాను. ఆ డబ్బు వాడిమొఖానకొట్టి లోబరచుకొన్నాను. మందిట్లో నాగది తాళాలుతీసి నన్ను విడిచి పెట్టడానికి ఒప్పుకున్నాడు. కాని తాళంచెవులు జమాదారు దగ్గిర వుండిపోతాయి. వాటిని సంగ్రహించడం సాధ్యంకాలేదు. గోడకి కన్నంపెట్టడం తప్పితే మరి వుపాయంలేదు"

కాశీనాథుడు నిశ్చేష్టుడై రజనీకేసిచూస్తూ నిలబడిపోయాడు.

రజనీ: "నాకు గోడబద్దలుకొట్టడానికి ఓచిన్న గునపం యిచ్చాడు. దాంతోపాటు ఓ మందు సీసా కూడా యిచ్చాడు. ఆ మత్తుమందు వుపయోగించి నాగదిలో వున్నవాళ్లందర్నీ నిద్రమత్తులో వుంచాను. తెల్లవారేదాకా వాళ్ళు లేవరు. గోడకి కన్నం పెట్టగలిగివుంటే వాడువచ్చి నన్ను ఒకరహస్యద్వారంలోంచి బయటికితీసికొని పోయేవాడే. ఏంవుంటే ఏంలాభం? పని జరిగిందికాదు. దిక్కుమాలిన యిటికెల గోడ యినుంతో కట్టినట్టుగా వుంది. రెండుగంటలు చచ్చిచెడి మహా అయితే మూడు యిటికెలు పెరికానేమో. దానికితగ్గట్టు మహా వుడికిపోతోంది. ఒళ్లంతా చెమటతోటి తడిసిపోయింది. చెయ్యి సాగడంలేదు. ఇంతట్లోకే నువ్వు లేవడం, పనికాస్తా చూడ్డంకూడా అయిపోయింది. పోనీలే. నువ్వు చూసినా నాకు నష్టం లేదులే. కాని గోడ పగలగొట్టడంమాత్రం యింక సాధ్యంకాదని తోస్తోంది. అప్పుడే ఓమూలనుంచి తెల్లవారిపోతున్నట్టుగా కనిపిస్తోంది."

కాశీ: "నాకూ అల్లాగే తోస్తోంది. అయి... తే ... తెల్లవారితే అంతా చూసేస్తారేమో?"

రజనీ: "చూడనీయ్. నాకేంభయం? నాగదిలో అయిదుగురు ఖైదీలున్నారు. ఎవడుచేశాడో ఎవడికి తెలుసు? ఒకడుతరవాత ఒకడు నలుగురుపారావాళ్ళు. ఎవడిసమయంలో యీపనిజరిగిందో? అయితే చూసిన వాళ్ళల్లోను నొక్కడివి వున్నావు. నీవల్ల నాకు అపకారం జరగదు."

కాశీ: "మరి, వాళ్ళు వచ్చి నన్ను అడిగితేనో?"

రజనీ: నాకేమీ తెలియదని చెప్పు. నువ్వు మరో గదిలోవున్నావాయె. నీకేమిటి?"

కాశీ: "ఏ! అల్లా చెపితే అబద్ధం అవదూ?"

రజనీకి కాశీనాథుడిమనస్తత్వం బాగా తెలుసు. కొంచెంసేపు కాశీనాథునిముఖంకేసి చూసి ఏడవడం ప్రారంభించాడు. "కాశీనాథా! మనిద్దరికీ మధ్య యీగోడ వుండిపోయింది. లేకపోతే నీకాళ్ళు పట్టుకొందును. నా జీవితంలో నువ్వు నాకు ఎన్నో వుపకారాలు చేశావు. ఎన్నో అపదలనుంచి తప్పించావు. యిప్పుడుకూడా నన్ను కాపాడు. నువ్వుగనక సాక్ష్యమిస్తే నన్ను బతకనివ్వరు. కొరడాతో చర్మం ఒలిచేస్తారు. పారిపోవడానికి ప్రయత్నించిన నేరానికి ఏంశిక్ష వేస్తారో అది ఓ జైల్లో నేను చూశాను. నేనాబాధ సహించలేను. నా కింక దారి తప్పదు. పిల్లలు, భార్య—యింక వాళ్ళనిచూస్తానని ఆశలేదు. భాయీ! నీకాళ్ళు పట్టుకుంటాను. నన్ను బ్రతికించి పెట్టు నా పిల్లలకోసమేనా నన్ను దక్కించిపెట్టవూ? వాళ్ళమీద భ్రమచేత మనస్సు తహతహలాడిపోయి పారిపోవడానికి ప్రయత్నం చేశాను. గుండెల్లో కలవరం పుట్టిపోయింది. పిల్లలేంచేస్తున్నారో? వాళ్లేంఅవస్థలు పడుతున్నారో? ఏమీ పాలుపోవడం లేదు. వాళ్ళచేతిలో ఒక్క దమ్మిడీకూడా పెట్టి రాలేదు, తిండానికి యింట్లో ఏమీ ఆస్తే పెట్టి రాలేదు."

ఆకే మరొకళ్ళయితే రజనీకి సమాధానం చెప్పిఉందురు. అసలు తన గోడవా, తన పెళ్ళాం

బిడ్డల అవస్థ చెప్పుకోవచ్చు. కాని కాళీనాథునికి మనోగోచరమైంది తనకుటుంబం కాదు. రజనీకుటుంబమే తలపుకువచ్చి కళ్ళవెంట అశ్రువులు బొట బొటా రాలి క్రిందపడ్డాయి.

## 3

ఉదయంనుంచే విచారణ ప్రారంభమైంది. ఖైదీలవల్లగాని, పారావాళ్ళవల్లగాని ఆచోకీ తీయడం సాధ్యం కాలేదు. రజనీఉన్న గదిలోంచి ఓ గునపం, ఒక క్లోరోఫారమ్ సీసా దొరికాయి. ఆ సీసానుబట్టి ఆ గదిలోఉన్న అయిదుగురుఖైదీలు కలిసి కుట్రపన్నారనడానికి ఆస్కారం లేకపోయింది. కాగా, అందులో ఎవరుమత్తులోఉన్నారో, ఎవరు తెలివిలో ఉండివున్నారో తెలియడంలేదు. ఎవరిమట్టుకు వాళ్లే బుద్ధిమంతుల్లా నటిస్తున్నారు. అఖరుకి కాళీనాథుడి వంతు వచ్చింది. "నీపక్కగదిలో రాత్రి గోడతొలిచి పారిపోవడానికి ప్రయత్నం జరిగింది. యీ విషయంలో నీకు తెలిసినభోగట్టా చెప్పు" అని అడిగారు జైలు అధికార్లు.

కాళీ: "హుజూర్! అంతా నాకు తెలుసు. తలుపుసందులోంచి అంతా చూశాను. ఒక్క మనిషి మాత్రం గోడ తవ్వుతూఉండగా చూశాను. మిగతా వాళ్లు నిర్దోషులు. వాళ్ళు నిద్రపోతున్నారు"

రజనీ వెలవెలపోతున్నాడు.

అధికారి: "ఒకడేనా? సరే. వాని పేరు?"

కాళీ: "హుజూర్! క్షమించండి. పేరుమాత్రం చెప్పలేను"

అధి: "పేరు తెలియదూ? ఛేష్. ఫరవాలేదు. మనిషి ఎలా వుంటాడు?"

కాళీ: "అదికాదు. హుజూర్! పేరు తెలుసు. కాని చెప్పను"

అధి: "ఏమి...టీ? చెప్పవ్!!"

కాళీనాథుడు మాట్లాడలేదు.

అధి: "ఏయ్, సన్యాసీ! నువ్వు చాలాకాలమై యీజైల్లోవున్నావే. ఎన్నడూ నీప్రవర్తనలో లోటు రాలేదు. నీమంచినడవడికి సంవత్సరంన్నరశిక్ష తగ్గించి వేశాము. ఇప్పుడు బుద్ధిపూర్వకంగా అపరాధం చేసిన వాడిని వెనక వేసుకువస్తే నీ పధ్నాలుగు సంవత్సరాల శిక్షలో ఒక్కరోజుకూడా తగ్గించం. సరిగదా నీకు తగ్గశాస్తిచేసితీర్తాం. బాగా ఆలోచించుకో"

కాళీ: "తమదయ"

అధికారికి పట్టలేనంతకోపం వచ్చింది. కనుబొమలు బిగించి, పళ్ళు కొరుకుతూ అన్నాడు. "యీమాటు నువ్వే తప్పకుండా ఖూనీ చేశావు. వురిశిక్ష వెయ్యవలసింది బాగుండిపోను. ఇన్నాళ్ళుగా నీ కపటవేషం చూసి నువ్వు ఖూనీ చెయ్యలేదేమోనని అనుకునేవాణ్ణి. జడ్జి పొరబడ్డాడనుకున్నాను. ఇప్పుడు తెలిసింది. పొరపాటు నాదే. నువ్వు నిజంగా హంతకుడవే. ఇన్నాళ్ళూ నేను చూసిందల్లా నీపైవేషమే. ఇప్పుడు నీ అసలుసరుకు బైట పడిపోయింది. అచ్ఛా! కాళీనాథ్! ఆఖరుమాట చెప్పివేస్తున్నాను—అయిదు నిమిషాలు టైమిచ్చాను. ఇప్పుడు చెప్పినా మించిపోయిందిలేదు. నీకు దొరికిన సంవత్సరన్నర 'రిబేటు' లోను ఒక్కరోజుకూడా నష్టపోవు. యిందాకటినుంచి చెప్పనందుకు నీకేమీ శిక్షలేదు" అంటూనే దొరచేతిగడియారం చూడ్డం మొదలుపెట్టాడు. అయిదు నిమిషాలు లెక్కపెట్టి "బస్ టైమైపోయింది. గత రాత్రి జరిగినవిషయం జైల్లో మహా అపరాధం. నువ్వు చెప్పివుంటే నేరస్థుడికి తగినశిక్ష చేసివుందుము. పేరు తెలియక శిక్షపడలేదు. అది అలావుండగా ముద్దాయికి నువ్వు సహాయం చేశావు. యీ నేరానికి నీకు పది కొరడా దెబ్బలు హుకుంజారీ చెయ్యడమైనది"

కొరడా పేము బెత్తంమీద తోలుతో అల్లింది. జడలాగా అయిదు పాయలు అల్లి తయారుచేసివున్నది. ఒక్కదెబ్బ పడితే అయిదు దెబ్బలు తగిలినట్టుగా వుంటుంది. ఖైదీలందరిసమక్షాన కాళీనాథుడిని దిగంబరిగా నిలబెట్టి కొరడా విసిరాడు. దెబ్బ పడీపడ్డంతో కాళీనాథుడు చైతన్యంలేకుండా భూమిమీద పడిపోయాడు.

కాళీనాథుడు జైలు ఆస్పత్రిలో పడివున్నాడు. మరునాడు సాయంకాలం రజనీ చప్పుడు చెయ్యకుండావచ్చి కాళీనాథుడి మంచందగ్గిర నిలబడ్డాడు.

కాళీ: "ఏం రజనీ, యిలా వచ్చావ్?"

రజనీ నెమ్మదిగా రోగి ప్రక్కలో కూర్చున్నాడు. మెల్లగా అన్నాడు. "శాంతి డాంగాలో ఖూనీచేసిం దెవరో తెలుసా?"

కాళీ: "తెలుసు నువ్వు"

రజనీ: (ఆశ్చర్యపడి) "నేనా! యీసంగతి ఎవరికి తెలియదే. నీకెవరుచెప్పారు?"

కాళీ: "నువ్వే ఓనాడురాత్రి మీరంతా కబుర్లు చెప్పుకుంటూవుండగా యీసంగతికూడా వచ్చింది.

నేను వాగటిలోంచి అంతా విన్నాను. నీదగ్గిర విన్న తరవాత తెలిసింది—నువ్వే ఖూనీనేరం సొమ్ము లేపక్క రించావని"

రజనీ: "ఇంతవరకూ నీకు తెలుసా! యింతా తెలిసీకూడా నన్నుగురించి నువ్వు దెబ్బలు తిన్నావా, కాళీనాథూ!"

కాళీ: "అయితేం? భాయీ!"

రజనీ: (ఒక్క నిమిషం ఊరుకొని) — ఆరాత్రి ఎవడో ముక్కు మొహం ఎరగనివాడిని ఖూనీచేశాను. నిన్ను చంపలేదు. బంధుభావంవల్ల విడిచిపెట్టేనని మాత్రం భావించకు"

కాళీనాథుడు మాట్లాడలేదు.

రజనీ: "మనిషిమనిషినే వరికి పారేశేటప్పుడు తనవాడేమిటి? పైవాడేమిటి? ముందు ఆ మనిషిని కడనుట్టించి తరవాత నీపని పడదామనే కత్తిఎత్తాను. అంతట్లో ఎవళ్ళదో కాళ్ళ చప్పుడు వినిపించింది. నువ్వుకూడా నిద్రలో ఓమాటుకదిలావు. నా ప్రాణాలు నిలువునా ఎగిరిపోయాయ్. ఇంక నిన్ను పొడవడానికి వ్యవధి చిక్కలేదు. కత్తి నీతరగడా క్రిందపెట్టి పారి పోయాను. అలా ఎందుకు చేశానో తెలుసా? కేసు నీమీద తోసుకుపోతుందని. నీ బిచానామీద రక్తపు మరకలు వుంటాయి. తరగడాకింద కత్తి వుంటుంది. నువ్వే ఖూనీచేశావని టాంటాంఅయిపోతుంది. మరో మనిషిమీద అనుమానంకూడా వుండదు. నేను నిశ్చింతగా వుండవచ్చును. ఎలాంటి స్నేహితుడివో విన్నావా; కాళీనాథూ? ఎలాంటి స్నేహితుడికోసం నువ్వీవేళ ఆస్పత్రిలో చావడానికి సిద్ధంగావున్నావో తెలిసికొన్నావా!" రజనీముఖం రెండుచేతులతో టి మూసుకొని ఏడ్చాడు.

కాళీనాథుడు మెల్లగా రజనీ ఒళ్ళు నిమురుతూ అన్నాడు.

"అగోడవ యింకెందుకు? పోనిద్దు, రజనీ!"

రజనీ: "ఎందుకా? చెప్తున్నాను. విను. నేను నిశ్చయం చేసుకున్నాను. నిన్న వాళ్లు కొట్టినప్పుడు దెబ్బ వేటుకి తాళలేక చర్మం చిరిగి మాంసం బైట పడ్డప్పుడు, గాయంలోంచి రక్తం కారుతో వున్నప్పుడు—అటువంటిసమయంలో నీమొహం చూశాను. నీమొహంలో ఏలాంటి వికృతభావం నేనుచూడలేదు. నీ పెదిమెలమీద కనీకపించని సుందర మందహాసం నేను చూశాను. నే నెప్పుడూ యిటువంటిది చూచి వుండలేదు. ఎంతశాంతం! ఎంతగంభీరం!! ఎంత నిశ్చలత్వం!! అటువంటి ముఖవర్చస్సు నేనెన్నడూ చూచి వుండలేదు. ఆ క్షణంనుంచి నాలో ఒక అగ్ని పర్వతం బద్దలైవట్లుంది. ఇహ నిప్పుడు ఏంచెయ్యాలో నేను నిశ్చయంచేసుకొనే వున్నాను. దచ్చినపెట్టే అయితే ఎల్లాగూ దన్నేపోయాడు. ఇల్లెక్కడో, వాకిలెక్కడో, ఎవరేనా వున్నారో, లేరో—ఏసంగతీ తెలియదు. కాని నువ్వు యింకా వున్నావుకదా. ఇంద్రసుఖం అనుభవిస్తున్న నీ జీవితాన్ని నాశనం చేసింది నేను. నువ్వు నిర్దోషివి. నువ్వు నిజంగా దైవాంశసంభూతుడివికాని మనుష్యమాత్రుడివి కావు. అయినా యింకా జైల్లో మగ్గిపోతున్నావు. నేను ఖూనీనేరం ఒప్పేసుకుంటాను. అప్పుడు వాళ్ళు నిన్ను ఒదిలిపెట్తారు"

అంటూ కాళీనాథుడి పాదాలు కళ్ళకద్దుకొని రజనీ పోబోతాడు. కాళీనాథుడు హీనస్వరంతో 'రజనీ' అని పిలుస్తాడు.

రజనీ (తిరిగివచ్చి) — "ఇంక తిరుగు లేదు. నా జీవితకథ అంతమైంది. క్షమకి నాకు అర్హత లేదు. అందుకే నిన్ను క్షమించమని అడగలేదు. శిక్ష నేనే అనభవించాలి. అంచేత నేనే తీసికొంటాను. నువ్వు యీ నరకంలోంచి విముక్తిపొంది హాయిగా సుఖించు"

రజనీ వెనక్కి చూడకుండా దరదరా నడిచి వెళ్ళిపోయాడు.

రజనీ తన సమస్త అపరాధమూ ఒప్పేసుకున్నాడు. తరవాత కొద్దిరోజుల్లోనే కాళీనాథుడిని విడుదలచేస్తూ వుత్తరువు వచ్చింది. కాని కాళీనాథుడు యీ వుత్తరువు రావడానికిముందే యీ యిహలోక బంధంలోంచి ముక్తుడై పరలోకసౌఖ్యాన్ని చూరగొంటున్నాడు.



# మాటల దాంపత్యం

★

శ్రీమతి నాయని కృష్ణకుమారి

శబ్దమూ, అర్థమూ, పరస్పరమూ చేతులు కలుపుకుని జంటగా ముందుకుసాగితే అదే భాష అవుతుంది. అయితే భాషలో రూపొందిన ప్రతిమాటకూ నిశ్చితమైన అర్థం అన్నివేళలా వ్యక్తం కావాలని లేదు. ఒక్కొక్కసారి వక్త ఉపయోగించేమాటకూ, ఉద్దేశించిన అర్థానికీ పొత్తు కుదరకపోవచ్చు. అంతమాత్రాన శబ్దార్థాల స్నేహం విడిపోదు. భేదాభిప్రాయాలు కలిగిన ఆలుమగలకుమల్లే యివి ఇంటిగుట్టును రట్టు చేసుకోకుండానే చూచుకుంటవి. అందుకే శబ్దానికి తగిన అర్థం కుదరలేదనో, అర్థానికి అవసరమైన శబ్దం ప్రయోజ్యం కాలేదనో శ్రోత గమనించలేడు. వక్త పట్టించుకోడు. ఇది యిట్లా సర్దుకుపోవడానికి కారణం శబ్దార్థాలకు మించిన సంజ్ఞాసహాయం భాషకు సుకరంగా ఉంటుంది గనుక.

మాటలే భాషను కూర్చేవి. వాటికున్న అర్థం భాషకు జీవంపోసి కలకలలాడిస్తుంది — మనిషి విచారంగా ఉన్నప్పుడు ఆ భావం వ్యక్తంచేసే మాటలు కరుణార్ద్రాలుగా నేఉంటవి. దిగులుగా దీనంగా సాగే వాక్కు మనిషి మనస్సు మనముందు విప్పి పెడుతుంది. వాక్కు లేని వ్యక్తికీ జంతువుకూ భేదం లేదు. సంతోషాన్ని, శోకాన్ని, రౌద్రాన్ని, విచారాన్ని, శృంగారాన్ని, ఒకటేమిటి, మనుష్యుడి జీవిత నాటకంలో అంగాంగి రసాలుగా అమరిన సర్వరస సముదాయాన్నీ వ్యక్తంచేసే మాటలు మానవజాతికి దివ్యవరాలు! ఆనందోద్రిక్తతలో ఎగిరి గంతులు వేస్తూ, గొట్టి కోలాహలంచేసే పలుకులు, కోపంలో, రౌద్రంలో కల్లోలజలధి పరీత తరంగాలలా ఎగిరెగిరి పడే నిశితశరాలు, శృంగారతన్మయతలో స్రుక్కి కరింతలాడే చికిలిమాటలు, ఇవన్నీ మానవజగత్తు తనంతట తాను నిర్మించుకుంటే ఏర్పడ్డవా? ఆ మాటల సంపద ఒకరు అమర్చుతున్నారనే విషయం మనుష్యులకే తెలియకముందు అమరినవి. మానవాంతర శక్తి బాహ్యప్రేరణకు తెలిసేలోపలనే చేసిన యీయేర్పాటువల్ల భాష భగవన్నిర్మిత మనుకోవలసి వచ్చింది.

అయితే మాటకూ అర్థానికీ ఈశక్తి ఎప్పుడూ ఉన్నదా అనేది ఒక ప్రశ్న. మాట, మాటగా, ఒంటరిగా ఉన్నంతవరకూ దానిలో సొగసుదనం రాదు. దానిలోని అర్థం తన శక్తి సామర్థ్యాలు చూపించే సమయం రాలేదని ముడుచుకుపడుతుంది. మాటకున్న సొగసూ, అర్థంలోని సుకుమారతా బయటికి రావాలంటే, దానికి ఎన్నో హంగులు అమరాలి. ఆ రెంటి మధ్యా కంటికి కనిపించని మార్పేదో జరిగి మన మనసున్న ఫలితం బయటకు రాగలగాలి—అంటే మాటలు వాక్యరూపంలో కూడితే వివిధార్థదాలయిన పదాలు ఏకముఖాలయి రమణీయత్వ ప్రతిపాదకాలు కాగలవు.

కాబట్టే భాషలోని సొగసంతా వాక్యరచనలో ఉన్నది. వాక్యము నేది రసాత్మకమైన కావ్యమన్నారు ఆలంకారికులు—అప్పుడు భాష భాషంతా ఒక కావ్యం కాదా? అనేది ప్రశ్న. సరే—ఇది తెగని ప్రశ్న!

ఇంతకూ మాటల పొందికలోనే ఉంది భాషలోని తీయదనమంతా అని చెప్పడానికే ఈ ఉపోద్ఘాతం.

తెలుగుభాష తీయని భాష! ఆమాటకు వస్తే ఏభాషలోనైనా తీయదనం ఉన్నది. కాని ఆ తీయదనము నేది ప్రతిభాషలోనూ చూడగానే కనిపించేది కాదు. భాషలో, వివిధమార్గాలలో ప్రసరించే మెలుగులను తెచ్చి జిజ్ఞాసువులకళ్ళలో ఆ కాంతి కిరణాలు జొనిపేవరకూ ఏభాష గొప్పతనమూ ప్రకాశితం కాదు. అయితే అనంతమై, ప్రవాహి అయిన భాషను అవలోడనం చెయ్యాలనడం అసంభవం. ఇదేకాదు; ఏవిషయాన్నీ పూర్తిగా తెలుపడానికి మానవజీవితమే చాలదు. అన్నికోణాలనుండీ సమగ్రంగా ఒక విషయ పరిశీలనము నేది ఒక్కరివల్ల కానిపని. అట్లాగే తెలుగు

భాషకు తీయదనం ఎందుకువచ్చిందో అని ప్రశ్నించు కుంటూ, ఇందుకూ అని పూర్తిగా చెప్పగల మను కోవడం, నవ్వుపాటు. కాకపోతే బహువిధాల పయ నించి చేరిన ఆ తీయదనాన్ని ఆస్వాదిస్తూ "బహుశ ఈవిధంగా రాలేదూ ఈతీపి?" అని కొన్ని మార్గాలను, మనుష్యులకు తట్టినవాటిని చర్చించుకోవచ్చు. ఈ చర్చలు పూర్తిగా దోషా లెప్పుడూ కావు. కాక పోతే స్ఖాలిత్యాలు ఉండవచ్చును.

నేనొక దోవ చెప్పాలని కుతూహలపడు తున్నాను. ఇది దోవ అవునా కాదా; నిజంగా తెలుగులోని తీయదనంలో ఇన్నోకంతు ఈమార్గం గుండా వచ్చిందా లేదా అనే చర్చలు విజ్ఞులకు!

తెలుఁగుభాషలో ఒక విచిత్రపుధోరణిఉన్నది. నాకు తెలిసిన ఇంగ్లీషులో ఇది కన్పించదు. కొద్దిగా తెలిసిన హిందీలో అక్కడక్కడా ఉన్నది. మరి యితరభాషలలో ఉన్నదో లేదో!

ఇది జంటపదాల ఏర్పాటు. తెలుఁగునోట తలుచూ ఈ పదాలు వినవస్తూనే ఉంటవి. ఈ జంట లను చూస్తూఉంటే, వేదోక్తంగా వివాహితులయిన దంపతులా అనిపిస్తుంది. వాటి బాంధవ్య మంత స్థిరం. అసలీపదాల జన్మ ఏమిటి? ఏయే పరిస్థితులలో ఈ జమిలిమాటలు ఏర్పడవలసి వచ్చింది అనేది ప్రశ్న—

మాట్లాడేటప్పుడు మాతృభాషలో పొందికా, ఒదుగూ, ప్రతివాడికీ జన్మతః రానే వస్తవి. కాని ఒకమాట ఒకసందర్భంలో వాడినప్పుడు చెప్పదలచు కొన్న అర్థం ఆ మాటవల్ల స్పష్టం కాకపోవచ్చు. కనీసం కాలేదేమోనన్న అసంతృప్తి వక్తమస్తి ష్కంలో సెలవేయవచ్చు. అప్పుడు, ఆమాట అట్లా రికామీగా నిలువదు. ఒక తోడు తెచ్చుకుంటుంది. ఆతోడు ఎటువంటిదో, రెంటికీ ఏర్పడిన సంబంధ బాంధవ్యా లెటువంటివో ఆ రెండింటి సాన్నిహిత్యం వల్లా వక్త ఆశించిన మెఱుగు లెంతవరకు ప్రకాశితా లయినవో — ఇవన్నీ మనం పరిశీలించవచ్చును. మన కీనాటి చర్చకూడా అదే!

ఈ సంబంధం చిత్రవిచిత్రంగా కనిపిస్తుంది. ఒక్కొక్క పదం మరొకపదంపక్కన ఉంటే ముచ్చ టగా భర్త మనస్సు తెలిసి మెలిగే భార్యలా అని పిస్తుంది. మరొకటి పసిపాపలా, అమాయికంగా లోక వ్యవహారమే తెలియనట్లు స్తబ్ధుగా ఉండి అంతులేని అందాన్ని కూరుస్తుంది. ఇంకొకటి ఉత్త వసపోసిన వాగుడుపిట్టలా అర్థంలేనిమాటలాడుతున్న ట్లుంటుంది. మరొకటి అర్థమూ, పర్థమూ లేకపోయినా అది అక్కడ ఉంటేనే నిండూ, అందమూ.

కాబట్టి ఈ జంటమాటలలో ప్రయోజకత్వ మంతా రెండవమాటది. ఆ మాటా, దానితీరూ, అది యిచ్చే అర్థమూ వీటిమీదే ఆ జంటయొక్క రామ ణీయకం ఆధారపడిఉంటుంది —. ఈ రెండవ పదాన్ని మనస్సులో పెట్టుకుని చూస్తే జంటమాటల నన్నీ చేర్చి అయిదు రకాలుగా విభజించుకోవచ్చు. అవి;

1. మొదటి మాటకు కించిద్వ్యత్యాసం కలిగి అర్థం లేకపోయినా వచ్చిచేరే మాటలు.

2. మొదటి మాటతో అర్థసారూప్యం కలిగో, లేక అదే అర్థాన్ని వెలువరించో, అందాన్నిచ్చే మాటలు.

3. మొదటిమాటకు పూర్తిగా వ్యతిరిక్తమైన అర్థాన్ని సూచిస్తూ సన్నివేశాన్ని విశదంగా చిత్రించే మాటలు.

4. మొదటిపదం సూచించే వాతావరణానికీ, పరిస్థితికీ సరిపడి, వాటిని స్పష్టంగా సూచించే సమర్థ మైన మాటలు.

5. కేవలం మొదటిపదానికి ఉదాహరణ పూర్వ కంగా నిలిచే మాటలు—. ఇవి!

మొదటి తరగతికి చెందిన కొన్నిటిని పరిశీ లిద్దాం.

1. అప్పూ సప్పూ
2. అతుకూ సతుకూ
3. భూమీ పుట్రా
4. నగా నట్రా
5. పురుగూ పుట్రా
6. ఇరుకూ సరుకూ
7. చెడా మడా
8. చింకీ బొంకీ
9. అడుగూ బొడుగూ
10. ఆదరా బాదరా

ఈ పట్టికలో చాలావరకు చివరిమాటలు నిరర్థ కాలనే చెప్పాలి. అయితే అంతమాత్రాన వీటికి స్థానంలో ప్రాముఖ్యం లేదనడానికి వీలులేదు. చూడండి;

"అప్పుచేసి పిల్లపెళ్ళి చేస్తాను!" అన్న మాటలూ "అప్పో సప్పో చేసి పిల్లపెళ్ళి చేస్తా"నన్న మాటలకూ ఎంతో భేదమున్నది. అట్లానే మిగిలిన జంట మాటలన్నీ ఉపయుక్తాలయి అర్థవైశద్యాన్ని స్ఫురింపజేస్తున్నయ్. చివరివి దాదాపు అర్థం లేనివనే చెప్పాలి. అయినా మొదటిపదంతో సంపర్కంవలన, ఆమాటలో లేని అర్థం వినూత్నంగా పుట్టి చక్కని విశిష్టతను సంపాదించుకుంటున్నది.

నిఘంటువులు వెదికినా దొరకని యీ పదాలు వాడుకలోకి ఎట్లా వచ్చినవి? "అప్పూ సప్పూ" అన్న జంటపదంలో 'సప్పు' కొక విశిష్టత వచ్చిందే, అటువంటిది 'సప్పు' అనేది విడిగా వాడితే ఎవరికీ ఎందుకు అర్థం కాదు? — అంటే దీనికి జవాబు మృగ్యం.

అర్థంలేనిమాటలు కాబట్టి ఇవి తాత్కాలికంగా వక్త ఉద్రేకంవలన ఏర్పడిన మాటలు. ఈ యేర్పాటులో ఒకరీతి యేమన్నా ఉన్నదేమోనని చూస్తే అదీ కనిపించదు. అటువంటిదే ఉంటే "అప్పు సప్పూ" లోని 'స' వలెనె. "అడుగూ బొడుగు"లో 'బొ' కు బదులు 'స' యే వచ్చిఉండవలసింది. ఈ పదం ఒకొక్కచోట పరుషాదీ మరొకచోట సరళాదీ కూడా అవుతూ ఉంటుంది—ఇంకొకటి 'అతుకూ సతుకూ' అన్నదానికి "అతుకూ బొతుకూ" అనే రూపాంతరంకూడాఉంది. ఈ అనియమితరూపాలూ, వీటి యేర్పాటులూ చూస్తే అతివిచిత్రంగా ఉంటయ్.

ఈ జంటలో రెండూ తెలుగుపదాలుండాలని లేదు. ఒకటి అన్యజాతీయం కావచ్చు. లేదా రెండూ కావచ్చును — ఈ సందర్భంలో వచ్చే పదాలన్నీ సాధారణంగా హిందీపదాలుగానే కనిపిస్తున్నయ్. సంస్కృతపదాలు బహుకొద్ది—ఇట్లా వచ్చినపదాలు పరభాషాపదాలుగా అనిపించనేలేదు. అవి తెలుగులో కలిసి లీనమైపోయినవి. అటువంటివి.

1. అజా పజా
2. ధక్కా ముక్కీ
3. గల్లాముల్లీ
4. కచ్చా పచ్చా!—వంటివి.

మొదటిపట్టికలో ఒకరకపు మాటలు కొన్ని కనిపిస్తున్నయ్. అవి,

భూమీ ఫ్రుట్రా

నగా నట్రా

పురుగూ పుట్రా వంటివి.

ఇక్కడకూడా ఈ 'ట్రా' తో అంతమయ్యే పదానికి అర్థంలేదు. కాని యీ పదాలన్నీ ఒక సూత్రానికి కట్టుబడినట్లు తోస్తుంది. మొదటిపదంలోని మొదటిఅక్షరమే రెండవపదం మొదట ఆవృతమవుతుంది. తరువాతి అక్షరమే ఈ 'ట్రా'. ఈ 'ట్రా' అనేది ఎట్లా ఏర్పడిందో వాడుకలో కింతగా ఎందుకు వచ్చిందో ఆలోచించదగ్గవిషయం. విశాఖ మాండలిక భాష పరిశీలిస్తే 'గట్రా' అనే పదం ఎక్కువగా ఒక ఊతపదంలా వినిపిస్తున్నది.

ఉదా:—"మీ ఆరోగ్యం గట్రా బాగున్నదా అండీ!"

"ఇల్లా గట్రా సదురుకోలేతే యీ పొద్దయిపోవాది!" — ఇవే వాడుకలు. వీటినిబట్టి చూస్తే చిన్నయసూరిచెప్పిన "నిందార్థకంలోని గిగీ"లతో ఈ 'ట్రా' స్నేహం కలుపుకున్నట్లున్నది.

హిందీభాషలో పదాలు తెలుగున చేరిన వనుకున్నాం. ఇవి పరిశీలిస్తే;—

'ఇరుకు సరుకు' అనే జంట చూద్దాం — ఇక్కడ 'సరుకు' అనేది తతిమా అన్ని పదాలలో మల్లే పూర్తిగా వ్యర్థం కాదేమోననిపిస్తుంది. "ఇల్లు ఇరుకూ సరుకూ లేకుండా కుశలంగా ఉన్నదా!" అందామనుకుందాం. ఇక్కడ 'ఇరుకు' అనేదాని అర్థం 'విశాలంకాని' అని—ఈ 'ఇరుకు'కు మిగతి రూపాలు, ఇఱకటము; ఇఱకాటము; "ఇల్లు ఇరకటం ఆలిమరకటం" అనేచోట ఈమాట వినిపిస్తున్నది. అయితే యీ యిరుకుకు, "విశాలంకాని", అనే అర్థం కాక మరొక అర్థంకూడా ఉన్నది. "చెయ్యి ఇరుకు పట్టింది!" అన్నచోట దీని అర్థం 'బెణికింది' అని. నిజానికి దీన్ని విపులంగా, నిశితంగా తఱచిచూస్తే, పై సంకుచితత్వంలోనిభావమే యిక్కడా ఉన్నదని తేలుతుంది. దీనికి మూలధాతువు 'ఇఱి' — "అణగు లేదా, నలుగు" అనే అర్థంలో ఏర్పడిన ధాతువిది—. ఇదిట్లా ఉంచి దీనిపక్కన ఉన్న సరుకు చరిత్ర చూద్దాం. ఇది 'సప్పు'కు మల్లే వ్యర్థమేనా?— వ్యర్థపదమైతే తంటాలేదు. కాని వాకిక్కడ ఒక సందేహం!

హిందీలో 'సరక్‌నా' అని ఒక పదం ఉంది. అంటే 'తొలగు లేక జరుగు' అని. 'జర్ర సర్కోజీ' అనే వాడుక తఱుచు బస్సులలో, రైళ్ళలో చెవుల పడుతూనే ఉంటుంది—పైపైనచూస్తే ఈ సరుకుకూ

ఆ ఇరుకుటా సంబంధం చెప్పిన స్ఫురించదు. కాని, హిందీ వ్యావహారికభాష పరిశీలిస్తే హాత్ సరక్ గయా అనే ప్రయోగం వినిపిస్తుంది. ల, ర ల, అభేదాన్ని బట్టీ అర్థసామ్యాన్ని బట్టీ ఇది యీ సరక్ అనే క్రియే నేమో అనుకోవడానికి విప్రతిపత్తి లేదు — పై హిందీ వాక్యానికి అర్థం 'చెయ్యి బెణికింది' అని. అంటే తొలగు, జరుగు అనే అర్థాన్నిచ్చే సరక్ నా "చెయ్యి ఎముక తొలగు, కీళ్ళు పట్టు జరుగు" వంటి అర్థవిశేషాన్ని పొందిఉండవచ్చు—. దీన్ని బట్టిచూస్తే మానవశరీర సంబంధిగా రూపొందిన ఈ యిరుకు సరుకులు రెండూ కలిసి చివరకు ఇంటి యిరుకూ, తొడిగిన వస్త్రపు బిరుకూవంటి వాటిని బోధించేవిగా వాడుకలో స్థిరపడినవి. 'సరుకు'ను గురించి నా ఊహ యిది — ఇదే నిజమైతే సరుకు విజాతీయపదమవుతుంది —. రెండుపదాలూ అటువంటివే అయిన 'అజా పజా'ను చూస్తే అజ అనే దానికి తెలుగులో రూఢమైన అర్థం 'లెక్క' అనీ 'జాడ' అనీ—

1. ఆ 'అజల'న్నీ నీకెందుకోయ్?

2. వాడెక్కడా 'అజ' లేడు — ఇటువంటివి ప్రయోగాలు.

'అజ' అంటే హిందీలో ఉన్న అర్థం 'ప్రకృతి' అని. అంటే 'రూపు' అని, మనం విపులీకరించుకోవచ్చు. ఇక పజ అనే పదం కనిపించదు కాని, 'వజ' అంటే 'ఆకృతి, వసతి' అనే అర్థాలలో ఒక పదం కనిపిస్తుంది. 'ప, వ'లు రెండూ ఒకదానికొకటి మారేవి. ఈ 'వజా' అనేది గుంటూరు మాండలికంలో విడిగా కూడా కనిపిస్తుంది, చూడండి, "ఆ 'వజాన' జానువేపై వాడట్లా అరుస్తుంటే ఎవరూ పట్టించుకోరేం?" —ఇక్కడ ఈపదానికి అర్థం 'అరీతిగా'; 'అప్రకారంగా' ఇంకా నిశితంగా చూస్తే, 'ఆ ఆకృతిలో' అని!—కాబట్టి ఈ రెండుపదాలూ ఇంకోభాషలో పైనా కలిసి జంటపదమై మెలుగులు చిందినవి. కాని యీ జంట మళ్ళీ హిందీలో కనిపించదు.

హిందీలో ఉన్నవి తెలుగులోకి అట్లాగే వచ్చి చేరినవి కొన్ని ఉన్నయ్. అవి;

1. ధక్కా ముక్కీ.
2. టాలా టోలీ.
3. కచ్చా పచ్చా—వంటివి.

"వాడు జీవితంలో చాలా ధక్కా ముక్కీలు తిన్నాడుపాపం!"—అనేవాక్యం చూద్దాం. ఇక్కడ యీమాట కర్థం: 'కష్టాలు, లేక ఎదురు దెబ్బలు' అని—హిందీలో ధక్కాముక్కా అనేది పదం. దీనికి ఉమ్మడిగా అర్థం, కొట్లాట, లేక పోట్లాట అని. ఈ అర్థాలకు సన్నిహితత్వం కలిగిన, 'దెబ్బ' అనే భావం తెలుగులోని వాడుకకు రూఢమైపోయింది. మొదటనున్న 'ధ' కఠినత్వం తొలంకా డే 'ధ' గా ఎందుకు మారిందో అనూహ్యం.

'టాలాటోలీ'కి హిందీలోనిది 'టాల్ టోల్' అని. అంటే 'ఇదుగో అదుగో' అని సోమరిగా కాలం గడపడం. తెలుగులోని వాడుక చూడండి.

"వాడుత్త 'టాలాటోలీ' గా తిరుగుతున్నాడు!" దీన్ని బట్టి హిందీలోని అర్థచ్ఛాయలే తెలుగుకు కూడా వచ్చిందనుకోవచ్చు. కచ్చా పచ్చా అంటే నలిగీ నలగక అని ఒక అర్థం, 'అపరిపక్వమైన' అని మరొక అర్థం.

1. "పచ్చడి 'కచ్చా పచ్చా గా' నూరు!"—
2. "కచ్చా పచ్చాగా ప్రతిదీ తింటే ఏమవుతుంది?

పై చెప్పినవాటిలో రెండూ హిందీపదాలు. ఉత్తరపదమే విజాతీయపదమయిన జంటలను మనం చాలా చూడవచ్చు.

1. మట్టీ మశాణం.
2. పెట్టే బేడా.
3. కొంపా గోడీ.
4. మొప్పా మెహర్బానీ—వంటివి.
5. సిగ్గూ సెరం—

"ఏదో ఇంత 'మట్టో మశాణమో' కొట్టుకుని బయలుదేరతాడు పాపం!" — ఇక్కడి యీ జంట మాట వాడుక చూడండి! ఆ బయలుద్దేరేవాడు, 'అదరా బాదరా' ఇన్ని మెతుకులు నోట్లో వేసుకుని వెళ్ళడాన్ని చిత్రించే జంటపదమిది. ఆ త్వరగా తినే ఆతురత వాడిని మట్టో, అన్నమో అనే విచక్షణతో చూడనీయదని దీనికి వివరణ. ఇటువంటి సందర్భంలో వాడిన 'మట్టి'కి తోడు 'మశాణం'—బహుశ ఇది శ్మశానపదానికి వికృతి కావచ్చు. హిందీలో దీని రూపం 'మశాన' మట్టికి సంబంధించింది శ్మశానమే. పాంచభౌతిక శరీరం మట్టిగామారే దిక్కడనే. ఈవిధంగా శ్మశానానికి మట్టితో సంబంధం ఉన్నది. మట్టినిబట్టి వ్యక్తి తినే అన్నంతో కూడా ఆ బంధం కుదురుకున్నది.

ఇక రెండవది 'పెట్టే బేడా!'—.

"పెట్టే బేడా సర్ది సిద్ధంగా ఉండు! నాలుగు గంటలకే బండి!" అని భర్త భార్యనే హెచ్చరించా డనుకుందాం. ఆ యిల్లాలు పెట్టెలు సర్దుతుంది, నిజమే! కాని సర్దడానికి బేడలనేవేమిటి? ఇవి సర్దడ మేమిటి? అనే సంశయం కలగవచ్చు. దీన్ని వెనుకటి కొన్నిటికిమల్లే అర్థస్ఫోరకత లేని వ్యర్థపద మన వలెనా అనేదొక ప్రశ్న! వ్యర్థపదమే అయ్యేటట్లయితే దానికి మొదటిపదాన్ని పోతే అక్షరసామ్యమన్నా ఉండవలసింది. ఇక్కడ అదీ లేదు. మరి ఇది యిక్కడున్నందువలన సార్థక్యమేమిటి?

'బేడ' అనేదానికి తెలుగులో, 'పరకరూపాయ, కాయధాన్యముల పప్పు' అని అర్థాలు. ఈ రెండు అర్థాలూ మొదటిపదంతో సరిపోవు—. దీన్నెట్లా పరిష్కరించడం?

నాదొక చిన్న ఊహ! హిందీలో బేడ్ అంటే ఆవరణమనీ, దడి అనీ అర్థం. బహుశః పెట్టె పక్కనున్న 'బేడ' మన తెలుగు బేడకాక హిందీబేడ అయినట్లయితే అన్వయం చక్కగా కుదురుతుంది. ఇల్లు బయలుదేరే యిల్లాలు పెట్టె సర్దినట్లే ఇల్లుకూడా సర్దుతుంది. ఇంటిఆవరణ అంతా బందోబస్తులో ఉంటేనే కాని ఆమె బయటకు కదలలేదు —ఇటువంటిదే 'కొంపా గోడీ' అనే జంటపదంలో ఉన్న 'గోడి'. 'గోడి' అంటే తెలుగు అర్థం 'అణుగుదల' అని. ఇది కూడా ఇక్కడ సరిపోదు. ఇక హిందీలో గోండా అంటే పశువులదొడ్డి, లేక ముంగిలి అనే అర్థమిచ్చేపదం కనిపిస్తుంది. కొంపకు బంధుత్వం కల్పించుకునే అర్హత పశుశాలకే ఉన్నది.

ఇక మెహార్బానీ:—ఇది అచ్చంగా హిందీ పదం. దీని అర్థం 'దయఅనీ, కరుణ' అనీ; అనుగ్రహమనీ. మెప్పులోఉండే అనుగ్రహప్రసారం ఈ మెహార్బానీలోకూడా ఉంది.

తరువాతిది సెరం.

"సిగ్గూ సెరమూ లేకుండా ఏమిటా ప్రవర్తన" అనే చీవాట్లు వింటుంటాం మనం. నిజానికి ఈ 'సెరం' అనేది 'స' కారాది కాక 'శ' కారాది.— మొదటిపదం 'సిగ్గు'కే అర్థం ఉన్నదో ఈ 'సెరానికి' అదే అర్థం. ఇది తెలుగుపదంలాగే ధ్వనించినా తరిచి చూస్తే కాదని తెలుస్తుంది. హిందీలో 'శరమ్' అనే పద మొకటుంది. "శరమ్ ఆగయీ" అంటే "సిగ్గాకి" అనీ, "శరమ్ నహీఆతీ?" అంటే సిగ్గులేదా అనీ తరుచూ హిందీసినిమాలలో వింటూనే ఉంటాం. బహుశః ఆ శరమ్ 'శరము'గా వచ్చి తెలుగు ముద్ర వేసుకుని సిగ్గుతో కలిసి ఉండవచ్చు. అదీ నిజమయితే రెండుపదాలూ సమానార్థకాలు.

ఇక రెండవవిభాగాన్ని తీసుకుందాం. ఇందులో చేరేపదాలు, రెంటికీ ఒకే అర్థం ఉన్నపదాలు. ఒకే అర్థాన్ని రెండుసార్లు అనడంలో వక్త గణించేదేమిటి? అనిపించవచ్చు. ఇది కేవలం ఊతకోసం. అటువంటివి కొన్ని:—

1. గడ్డీ గాదం.
2. నోరూ వాయీ.
3. ఆకూ అలమూ.
4. మాటా ముల్లే.
5. ఊరూ నాడూ.
6. వదురూ బెదురూ.
7. దారీ తెన్నూ.
8. బుగ్గీ బూడిదా.
9. అడ్డూ ఆపూ.
10. తాలూ తప్పరా.

1. 'గాదము' అనేదానికి 'పైరులోని కసవు' అని శబ్దరత్నాకరం సూచిస్తున్నది. కలుపుమొక్కలకు కూడా ఈపదాన్ని ఉపయోగించవచ్చు. గడ్డికూడా యిటువంటిదే! ఇక్కడి వాడుక.

"కూరపాదుల్లో 'గడ్డీ గాదం' లాగివెయ్యాలి!" అని ఇటువంటివే మిగిలినవన్నీ కూడా. ఇంచుమించుగా పూర్వపదానికీ, ఉత్తరపదానికీ అద్వైక్యం కుదురుతూనే ఉంది—. ఇంచుమించుగా అని ఎందుకన్నానంటే, ఈ జంటపదాల్లో వాడిన మాటలకు వాడుకలోఉన్న అర్థాన్నిబట్టి ఏకత్వం లభిస్తున్నా. నిఘంటువులు కించిద్భిన్నార్థాలనిస్తున్నది కాబట్టి. చూడండి.

1. 'అలము' అనేదానికి శ. ర. కారుని అర్థం శాకవిశేషము అని.

2. 'తాలూ తప్పర'లో 'తాలు'కు జనులలోని వాడుక, 'పొల్లుగింజ' అని. ఉదా:—"ఉత్త 'తాలు గింజ' లొచ్చినయ్ ఈసాలి!" 'తప్పర' అన్నా అదే అర్థం. కాని శబ్దరత్నాకరంలో 'తప్ప' అనే పద మొక్కటేయిచ్చి, దానికి "గింజపట్టని ధాన్యము" అనే అర్థాన్ని సూచించాడు. కానా, 'తాలు,

అంటే నెమ్మ తీసివేయగా ఏండిన పాలను అని వివరించాడు. ఈ విభేదాలయినా యీ రెంటిలోనే. ఇంతటితో రెండవ విభాగం సరి.

ఇక మూడవది. దీనికిందికి వచ్చేవన్నీ మొదటి మాటకు పూర్తిగా వ్యతిరిక్తమయిన అర్థాన్ని సూచిస్తూనే సన్నివేశాన్ని నిశితంగా చిత్రించే మాటలు. అవి;

1. మంచీ సెబ్బరా.
2. వంటా పెంటా.
3. ఎగా దిగా.
4. పెద్దా చిన్నా.
5. మిన్నా మన్నా —వంటివి.

మంచికి సెబ్బర సరిగ్గా వ్యతిరేకార్థాన్నిచ్చే పదం. 'సెబ్బర' అంటే చెడు అని. దీనికి రూపాంతరం, సెబ్బ.

"మంచీ సెబ్బరా చూడకుండా రంగంలోకి దిగవాకు!" అన్న వాక్యం తీసుకుందాం. సంస్కృతంలోని "విచక్షణా విచక్షణ జ్ఞానం, లాభాలాభాలు, దోషాదోషాలు" వంటి సమాస రచన కిది సరిపోయే జంటపదం. వాళ్ళకు వ్యతిరేకార్థదం చెయ్యడానికి 'నై' (నఞ్) చేర్చుకోవడమే దారి. మనకు, అట్లా కాక ప్రత్యేక పదాలున్నవి.—

ఇటువంటిదే రెండవదికూడా. ఇక మూడవది. "ఎగా దిగా నావైపు అట్లా చూస్తావేం?" అనే వాడుకలో, ఆ చూపువలని అసమ్యక్త్వగుణం, చూచేవాడి ధోరణిలోని ఆతురత, సందేహం అన్నీ మిళితమై ఇద్దరి మన స్తత్త్వాలనూ విప్పి మనముందు పెట్టే చతురత ఉన్నదనిపిస్తుంది. సంస్కృతంలో "నఖశిఖ పర్యంతం, ఆసేతు శీతనగం" వంటి సమాస రచనతో, ఈ తెలుగు నుడికారం సవాలు చేస్తుంది—ఇటువంటివే మిగిలినవి కూడా.

ఇక నాలుగవ విభాగం. దీనికిందకు చేరేవి; మొదటి పదం చిత్రించే వాతావరణాన్ని, పరిస్థితినీ, అవగాహన చేసుకుని దానికి మెరుగులు పెట్టి మరింత నిశితంగా చూపే ఉత్తరపదాలు.

ఇటువంటివి;—

1. చీకూ చింతా.
2. ఊపూ ఊదరా.
3. మట్టూ మర్యాదా.
4. పోలూ పొందికా.
5. మాటా మంతీ.
6. రవ్వా రట్టూ.
7. నగలూ నాణెం.
8. సిగ్గూ ఎగ్గూ.
9. చచ్చీ చెడీ.
10. పేచీ పేతరా.
11. ముద్దూ ముచ్చటా.—

ఇట్లా చెప్పాలంటే వీటి కంతమే ఉండదు—ఈ వ్యాసోద్దేశ్యం, విభిన్నతలు దిఙ్మాత్రంగా చూపించాలనే కాబట్టి యివి చర్చించి ఊరుకుందాం—.

1. చీకూ చింతా:—చీకు అనగా జీర్ణమైన అని అర్థం, దీనికే అంధత్వమని కూడా వాడుక. దీని రూపాంతరం చివుకు. వీటినుండి వచ్చినవే చికాకు చింత అనే రెండు పదాలు. చింత అనేది మనకు సంస్కృతం నుండికూడా రాకపోలేదు. కాని ఆ చింతకు విచారమనే అర్థం. ఈ చింతకు వలపు, శ్రమము అనే అర్థాలు. బహుశ ఈ జంటమాటలలోని చింత తెలుగువారి చింతే కావచ్చు.

ఆయనకేం మహారాజా 'చీకూ చింతా' లేకుండా కాలం గడుపుతున్నాడు—. వంటిది ఉదాహరింపు.

2. "ఆయన గతి మరీ 'ఉపూ ఊదరా' అయిపోయింది" అనగా ఉక్కిరి బిక్కిరి అయినదని.

ఇక్కడ; 'ఊపు' అనేది 'ఊదు'కు పర్యాయపదంగా రాయలసీమవారు వాడుతుంటారు. ఊదేటప్పుడు నోరు ఉవర్ణోచ్చారణ కనుగుణంగా కూడబట్టి ఈ క్రియకు ఈ అక్షరంతోనే మొదట, 'ఊదు' అనగా గాలిని నిశ్వసించు వైఖరి ఒకటీ, రెండవది 'వాచు' అనీ.

'పురు గూడింది.' అనే వాడుక మనకు తెలిసిందే. ఇంకొక విశిష్టత ఏమంటే ఈ ఊదులో పొగను సూచించే భావంకూడా అంతర్గతంగా ఉండడం. కారణం పొగకూడా వాయుమండలంలో వ్యాపిస్తున్నది కాబట్టి. చూడండి;

'ఊదర' అంటే పొగ. అదీ, కాయలు పండడానికీ ఎలుకలు చావడానికీ పెట్టే పొగ.

మనకొక సామెతలో,

"ఉండమనలేక 'ఊదరా,' పొమ్మనలేక 'పొగా' పెట్టారన్న"ది ఉంది—పొగలో కళ్ళు మండించే

శక్తి ఉంటుంది. ఊదరలో దానికితోడు తపింపజేసే శక్తికూడా ఉంటుంది. ఇదీ దీనిలోని భేదం—కాబట్టి యీ 'ఊదు' నుండి వచ్చిన ఊపు సూచించే పొగా ఊదరలోని తపనశక్తి మనుష్యుని ఉక్కిరి బిక్కిరి చేస్తాయనడంలో విప్రతిపత్తి లేదు. ఈ రెండు పదాలూ, ఒకదానిమీద మరొకటి బలంగా గుణవిశదీకరణ చేస్తూ అర్థవంతాలుగా ఉన్నవి.

తర్వాత 'మట్టూ మర్యాదా'—. దీన్ని చూస్తే ఇక్కడ ఒకటి తెలుగుపదం; మరొకటి సంస్కృత పదం. మట్టు అనగా 'కుదురు' అని ఒకర్థమూ, మితి అని మఱొకర్థమూ—ఈ రెండూ కాక త్రొక్కు అనే ఇంకొకర్థంలో ఈ పదం విశాఖమాండలికంలో ఎక్కువగా కనపడుతుంది.

ఉ॥ దా:—"వాడు నా కాలు మట్టేశాడు".

ఈ 'మట్టు'కు దగ్గరిబంధువు 'మట్టము' నేదానికి, సమప్రదేశమనీ, శూన్యమనీ రెండర్థాలు — రెండవ అర్థానికి ఉదాహరణ, "వాడికి బుద్ధి మట్టం!"— ఎచ్చు తగ్గులు లేకుండా, సరిగ్గా అనే అర్థానికి 'మట్ట సరిగా' అనే వాడుక గుంటూరు ప్రాంతాలలో వినిపిస్తుంది—అయితే వీటన్నిటిలో మనకు కావలసింది 'కుదురు' అనే అర్థం. అనగా సమమైన, ఒడుదుడుకులు లేని, మూలమైన, అనేవి దానికి పర్యాయాలు—వీటికి మరొక అర్థం 'మితి.' చూడండి "మట్టు మీరు; మట్టు మిగులు" అనే రెండు క్రియలు వాడుకలో ఉన్నవి మనకు. అంటే అతిశయించు; మితిమీరు అనే అర్థాలలో!—దీన్ని అంతా విశదంగా చూస్తే 'మట్టు' అనే పదం, ఒక అంచులు మీరని విషయ సమగ్రతను సూచిస్తుంది. దానికి కించిత్తు హెచ్చు వాటిల్లినా అదంతా అతి అనకతప్పదు—ఇదీ యీ మట్టుకు అర్థం. మర్యాద అనగా హద్దు—సమగ్రంగా ఉండే విషయ స్వరూపానికి ఉన్న హద్దును సూచించే పదమే ఈ మర్యాద. కాబట్టి ఒకదానికొకటి ఆలంబన మిచ్చుకుంటూ అందా లొలికిస్తున్న దిక్కడ.

తర్వాత 'పోలూ పొందికా'—

"నా డన్న దానికీ చేసిందానికీ ఎక్కడా 'పోలూ పొందికా' లేకుండా పోయింది!"—అనేది ప్రయోగం—

ఇక్కడ పోలు అనేది, నామవాచకమే అనుకోవాలి. అర్థం 'పోలిక' అని. లేదా 'సరి పోలు' అనే అనుకుంటే అది క్రియ. 'ఆలూ పోలూ' లేదు. అన్న చోట 'జాడా జవాబూ' లేదనే అర్థం. ఒక వ్యక్తి మరొకరితో పోల్చుకోవడం; ఒక వస్తువును ఇంకొక దానితో పోల్చడం ఇక్కడ ప్రమేయాలు—ఇక 'పొందు' అనగా 'ప్రాపించు; సంధించు' అని అర్థాలు.

పొందిక—చేరిక—ఈ ధాతువునుండి వచ్చిన మఱొక నామవాచకం పొంతన. దీన్ని అన్నిచోట్లా క్వాచిత్కంగా వాడి "వివాహకార్యసందర్భంలో వధూవరుల జాతకాలు సరిపోల్చేటప్పుడు విశేషంగా వాడుతారు. ఉదాహరణకు.

"పిల్లకీ పిల్లవాడికీ 'పొంతనాలు' కుదిరినట్టేనా?" అనీ, "నీతో నాకసలు 'పొంతన' కుదరనే కుదరదు" అనీ!—ఈ పొంతనము; పొందు తనము అని ఏర్పడ్డ దనుకుందామా?—.

ఇంతకూ ఇక్కడ 'పోలి' ఒక విషయమూ, పోలిన తరువాత దగ్గరకుకూడే ఒక విషయమూ చెప్పాల్సివచ్చినప్పుడు ఈ రెండు పదాలూ కూడి జంట ఏర్పడుతుంది! అయితే ఇక్కడ ఒక వైపరీత్యం ఉంది. ఈ జంటమాట ఎప్పుడూ, 'పోలూపొందూ' కుదిరిన సమయాలలో ప్రయోగింప బడటంలేదు. కేవలం కుదరని సమయాలలోనే, ఆ కుదరని తనాన్ని ఎత్తి చూపించడానికే ఉపయోగపడుతున్నది.

తరువాతిది "మాటా మంతీ!"—"ఒక 'మాటా మంతి ఏమీ లేదూ? ఎప్పుడూ 'ఎడా పెడా' యేనా?" అన్నా రనుకుందాం. ఇక్కడ ఈ జంటపదానికి ఉమ్మడిగా, కలిసి మెలిసి వ్యవహరించే స్వభావమని అనుకోవచ్చు. ఒక వ్యక్తికి మరొకవ్యక్తియందుండే ఆప్యాయత మాటవల్లనే తెలుస్తుంది. సంభాషణలో తొలుకాడే ప్రీతి, మార్దవమూ, ఆదరణా, ఇవి ఎదుటి వ్యక్తిని మన రోషాల సుముఖుణ్ణిచేసి సదభిప్రాయానికి దారి తీస్తవి—అందుకనే 'మాటా,' దానివెనుక మంతీ ఒక వ్యక్తికి ఇతరులతో ఉండే సంబంధాన్ని సూచించబోయేముందు ఏర్పడింది—ఇంతా చెప్పాను గాని, ఈ 'మంతి' చరిత్ర నా కంతుపట్టలేదు—'మంతనము' అనే తెలుగు మాటకు 'ఆలోచన' అనే అర్థం ఉంది. బహుశ ఈ మంతికి దానితో ఏమన్నా సంబంధ మున్నదేమోనని నా అనుమానం—ఇది కాదని కొట్టిపారవేస్తే మంతిని 'మంచి' గా మార్చుకోనూ వచ్చు. అప్పుడూ పదం "మాటా మంచీ" అవుతుంది—మాటా, దానివల్ల విదితమయ్యే మంచితనమూ చక్కని జంట కాదనడానికి వీలులేదు.

'రవ్వా రట్టూ' అనేది మఱొకటి! "రవ్వా రట్టూ లేకుండా హాయిగా ఉంది సంసారం" అనే

వాడుక చూద్దాం — అల్లరిపాలు కాకుండా కుది
మట్టంగా ఉండే సంసారం ఇటువంటి సొగసుకు
లోనవుతుంది. 'రవ్వ' అనే పదానికి అర్థం పరిశీ
లిస్తే;—శబ్దరత్నాకరకారుడు ఇచ్చినది, అణువు;
పుష్పాదిక్షరవ; వజ్రము; ఖండము. అని—ఇది కాక,
'రవరవ' అనే ధ్వన్యనుకరణశబ్దం ఒకటున్నది.
ఇదైనా, శ. ర. కారుని అభిప్రాయాన్ననుసరించి
కేవలం కాంతివిశిష్టతను సూచించేది మాత్రమే.
ఇందు కాయన ఇచ్చిన ఉదాహరణ.

"రవరవలు నెఱపు నీలంపు రవ రవణము" అని
—కాగా ఈ రవరవ అనే పదం, జనసామాన్యంలో
మరొకవిధంగా వాడుకలో ఉంది.

"వాడి మనస్సులో 'రవరవలు' రేగినయ్."

"ఇద్దరి మధ్య 'రవరవలు' లేకుండా పొందుగా
బతకండి!"—దీనికి స్పర్థ లేక, రాపిడి అనే అర్థాన్ని
మనం ఆపాదించుకోవాలి—ఇదే అర్థం రవ్వ రట్టూ
లోని 'రవ్వ' కు సరిపోతుంది. అంతేగాని శబ్దరత్నా
కరకారుని అర్థాలేవీ సరిపోవు.

అయితే 'రవ్వ' కు వాడుకలో ఉన్న మరి
కొన్ని అర్థాలు 'పేసరు;' 'నిప్పురవ్వ' అని.—

"రవ్వంత నెయ్యి రాల్చు" — అన్నచోట
వాడిన ఈ రవ్వ అల్పతను సూచిస్తూ, పై పట్టికలోని
'అణువు' అనే అర్థంతో చెలిమి చేసుకుంటున్నది—

"రవ్వలు ఎగురుతున్నయ్. అటు చూడకు!"
అని రైలు కిటికీనుంచి తొంగిచూస్తున్న పిల్లవాడిని
హెచ్చరించినచోట, రవ్వకు విస్ఫులింగమనే అర్థం.
అరుణత్వాన్ని సూచించే దీనికీ 'వజ్రం' లోని అరు
ణత్వానికీ సంబంధం చూచాయగా స్ఫురిస్తుంది.
ఇంతకూ 'రవ్వ' అనేదానికి సామాన్యార్థం క్లిష్టతను
సూచించే స్పర్థ లేక రాపిడి అనే చెప్పుకోవచ్చును.

'రట్టు' అనే పదానికి బహిరంగము, బట్టబయ
లు అనేవి అర్థాలు. అనగా ఒక విషయం. అభ్యంత
రాన్ని విడిచి నలుగురినోళ్ళలో నానడం.—మొదట
సంసారం రవ్వపాలై తర్వాత రట్టుకావడమనేది
సహజం. అందుకే ఈ జంటలో సామరస్యం
చక్కగా కుదిరింది.

ఇటువంటివే మిగతావికూడా. పోతే ఈ విభా
గంలో మరొక చిన్న విభాగంకూడా అంతర్గతంగా
ఉన్నది. మొదటిపదం చిత్రించే వాతావరణాన్ని
మెఱుగుపెట్టి పరిస్థితిని మరింత విశదంగా చూపి
స్తున్నా. ఇక్కడ ఉత్తరపదం పూర్వపదంతో తెగి
పోని అనుబంధాన్ని కూర్చుకున్నట్లుగా ఉంటుంది.
"మొదటి పదం కాబట్టి నేనూ రావలసివచ్చింది!" అని
అధికృతిచేసే వాక్యమంత ధాటిగా ఉంటుంది.
ఆ రెంటి కలయికా!—అటువంటి మాటలు,

1. కిల్లా జెల్లా.
2. చిన్నా చితకా.
3. కాయా గసరూ.
4. సిల్లా శీమా.
5. ఇల్లూ వాకిలీ.
6. సద్దా సకుమూ.
7. సామాన్ల సంబంధం.
8. తిండీ తిప్పలూ.
9. కూరా నారా.
10. చెప్పా చేరూ.
11. బొట్టూ బోనం.
12. పెళ్ళీ పెటాకులూ.
13. ఈడూ జోడూ.—ఇవి!—ఇక వీటిని
కొంత పరిశీలిద్దాం—

"ఈ పిల్లా జెల్లా వీళ్ళందర్నీ తీసుకుని ఎక్క
డికి కదల్ను?"—.

ఇక్కడ 'జెల్ల' అంటే ఉన్న అర్థమేమిటి?
పిల్లలతో దీనికున్న ప్రసక్తి ఏమిటి అని అన్వేషించు
కోవాలి. 'జెల్ల' అనగా మత్స్యవిశేషమనే ఒక్క
అర్థమే, రూఢార్థం. అయితే వాటి కిక్కడ స్థాన
మేమిటి? పిల్లలను కొనిపోయేవాళ్ళు, తోడనే
జెల్లపు చేపల్నికూడా వెంటవేసుకు వెళ్తారా? అదే
నిజమైతే ఈ ప్రయోగం అబ్రాహ్మణులలోనే పుట్టి
బ్రాహ్మణులచే ప్రయోజ్యం కాకుండా ఉండవలసిన
మాట—పుట్టుక ఎవరివల్లనైనా, ఈ వాడుక రెండు
వర్గాలలో సమానంగానే ఉన్నది.

మత్స్యాలలో జెల్లలు బహు చిన్నవి. దానికి
తోడు ముళ్ళపుట్టలు. బహుశః జెల్లలలోని చిఱుత
దనమూ, ప్రశాంతంగా భుజించి ఆనందించడానికి
వీలులేకుండా, అడుగడుక్కీ అడ్డువచ్చే ఆ ముండ్ల
తనమూ మత్స్యాహారుల మనస్సుకు పట్టిఉండవచ్చు.
పిల్లలట వంటివారు! చిన్నవాళ్ళు. పై పెచ్చు తగ
వులానికీ హద్దుమీరిచేసే అల్లరులు పెద్దల మనశ్శాం
తికి భంగకరాలు. అయినా అందులోనే ఆనందం.
అందుకే పిల్లలూ జెల్లలూ కలిసి సరితూగగలిగాయి!

మరొకటి 'సడ్డా సకుసు'—"ఎవరింటికైనా వెళ్లామంటే 'సడ్డా సకుసూ' సక్రమంగా అమిరితేనా!" అంటామనుకోండి!—ఇక్కడ 'సకుసు' అనే పదానికి అర్థం ఉండి, అది పూర్వపదంతో సునిశితమైన సంబంధాన్ని వ్యక్తం చేసుకుంటున్నా దాన్ని ఎవరూ గుర్తించక వ్యర్థపదంలానే వాడుకుంటున్నాం. ఇక్కడ ఇది కేవలం 'సొరకు' ఉపయోగపడుతున్నది.

'సకుసు' అంటే అర్థం, "పరివేషము సంద్రము." అని—.

"వాడిలో వాడు 'సకుసుకుళ్ళ' పడ్డాడు!" అనే పదప్రయోగ మొకటుంది—ఇక్కడ దీనికి అర్థం, "దుమ్ములు చుట్టుకొను;" అంటే సుడులు తిరుగు; గిరగిరలాడు అని—. కాగా 'సడిసె' అనే పదానికి జనులలోని వాడుక పూరిల్లు, లేక చుట్టిల్లు. శబ్దరత్నాకరకారుడిచ్చిన అర్థం, "చంద్ర సూర్యులకు చుట్టూ ఏర్పడు మండలాకృతి" అని. ఇంతకూ ఈ జంట పదానికి అర్థం; వస్త్రాదికమూ తత్సంబంధమైన గృహోపకరణాదులూ.

ఇక అయిదవ విభాగంలో ఉత్తరపదం కేవలం పూర్వపదానికి ఉదాహరణ ప్రాయికంగానో లేక, ఒక పోలికగానో నిలుస్తుంది. దానివలన మొదటి పదానికి అనుకోని సొగసు కూడుతుంది.—అటువంటి మాటలు చూడండి కొన్ని!.

1. చిలకా గోరింకా.
2. పాలూ నీరూ.
3. నీరూ నిప్పూ.
4. ముక్కూ మొహం—.

"నువ్వూ మీ ఆయనా 'చిలకా గోరింకల్లా' ఉన్నారమ్మా!"—అన్నచోట, చిలకా, గోరువంకా ఒక చక్కని జంట అనేది స్ఫురిస్తుంది. చిలుకకు గోరువంకా, దానికి చిలుకా, ఒకదానికొకటి కూడి, పొందిక అందాన్ని చ్ఛవిగా ఉంటాయని భావం—

రెండవది పాలూ నీరూ.—

వాళ్ళిద్దరూ 'పాలూ నీరూ' లా కలిసి మెలిసి పోయారు—ఇక్కడ పై రెంటిలోని కలయికే పరమార్థం. ఆ విధంగా ఆ రెంటికీ పొత్తు—.

ఇటువంటివే మిగతవి కూడా!—

ఇప్పటికి చెప్పదలచుకొన్న విభాగాలన్నీ చెప్పినట్లే—

నా వ్యాసరచనకూడా ముగింపుకు వచ్చింది. అయితే దీనివల్ల సాధింపబడిందేమిటి? భాష అనేది ఒక ప్రజ్వలిత మహాగ్నిగుండం. అందులో ఉండే విశిష్టతగానీ, హృదయాన్ని హత్తిపలికే ప్రత్యేకతగానీ, అతి గంభీరమై ఎవరికీ అందకుండా ఆకాశానికి నాలుకలు చాస్తుంటుంది. దాన్ని పట్టి బంధించి ప్రతివారికీ వివరించాలనుకోవడం సాహసం. కాకపోతే ఇటువంటి రచనలన్నీ ఆ మహాజ్వాలనుండి విడివడి సుడులు తిరిగే విస్ఫులింగాలు. వాటి మనికి ఒక క్షణమే అయినా కాంతిని చిమ్మాలనీ, విశిష్టంగా ఉండాలనీ ప్రయత్నాలు ముమ్మరంగా చేస్తుంటవి! అంతమాత్రాన అన్ని ప్రయత్నాలూ విజయవంతాలు కావాలనీ లేదు. అన్నీ మొగ్గలోనే వాడిపోవాలనీ లేదు—అంతే!!



# టాజ్ మహల్

★

శ్రీ అప్పల వీరవెంకట జోగయ్యశాస్త్రి

పున్నమి వెన్నెలన్ గరఁగి పోయెడి చక్కని చంద్రకాంత సౌ
ధోన్నత గోపురాల విభవోద్ధతి భూరి సితాతపత్రమై
జిన్నియ వెట్టగా ప్రణయజీవుల మానస రాజ్యలక్ష్మికిన్
గన్నుల మల్లెపూవయి యఖండ యశస్క్రియ టాజి వెల్లెడిన్.

ముకుళించుకొన్న దే ముగ్ధ నేత్రాంజలి
క్షణద నిద్రిత జల-జాతమట్లు,
కను మూసిపోయెనే కల్యాణి లావణ్య
మెండి వాడిన పూల-దండరీతి,
శ్రుతి హీనమయ్యెనే సతి గాత్రమాధురి
భగ్న విపంచికా స్వరము రీతి,
స్తంభించిపోయెనే సాధ్వి రాగ రసంబు
రాయిగట్టిన పాద-రసము మాడ్కి,
దీర్ఘ నిద్రను జెందెనే-దివ్యమూర్తి భూరియోగ సమాధి సు-ప్తుని విధాన,
మూఁడులోకాల యందాలగూడకట్టి మలచికట్టిన యీ టాజి-మందిరాన.

ఏ జలజాత దీర్ఘతర వీక్షణ సుందర దివ్యమూర్తి క
వ్యాజ మహానురాగ కుసు-మాంజలులన్ ఘటియించు షాదుషా
రోజును రోజు, నట్టి యపు-రూప రసాంచిత రూపరాజి ముం
తాజికిఁ బ్రేమచిహ్నమయి-తాజిమహల్ కనువిందు చేసెడిన్.

* * * * * *

జారిన గుండెలో మునుపు సాగిన మోహనరాగమేళ వి
స్ఫారిత వల్లకీగతి యపశ్రుతి పాలయి పోవనాడ సా
వేరి ముఖారియై హృదయ వీథి విషాదపు రేఖ దిద్ది, యే
తీరున షాదుషా మనసుఁ ద్రిప్పెనొ శోకము టాజి సృష్టికై!

గాటపు ప్రేమలో మనసు గాయము నొందిన దానికింత యా
ర్భాట మదెందుకో, తెలియ రాదు నవాబుల చిత్తవృత్తి, ము
ప్పేటల కంఠసీమ పెనవేసిన రాగవియోగ దుఃఖముల్
మాటల బోక యద్భుత కళాస్థితి గాంచుట సాజమేకదా!

ముప్పదియేండ్లు వార్చిపడ పోసిన నీదు కళాతపస్సు, యీ
యొప్పుల కుప్పగా ప్రభవ మొందిన నమంచిత ప్రేమవార్థికిన్
దెప్పలు కట్టె, సుప్రణయ, దివ్యకథామయ కావ్య పత్రముల్
ద్రిప్పెను, షాజహాన్! కడు తరించితి వీవొక ధన్య జీవివై!

బేగము పాదుషా పెదవి వీడిన యంత్యపు కోర్కె నోటికిన్
బీగము వేయ మార్బలుక నేరక, గ్రుక్కము మ్రింగి షాజహాన్
త్యాగము చేసి ప్రేయసి పదంబులు సాక్షిగ బ్రహ్మచర్య దీ
క్షాగతి గాంతు నింకనని స్మారక చిహ్నము గూర్తునం చొగిన్.

తీయని గుండెలో వలపు తీగలు సాగుచు విస్తరిల్లి దీ
ర్ఘాయువు బోసి కొన్నదని యాసిలు నాతని యాశ గంగపా
లాయె; విషాద ఘోర విష దావృత దుర్దినమయ్యె మానసం
బాయతి శూన్యమయ్యెను ప్రియాంగన లోకము వీడినంత నే.

చేదయి పోయినట్టి తన జీవితమం దనురాగ లేశ నం
పాదన దుర్లభంబని క్రమక్రమ మాత్మఁదలంచి యెట్టిదా
యాదులనైన కేల్మొగుచు నట్టి కళామయ దివ్య సృష్టికిన్
బాదుమహా పునాదియిడి నాడు ప్రియాంగన కాత్మ శాంతిగాన్.

*　　*　　*　　*　　*

రప్పించెన్ వడి పారశీక గురు శిల్పా చార్యులన్, వేగదాఁ
దెప్పించెన్ శశి కాంతపుం శిలలు ముం దే పంపె వజ్రాలకై
గప్పించెన్ యమునా తటంబు సికతా గారంబుగా, కోటులే
గుప్పించెన్ త్రిదశాబ్దముల్ నవకళా కోశ ప్రలో భాత్ముడై

జల యంత్రంబులు మోరలెత్తి నలిలో చ్ఛ్వాసంబు గావించె, క్రే
వల వర్ధిల్లు గులాబి పెన్నగవు దోపం గన్నుతాటించె, వ్ర
తులతా గుల్మము లండజంబులకు న త్కారంబు గావించె, లో
పలి వైక్రాంత పురాపథంబది నమా ప్తం బయ్యె నానాటికిన్

ఖేదము తోల్కరింపగను గ్రేవల మూగు విషాద మేఘ పుం
జాదులలో తళుక్కని నవక్షణి కాద్యుతి దోచెనంత నా
పాదుమహాకు గట్టెదురు పాటున నిల్చిన ప్రేమ చిహ్న తా
హ్లాద సుధామయైక సువిలాసము కంటికి దోచినంతనే!

*  *  *  *  *

ఈనును రాతిలో మొలకి లెత్తు మనోహర దివ్యశిల్ప సం
తాన లతాంత సంచయ ని తాంత యశఃపరి సౌరభమ్ము ది
జ్మానితమై రహించు శత మాన వసంతము లుద్వహించి, యో
హానిరవద్య మిట్టి రచ నోద్యతి యేరి యుపజ్ఞయో కదా!

లలిత కళా లతాంగి సువిలాస లసన్నవ హేమ కింకిణీ
కలిత పదద్వ యీ చలన కల్పిత సుందర నాట్యవైఖరీ
విలసనముల్ రచించు కను విందుగ, నిందు మరంద మాధురీ
కలరవముల్ చెలంగఁ దిరుగాడు శకుంతము లుర్విజాలపై

*  *  *  *  *

మూడు శతాబ్దముల్ గడిచి పోయిన వార్ధకతా స్వరూపపుం
జాడలు లేవు నీయెడ ప్రశస్త వినిర్మల కుడ్యపాళిలో
నేడును నీడలాను, కమ నీయము నీదుకళా విలాస, మే
వాడు ప్రమోదరూప రస వఝ్ఝరి నీదడు నిన్ను గాంచినన్?

ఈ చతురబ్ధి వేష్టిత మహీవలయస్థసమస్త దేశ యా
త్రాచణశీలు రెందరు కృతార్థులమైతి మటంచు, శిల్ప రే
ఖాచతు రత్వమేర్పడ బ్రకాశిలు నీరమణీయ మూర్తిలో
బూచు కళాసుమాళి దల బూసిరిగారు ప్రమోదముగ్ధులై?

కడు ననురాగవార్ధిపయి గప్పిన చక్కని మేలి పాల మీ
గడ తెర గాని యుద్ది యొక కారుజ రూపముగాదు, గుండెలం
దడరు వియోగదుఃఖపట లాళికి వెన్నెల తేటగాని, క
న్పడునది కేవలాధి గత నవ్యకళామయ మూర్తిగా దొగిన్

కురు విందాలను స్నిగ్ధతం గలుపు నీ కుడ్యాల శోభిల్లు ప్ర
స్తరముల్ సర్వము నొక్క టొక్కటిగ ప త్రవ్యాపృతింగాంచె నీ
పరమాదర్శ విశుద్ధ సుప్రణయ కా వ్యంబందు, కూహూ రవో
త్కరముల్ సత్కవులై పఠించు తమ కైతల్ మాధవ ప్రీతికై

లాలిత రీతియుష్మదుద- రస్థ వినిద్రిత జాతరూప పాం
చాలికయైన రాణిసర నన్, దమి మోఘులు సార్వభౌముడే
లీల రచించె దాను పవ: ళింప సమాధి గతాస్త రమ్య ను
ద్వేల వినిర్మల ప్రణయ వేదికి లేవుగదా వియోగముల్!

రిక్కల జాజిపూల నల రించిన నీలి నభంపు గొప్పపై
జక్కని కప్పుచీర మొుగ చాటుగ దాల్చి త్రియామ కాంత దా
గ్రక్కున చందమామ కపు రంపునివాళు లొసంగ బోలు నీ
కక్కట! యంతనుండి శశి యూరు కృశించి క్రమ క్రమంబునన్.

పొడమిన నానతో దొగరు ముక్కుల చక్కని పేరటాంద్రు నీ
యొడిశయనించు ప్రేమికుల యుగ్మ మదాత్మల మెచ్చునట్లు, పా
డెదు నదె జోలపాట ప్రకటీకృత శౌండి కళా ప్రభావమే
ర్పడ, దివ సంధ్యలన్ మనుజ భాషల కందని భావ పుష్టితోన్

ఒరుగన్ బారిన గోపురాలు, ధరపై నూటాడుపూ దోట, లా
'పిరమి' ద్రూపకలా విశేషరచనా విభూతి, నీ గోటికిన్
సరిగావన్న భవన్నితాంత ముఖవ ర్చస్సంపదల్ యిట్టివం
చెరుగన్ వచ్చునె లక్షణజ్ఞులకు, టాజీ! శిల్పికాజీవమా!



# నిషాపురం

శ్రీ వా. వె. ల. నరసింహారావు

[ఖయ్యామ్ గృహంలో అతని అనుయాయులు త్రాగిన మత్తులో సరస సల్లాపాలాడే కలకలం వినిపిస్తుంది]

వారిలో ఒకడు:—

'మోహంలో పడిపోకుర జీవా
ముక్తిపొంద!' వని పాగిలేవు!

మరియొకడు:—

తరుణి ముంగురుల తావిసోకితే
తలప వెప్పుడా తత్త్వాలు!

మరియొకడు:—

మనో వేదనలు మాయాలంటే
దివాయాసమే తీరాలంటే,

అందరూ కలిసి:—

వినోదాలలో విలాసాలలో
ద్రాక్షాసారమే త్రాగాలి.

ఖయ్యామ్:—ఓహో! ఇచ్చటి ఈ ప్రకృతిలో ప్రతి అణువు ప్రణయావేశంతో నిండివుంది. ప్రతి ప్రాణి తన సన్నిహిత ప్రాణి అనురాగాన్ని అన్వేషిస్తోంది.

సాఖి:—స్వామీ!

ఖయ్యామ్:—(వినిపించుకోకుండా) ఈ ప్రొద్దు పొడుపువేళలో గులాబీ కన్నె మెల్లగా కన్ను విప్పుతోంది.

సాఖి:—స్వామీ, నేనే స్వామీ, సాఖీని!

ఖయామ్:—(ఆమాట వినిపించుకోకుండానే) అదుగో, తెల్లని మంచుబొట్టు ఆమె చిరు సొట్ట బుగ్గ మీద ఒయ్యారంగా వ్రాలింది.

సాఖి:—ఏమిటి స్వామీ, ఏమిటా కవితా సమాధి?

ఖయ్యామ్:—ఈ మలిసంజ వెలుగుల్లో ఆ మంచుబొట్టు ఎంత రమణీయంగా ఉంది. అరె! ఇంతలో ఎంత మార్పు! ఈ చిలిపి చిరుగాడ్పు గులాబీ కన్నెకు గిలిగింతలు పెట్టి మంచు బిందువు సౌందర్యాన్ని మట్టిపాలు చేశాడే!

సాఖి:—అబ్బా! ఖయామ్‌గారూ! మీరు ప్రకృతిలో లీనమై పోతున్నట్లున్నారు. పిలిచినా పలికేటట్లు లేరు!

ఖయామ్—ఆ... ఎవరు! పలకడానికి తీరిక లేదు. పిలిచిన వారికెల్లా వృథాగా సమాధానాలిస్తూ, రగడ పెంచి ఈ అమూల్య సమయాన్ని కోల్పోవడం నా కిష్టంలేదు.

సాఖి:—నేను స్వామీ, సాఖీని! మీ చరణదాసిని... ఒక్క మాట!

ఖయామ్:—నీవా, సాఖీ, రా! ఇదుగో, ఈ నిశ్చల సమాధిలో, ఈ యేకాంతసేవలో ఉన్న సుఖం జీవం, సత్తువలేని మాటల్లో వ్యక్తం చేయకూడదు సాఖీ!

సాఖి:—ఏమిటో స్వామీ! అంతా అగమ్యగోచరంగా ఉంది మీ భాష. నా కర్థంగావడం లేదు.

ఖయామ్:—నిజమే, నీకే కాదు!... సాఖీ, నీవంటి పసి హృదయాలకు ఎదుటివారిని నిండు మనస్సుతో ప్రేమించడం మాత్రమే చేతనౌతుంది. వారి నుండి ప్రేమ చూరగొనడం చేతగాదు. దాని కింకా అనుభవం కావాలి.

సాఖి:—ఔను స్వామీ, ఔను! మీ మనస్సును అర్థంచేసుకు నే స్థాయి నాకు లేదు. నా కున్నదంతా అమాయికమైన యీ శరీర సౌందర్యమే. ఈ వసంత సమయంలో 'వలపులు కలబోస్తూ తీయతల

పుల్కి గారవించే ఖర్జూర మారుతం కౌగిలిలో పుల కించి పోవడం మాత్రమే నాకు తెలుసు. కట్టలు తెగి ప్రవహించే ప్రేమరసపూరాన్ని పానపాత్ర నిండా నింపి మీ పెదవి కందించడం మాత్రమే నాకు తెలుసు!

ఖయామ్:—సాఖీ! నీ హృదయం నా కర్థ మైంది. నీవు హృదయంతో అర్థం చేసుకోవలసింది కూడా అదే!...నా జీవితం అంతా వెచ్చించి నా తపస్సులో నేను పొందిన మహాఫలం ఏమిటో తెలుసా? చిరుచేదు పానకంతో మిళితమై ఎండి పోయిన నా గుండెపై జాలువారిన నీ ప్రణయరసమే! ఇటురా, సాఖీ! మెల్లగా ఇటురా, ఈ పచ్చిక బయ ళ్ళతో గుసగుసలు పోయే గడ్డిపూలను త్రుంచ కుండా రా!

సాఖి:—పువ్వును తుంచితే ఏముంది స్వామీ? నా ఆనందంకోసం పువ్వెంతో మీ ఆనందంకోసం నేనంతేగా? మీ దృష్టిలో వయసు మళ్ళితే జీవితం వాడిన పువ్వేగా! వలపు తెలిసి విరహంతో మరణించే కంటే, అజ్ఞుడై చిరంజీవి కావడం మంచిది స్వామీ!

ఖయామ్:—సాఖీ, ఈ లోకానికీ మనకీ అక్కడే తేడా, ఇదుగో, ఇటు చూడూ! మన ఈ తోట సమ్యంగుండా ప్రపంచాన్ని పరిశీలించు! ప్రతి మానవుడూ విసుగూ విరామం లేకుండా ఒక మహా ప్రస్థానాన్ని సాగిస్తున్నాడు. ఈ మానవులందరూ అజ్ఞులే; వారి గమ్యస్థాన మేమిటో కూడా వారికి తెలియదు. ఏది సాఖీ, ఇటు తీసుకురా, ఒక్కసక్క ద్రాక్షాసవం!...[పానపాత్రలు కదిలిన చప్పుడు]

సాఖి:—ఖయ్యాముగారూ! ధైర్యంగా మీ ముందు నిలిచి మాట్లాడ్డానికే నేను భయపడు తున్నాను.

ఖయామ్:—ఓసి పసిదానా; భయమెందుకు? హృదయం విప్పి మాట్లాడు. నీ పెదవి జారివచ్చే ప్రతి అక్షరం అమృతాక్షరం.

సాఖి:—కాదు స్వామి కాదూ, ప్రపంచ మంతా మనదృష్టిలో గుడ్డిది. కాని ప్రపంచందృష్టిలో మనంకూడా.......

ఖయామ్:—ఓ....ప్రపంచందృష్టిలో మనమూ గుడ్డివాళ్ళమే. మన యీ పెరటి తోటలోని ప్రకృతి అంతా సుఖపారవశ్యంలో మునిగి, మాన మాత్రుల్లో ఆనందాన్ని ఆకాంక్షిస్తాంటే, గుడ్డిలోకం జాగరూకమై అంతులేని తన ఆశయాలకు ఆహుతై పూరుకుంటుంది. మన యీ ప్రకృతి జాగరూకమై ప్రపంచాన్ని పర్యవేక్షణ చేస్తాంటే, ఆ లోకమంతా నిద్రలో నవ్వుకొంటుంది. తెలిసిందా సాఖీ, ఆ లోకానికీ మనకూ ఉన్న అంతరం?

సాఖి:—తెలిసింది స్వామీ, తెలిసింది! తెలి సిన కొద్దీ నాకు అయోమయంగా ఉంది. నేను ఒక్క మాట చెప్తాను వినండీ!

ఖయామ్:—చెప్పు సాఖీ!

సాఖి:—నా అందం ఆనందం ముడుపుగట్టి మీ పాదాలముందు పెట్టాను. కానీ, నాకూ మనస్సూ వివేకమూ అంటూ వున్నాయ్!

ఖయామ్:—ఆ వుత్తమ వస్తువులూ, ఆ వుదార స్వభావమే నీలో లేకపోతే ఈ మూగలోకానికి విజ్ఞానభిక్ష పెట్టే మహాకార్యానికి పూనుకునే వాణ్ణే కాదు. నేనూ లోకానికి చదువుచెప్పాలి. అందు కోసమే నేను నీ దగ్గర చదువు నేర్చుకుంటున్నాను. చల్లని నీ చేతిమీదుగా జారిపడే మధుపారంలోని ప్రతిబిందువూ నా మనస్తాపానికి మందుగా పని చేస్తుంది.

సాఖి:—కాదు ప్రభూ, నేను చెప్పేదిని కాదు. మిసమిసలాడే జవ్వనంలో గుసగుస పొంగే ప్రణయావేశంతో మీ సరసన కూర్చుంటే నాకు నేనుభయమైనట్లే తోస్తుంది. కాని మీబాహువులమడి నుండి సడలి బైటపడిన మరుక్షణమే ఈ నా శరీరం నాకే అసహ్యమౌతుంది. ఆ మరు నిముషమే మీ క్రీ గంటిచూపుల తీవ్రతకు తాళలేక నా బాహ్య సౌందర్యం మీ ఆనందానికి అంకితమౌతుంది. ఈ ఆలోచనల గడబిడతో నా మనస్సు పరితపిస్తోంది ప్రభూ!

ఖయామ్:—సాఖీ నీవు క్రమంగా పిచ్చిదాన వైపోతున్నావ్! ఇదుగో బ్రహ్మానంద సౌధానికి సోపానాలు సవరించే ద్రాక్షాసవం కొంచెం సేవించు అన్ని పరితాపాలూ అంతమౌతాయి.

సాఖి:—అదుగో, ఖయ్యాముగారు నన్ను పరిహసిస్తున్నారు!

ఖయామ్:—ఇందులో పరిహాసమేముంది సాఖీ, ఈ పారశీక నందనవనం అంతా వ్యాపించి వేరుదన్ని నిలిచిన 'సూఫీమతం' గూడా ఈ సత్యాన్ని కాదన లేకపోయింది.

సాఖి:—సూఫీ మతప్రసక్తి యెందుకు స్వామీ, వారు మీవలె భౌతిక సుఖాలకోసమే జీవించమంటు

న్నారా చెప్పండి! దేవుని దర్శించాలంటే వారు దారి ద్రవ్యాన్ని స్వీకరించమంటున్నారు. కానీ...... ప్రభువుల జాగీర్లు అనుభవిస్తూ సుఖంగా విహావలె కాలం వెళ్ళబుచ్చమంటున్నారా? దైవచింతన లేకుండా, జీవితాన్ని లౌకికభోగాలకు బలిచేయమంటున్నారా?......అయ్యో, స్వామీ, ఆవేదనలో ఏమనబోయి ఏమంటున్నానో?

ఖయ్యామ్:—సాఖీ, దేశాన్ని ఆవరించినట్లే సూఫీమతం నిన్ను ఆవరించింది. మనస్సు చిక్కబట్టుకో! (వ్యంగ్యంగా) కొంత దారితప్పితే ఆత్మ పోయి పరమాత్మలో కలుస్తుంది. ఆ తర్వాత నీ విరహాగ్నిలో నేను మిడుతనై మాడిపోతాను.

సాఖీ:—ఖయ్యామ్ గారు, సూటిగా చెప్పలేక పోతున్నారు సమాధానం.

ఖయ్యామ్:—ఔను సూటిగానే చెప్పలేకపోతున్నాను. ఉన్న సత్యాన్ని చెప్తే నీ హృదయం మరింత బాధపడుతుంది.

సాఖీ:—చెప్పు స్వామీ, చెప్పు; ఈ అంతస్సంఘర్షణలో కుమిలిపోయే కంటే అమర సత్యాన్ని అర్థంచేసుకొని ఆనందిస్తాను.

ఖయ్యామ్:—సాఖీ, నావంక చూడు. జీవితమంటే ఏమనుకొంటున్నావ్! ఆశానిరాశల మధ్య జరిగే ప్రణయకలాపం అన్నమాట, జీవితమంతా ఒక రోజా భోగం. పచ్చని చెట్టు ఆకుల మధ్యనుండి గాలి పాటున జారి, మహావేగంతో పరవళ్ళు తొక్కే ప్రవాహంలో పడ్డ నర్గిస్ పువ్వులాంటిది జీవితం. అంత మాత్రంచేత భయపడనక్కర్లేదు. మరొక దృష్టితో చూడు! జీవితమంతా పూర్తిగా వికసించని గులాబీ మొగ్గలో దాగివున్న ఆశారేఖవలె కనిపిస్తుంది. సాఖీ...ఇంత లలితమైన జీవితాన్ని, తాకితే నలిగిపోయే జీవితాన్ని పరతత్త్వ చింతన అనే మిషతో బడబాగ్నికి ఆహుతి గావించడం నా కిష్టం లేదు.

సాఖీ:—(బిగ్గరగా) ఏమంటున్నారుస్వామీ? పరతత్త్వ చింతన బడబాగ్ని వంటిదా?

ఖయ్యామ్:—ఔను సాఖీ! బడబాగ్ని వంటిదే. అందుకనే మోడువారిన జీవితాన్ని కన్నీటిధారలతో తడిపే కంటే, కమ్మని ద్రాక్షాసవంతో తడపడం మంచిదంటున్నాను, ప్రతి జీవికీ నే నందించే సందేశమిదే. అటుచూడూ, మన గృహారామంలో ప్రతి నాడూ నా సందేశాన్ని అక్షరాలా ఆచరిస్తూ వున్నారు. జీవితాన్ని రసమయం చేసుకుంటు న్నారు.

[తిరిగి ఖయ్యాము గారి అంతేవాసులు త్రాగిన మత్తులో చేసే కలకలం]

అందరూ కలిసి:—

జవ్వని వాతెర చవిగని వుంటే
చల్లగ విడువలె నీ మతమూ!
ద్రాక్ష సార మొకగుక్క తాగితే
తలప వెప్పుడా తత్త్వాలు......

ఖయ్యామ్:—సాఖీ, పానపాత్ర ఏదీ, ఒక్క సరకం! (పాత్రల చప్పుడు, త్రాగే గుటకలు)...... .........ఆఁ......ఎవరదీ, అక్కడ! నాయనా, నిజామీ! (నిజామి ఉరూజ్ ప్రవేశం)

నిజామి:—(గద్గదికంగా) ఆఁ...ఆఁ... నేనే స్వామీ, నిజామిని. బజారునుండి ద్రాక్షాసవం తెచ్చాను.

ఖయ్యామ్:—అట్లా దూరంగా నిలబడతావేం నాయనా, రా యిటురా, సాఖీ, ఆ పాత్ర ఇటు అందుకో......

సాఖీ:—(ఆశ్చర్య సూచకంగా) నిజామి, ఏమిటిది? గజగజ వణికిపోతున్నావ్! ఎందుకూ, అట్లా కళ్ళుకూడా చెమ్మగిల్లుతున్నాయ్! ఏం జరిగింది నిజామీ?

నిజామి:—(గద్గదికంగా) ఏమీ లేదమ్మా, ఏమీ లేదు.

ఖయ్యామ్:—(కొంచెం నవ్వు ధ్వనించేటట్లు) నిజామీ, భయపడుతున్నావా? మన ఈ ప్రశాంత సదనంలో భయాలకూ భ్రమలకూ తావులేదు నాయనా!

నిజామి:—స్వామీ, ఈ నిషాపుర వీధుల్లో నేను తలఎత్తుకు తిరగలేకుండా ఉన్నాను.

సాఖీ:—అసలేం జరిగింది నిజామీ?

నిజామి:—ఏం చెప్పేదమ్మా!

ఖయ్యామ్:—చెప్పు నిజామీ!

నిజామి:—స్వామీ,...ప్రభువులైన మలిక్ షా మొదలు, మీ ప్రాణస్నేహితులైన నిజాముల్ ముల్క్ మంత్రిగారివరకూ...అబ్బా! కాదు...అంతే కాదు ...బజారులో బిచ్చమెత్తుకు బ్రతికే ప్రతి బైరాగి వరకూ...అంతా మన శీలాన్ని శంకించేవారే.

ఖయామ్:—(సన్నగా చిన్నగా ఒక నవ్వు నవ్వి) నిజామీ, అంత మాత్రంచేతనే భయపడాలా?

నిజామీ:—అదికాదు స్వామీ! వారు ఘాటుగా ప్రశ్నమీద ప్రశ్న వేస్తూ నోటికివచ్చినట్లల్లా మాట్లాడుతూంటే సమాధానం చెప్పలేక తెల్లపోయాను.

ఖయామ్:—వింటున్నావా సాఖీ, నేను చెప్పలా? ఆ లోకానికీ మనకూ చాలా అంతరం ఉంది. ప్రభువుల అక్కసు నాకు తెలుసు. వారు వట్టి ఆడంబర జీవులు. వారికి గులాములై ఊడిగం చేయడం నా కిష్టంలేదు. ఎప్పుడూ రాశిభేదాలు పరిశీలిస్తూ, గ్రహకక్ష్యా వృత్తాల్లోనే బుఱ్ఱ బద్దలు చేసుకొన్నాను. వారి మనస్సు తృప్తికోసం నా జీవితం యంత్రప్రాయం ఐపోయింది.

సాఖీ:—స్వామీ, మీరు మనస్సులో బాధ పడుతున్నారు.

ఖయామ్:—బాధకాదు సాఖీ, ప్రియమైన నా జీవితంలో సగం భాగం శుష్కమైన శాస్త్రపరిశోధనలో నాశనమైపోయింది. అప్పుడు నన్నీ లోకం దేవుణ్ణి పూజించినట్లు పువ్వులతో పూజించింది. నేను హృదయంలేని రాతిబొమ్మలా తయారయ్యాను సాఖీ! ...లలితమైన నీ శరీర స్పర్శలోనే నాకు చైతన్యం కలిగింది. ఒక పెద్ద హిమప్రళయం వచ్చి సృష్టిని కబళిస్తున్నా కదలని నేను, నీ స్నేహంవల్ల వాలిపోతూ వున్న పూలప్రశాంత హృదయాలకు కన్నీటి కానుక అర్పించ గలుగుతున్నాను.

నిజామీ:—అదికాదు స్వామీ! పవిత్రమైన పారశీక దేశాన్ని నీతి నియమాలు లేని కామసూత్రాలతో ముడివేసి అపవిత్రం చేస్తున్నామట ప్రభూ! మనవల్ల ఈ పదకొండు పన్నెండు శతాబ్దాల కూడలి పారశీక చరిత్రలో మాయని మచ్చగా నిల్చిపోతుందట...అబ్బా! ఆ మాటలు నేను వినలేకపోయాను.

ఖయామ్:—హుం...ఎందుకు నాయనా, ఊరకే అట్లా ఆవేదన పడతావ్? తన బ్రతుకుకోసం ఎదుటి బ్రతుకును బలిగొనే రాక్షసులు గద్దిస్తే జడుస్తావా? తన మనస్సులోని మురికి కుళ్ళా కప్పిపుచ్చుకోవడం కోసం సున్నితమైన పువ్వుల జీవితాన్ని పాడుచేసే ప్రవక్తలెంతమంది లేరు? వారికోసం మన లక్ష్యాన్ని మర్చిపోతామా?

నిజామీ:—ఏమి లక్ష్యం ప్రభూ? బ్రతుకంటే గాలిలో పెట్టిన దీపమని మీరేచెప్తారే, బ్రతికిన రెండు నాళ్లయినా కాస్త పుణ్యమూ, పురుషార్థమూ...

ఖయామ్:—నిజామీ! (గట్టిగా) నామాట విను; వినడంకాదు; నలుగురితో చెప్పు. బ్రతికిన రెండు రోజుల్లోనే ఒక చీకటి రాత్రిని విజ్ఞానపు వెలుగులకోసం వెచ్చించినా, ఒక వెన్నెల రాత్రిని విలాసాలకోసం భోగానుభవంకోసం వినియోగించకూడదూ?.........ఆఁ...సరే! అప్పుడే ప్రొద్దు జారింది. శుష్కవాదాలతో తియ్యని సమయాన్ని పాడుచేస్తున్నాను. సాఖీ...ఏదీ! ఒక్క గిన్నె కెంపు పానకం; గొంతులో తడి ఆరకముందే.

[వ్యక్తావ్యక్తంగా వెనుకటి బృంద గీతి]
జవ్వని నా తెర చివిగని వుంటే,
చల్లగ విడువలె నీ మధువూ
ద్రాక్షాసార మొకచుక్క తాగితే,
తెలప నెప్పుడా తత్వాలు...

* * *

[ఖయ్యాముగారు తన గృహంలో సుదీర్ఘంగా ఆలోచిస్తూ రుబాయత్ వ్రాసి చదువుకొంటూ వుంటారు]

ఖయామ్:—పుడమి ఎడారియైన తలపోయ నెడారిగ, ఇంతలోకైన సాపడి, ఒక చెట్టునీడ మధుపాన మొనర్తువయేని;............పుడమి ఎడారియైన తలపోయ నెడారిగ;......

ఒక స్త్రీవ్యక్తి:—(తలుపు తట్టుతూ) ఖయామ్ గారూ, తలుపు తీయండి.

ఖయామ్:—(ఆ పిలుపు వినకుండా)...... ..............సాఖి ప్రేమడిని సితార మీటుచు అపూర్వముగా ఒక పాటపాడ నాయెడద ద్రవింపదొక్క, రచియింపనో కమ్మని కావ్యఖండముల్.

స్త్రీవ్యక్తి:—(తిరిగి తలుపు తట్టుతూ) ఏమండీ. తలుపు తీయండి.

ఖయామ్:—(పద్యం మననం చేసుకుంటూ ఉంటాడు)

స్త్రీవ్యక్తి:—ఖయామ్‌గారూ, త్వరగా తలుపు తీయండి (తలుపు కొడుతూ)

ఖయామ్:—నిజామీ, తలుపు తీసిరా,

నిజామీ:—(తలుపు తీస్తూ స్త్రీవ్యక్తితో) ఎవరమ్మా నీవు? ఎందుకిట్లా ప్రొద్దుపోయి ఒక్కతెవే వచ్చావ్!

స్త్రీవ్యక్తి:— ఖయామ్‌గారు ఏకాంతంగా వున్నారా?

నిజామి:— ఎందుకమ్మా, ఏకాంతంగానే ఉన్నారు. ఏమిటో దీర్ఘంగా ఆలోచిస్తూ వ్రాసుకొంటున్నారు; రావమ్మా, లోపలకు రా.

ఖయామ్:—(పద్యం మననం చేసుకోవడం ఆపి) నిజామీ, ఎవ రక్కడ?

నిజామి:—ఎవరో యువతి స్వామీ, మీ కోసమే వచ్చారట!

ఖయామ్:—ఆఁ...అయితే వచ్చి యిటు కూర్చోమను నీవు పోయి ద్రాక్షాసవం తీసుకురా... ...అమ్మాయ్, ఎవరు నీవు?

స్త్రీవ్యక్తి—ఎవరినైతే నేం స్వామీ! ఒక అనామధేయురాల్ని. (విషాదసూచకంగా)

ఖయామ్:— ఎందుకమ్మా, అట్లా ఊరకే నిస్పృహ పడతావ్!

స్త్రీవ్యక్తి:—ఔను స్వామీ, ఔను; ఇంత వరకూ నిరాశా నిస్పృహలతోనే ఆకలిదప్పులు తీర్చుకుంటున్నాను.

ఖయామ్:—అసలు సంగతేమిటమ్మా!

స్త్రీవ్యక్తి:—ఏం చెప్పను స్వామీ, సృష్టిలో చీకటి రాత్రులు వెన్నెల రాత్రులూ రెండూ ఉన్నాయంటారు. కానీ, నాకు ఒక్క చీకటి రాత్రులే కన్పిస్తున్నాయ్!

ఖయామ్:—అసలు విషయ మేమిటమ్మా! అయినా, కొంత వయసు ముదిరినవాళ్ళు పలుకవలసిన వేదాంతం జవ్వనపు పొరజారని నీవంటివాళ్ళు పలకడం వింతగా ఉందే? చీకటి రాత్రులంటా వేమిటమ్మా, అటుచూడు, పిండారబోసినట్లు వెన్నెల ఎంత రమణీయంగా ఉందో!

స్త్రీవ్యక్తి:—హుఁ...మీ ఈ చిన్న వుద్యానవనంలోని కొంత వెన్నెలచూచి ప్రపంచమంతటా వెన్నెల వాకలు ప్రవహిస్తున్నా యనుకొంటున్నారు. ఎన్నిసార్లు ఆ కారుమబ్బుల గుంపులో చిక్కి చంద్రుడు కళదప్పి పోతున్నాడో చూచారూ?

ఖయామ్:—అవునమ్మా, ఆ మబ్బు విడిపోతే, అవతల అంతా వెన్నెలే! ఇక ఈ వసంత సమయంలో, ఈ పచ్చిక బయళ్ళమీద మనల్ని మనమే మర్చిపోతాం.

స్త్రీవ్యక్తి:— (ఆశ్చర్యంతో) ఇది వసంత కాలమా స్వామీ! వసంతకాలాన్ని నే నెరుగుదును ఒక వసంతాన్ని కాదు. పది వసంతా లెరుగుదును వసంతకాలం వస్తోంది. ఎండిపోయిన ఆకుల్ని నా ముఖాన దులిపి చక్కా వెళ్ళిపోతుంది.

ఖయామ్:—ఎండిపోయిన ఆకుల్ని ముఖాన దులిపిందాకా ఎందుకు జాగుచేశావమ్మా? చిగురు తొడిగే టప్పుడే జాగ్రత్తపడలేక పోయ్యావ్! కిలకిల కూసే పులుగుల సందడిలో, పిలపిల కురిసే మంచు బిందువుల ముమ్మరంలో, కమ్మని బుల్బుల్ పాటలో హృదయం ప్రతిగలిపి ప్రియుడి ఒడిలో వాలి సోలి పోలేక పోయావ్!

స్త్రీ:—స్వామీ నేను ఆభాగ్యానికి నోచుకోలేదు......(కంఠధ్వని హెచ్చిస్తూ తడబాటుతో) ఆఁ..., నేను భర్తృ పరిత్యక్తను. నన్ని సమాజం వెలి వేసింది.

ఖయామ్:—ఆఁ...ఏమంటున్నావ్ శుభాంగీ!

స్త్రీ:—శుభాంగినా స్వామీ; నేను మీ కండ్లకు శుభాంగివలె కన్పిస్తున్నానా? ఎందుకు స్వామీ, ఎవ రనుభవించడానికి ఈ నా శరీర సౌందర్యం? ప్రియుడు మెచ్చి, ఆదరింపని ఈ నా శరీరంలోని ప్రతి అవయవమూ నా కొక పెద్ద నిప్పు ముద్దలా కన్పిస్తుంది.

ఖయామ్:—(కొంచెము ధ్వని తగ్గించి లోపలో) ఓహో! తిరస్కారముద్రలోకూడా ఈమె నేత్రాలు ఎంత సుందరంగా ఉన్నాయ్! ఈమె స్వభావం ఉద్రిక్తమైనకొద్దీ సౌందర్యం ఊహాతీతమై పోతూ వుంది. మేలిముసుగుగా వేసికొన్న ఆ సన్నని జిలుగు వలిపంలోనుంచి మెల్లగా తొంగిచూచే నల్లని ముంగురులు ఓహో! తెల్లని ఆ ఫాలఫలకంమీద ఎంత నాజూకుగా నాట్యంచేస్తున్నాయ్!

స్త్రీవ్యక్తి:—ఏమిటి స్వామీ, మీలో మీరు మాట్లాడుకొంటున్నారు?

ఖయామ్:—ఆఁ...ఏమీ లేదు, నీగురించే.

స్త్రీ:—నామాటా, ఏమిటది?

ఖయామ్:—ఔనమ్మా, నీస్థితి నాకర్థమయింది. కట్టుకొన్న గాగరా, కాళ్ళమీద జీరాడి పొరాడిగా, మాలోపలికి మెల్లగా అడుగులువేస్తూ వస్తూంటే నీవూ ...ఒక గొప్పపారశీకప్రభువు అర్ధాంగి వనుకొన్నాను. ఆ భాగ్యశాలి జన్మ ధన్యమయిందని కూడా అనుకొన్నాను. నీవూ, నిజంగా అందాలబరిణెవు.

స్త్రీ:—ఏమిటిస్వామీ, అయోమయావస్థలో ఉన్న ఈ అజ్ఞాతజీవికి, ఏదైనా కర్తవ్యాన్ని బోధిస్తారని వచ్చాను. కాని నన్ను మీరిట్లావిపరీతంగా .............

ఖయామ్:—ఇందులో విపరీత మేముందీ? చూచింది చూచినట్లు స్వభావోక్తిలో చెప్తున్నాను. నీవు నవ్వుతూంటే నీ చెక్కిళ్ళమీద ఏర్పడే పల్లపు ప్రదేశాల్లో ప్రణయార్తుడైన ఒకడు తన హృదయాన్ని నిర్భయంగా దాచుకోవచ్చు అదుగో! నీకపోలతిలకం, శాస్త్రపరిశోధనల్లో చికాకైన ఒక మానవుడికి లక్ష్యశుద్ధిని సమకూరుస్తుంది.

స్త్రీ:—ఏమిటండీ, రేయి జారినకొద్దీ, మీ శృంగారవర్ణనా...

ఖయామ్:—ఆఁ... లేదమ్మా, నాకింకా కవితా పారమ్యం సిద్ధించలేదు. నాకు తెలిసిన గణిత శాస్త్ర పరిభాష నిన్ను వర్ణించడానికి పట్టి నిరుపయోగం. ఈ శాస్త్రపరిచయాలవల్ల ఏంతెలుస్తుందమ్మా, నీ వెంత బరువో, ఎంతలావో, కొలతలవల్ల తెలుసుకోవచ్చు. అంతే... కానీ, నీ హృదయస్పందనంవల్ల స్ఫురించె మధురభావనవాటివల్ల వ్యక్తంకాదమ్మా!

స్త్రీ:—ఏమిటిది ఖయ్యాముగారూ, మీ భాష స్పందనాలదాకా స్పర్శలదాకా నడుస్తోంది! మీ మనస్సులోని భావమేమిటో నాకు బోధపడడం లేదు నిరర్థకమైన నా యీదేహం మీకు వర్ణనా యోగ్యంగా కనిపిస్తూందా? నా శరీరంఅంతా నాకొక పెద్ద మంటిబెడ్డలా గోచరిస్తోంది స్వామీ?

ఖయామ్:—నా తత్త్వం నీకింకా బోధపడలేదమ్మా! ఈ విశాలప్రపంచంలోని ప్రతి మంటిబెడ్డనూ చూస్తూంటే, నాకు యుగముల తెరలలో తలవాల్చిన ఒక సుందరాంగి చిరునవ్వు దొంతరలు స్ఫురిస్తాయి. విశాలాకాశంలో ఊగిసలాడే ఆ మబ్బుతునక చూడు! దానిలోనుంచి చివాలున జారిపడే జలకణాన్ని చూస్తూంటే, నాకూ ఒకనాటి పడుచువాని హృదయకుహరంలో పరువెత్తిన వెచ్చని రక్తకణం గుర్తుకు వస్తూంది.

స్త్రీవ్యక్తి:—అబ్బా! మీమాటలలో నిగూఢార్థం నాకేమీ తెలియడంలేదు. మీ విశాల ప్రపంచవిషయాలు నా కెందుకండీ? నన్ను ప్రేమించే వ్యక్తిలేని నాకీప్రపంచంతో సంబంధంలేదు.

ఖయామ్:—నీ కీ ప్రపంచంతో సంబంధం లేదన్నా దానికి నీతో చాలా సంబంధం ఉంది.

స్త్రీ:—అబ్బా, మీ తర్క వేదాంతాల్తో నానోరు మూతపడిపోతోంది.

ఖయామ్:—ఓహో! సుందరీ, అర్థంగాని గీతికలో దాగివున్న అధివాస్తవికకవిభావనవలె నీ నోరు క్రమంగా చిన్నదై, అణుమాత్రమై చివరకు శూన్యమై పోతూంది. నీ సౌందర్యం నిరుపమానం. ఏదీ తేనెలూరే నీవా తెరమీదుగా, మరొక్క మాట!

స్త్రీ:—(బిగ్గరగా) ఖయామ్‌గారూ, దారితప్పుతున్నారు.

ఖయామ్:—దారి తప్పకపోతే ఈ నిశీథంలో ఇక్కడ కెందుకువచ్చావ్?

ఇదుగో, కాస్త ద్రాక్షరసం సేవించు. సరియైన దారి కనిపిస్తుంది.

స్త్రీ:—ఛీ, ఛీ, ఇది పట్టి భోగమందిరం. ఇచ్చట నీతీ, నియమాలు లేవు.

ఖయామ్:—ప్రపంచమే ఒక భోగమందిరమమ్మా! అయితే, మా భోగమందిరంలో నీతీ నియమాలున్నాయ్. ఆ భోగమందిరంలో అవీ లేవు.

స్త్రీ:—చాలు, మీ వితండవాదం. హుఁ..., ఏమయ్యా ఇట్లా ఎంతమంది అమాయికస్త్రీల శీలాన్ని నాశనం చేస్తున్నావ్?

ఖయామ్:—పొరపడుతున్నావమ్మా! నన్ను నీవర్థంచేసుకోలేకపోయావ్. అటుచూడూ.

[సమకటి బృందగీతి వ్యక్తావ్యక్తంగా వినిపిస్తుంది]

[జవ్వనివా తెర చవిగనివుంటే చల్లగ విడువవె నీమురిపమూ]

మాయాగృహారామంలో నివసించే ప్రతియువతి, యువకుడూ పరిపూర్ణమైన ప్రణయాన్ని చూరగొంటున్నారు. ఒకప్రాణియొక్క హింసకు కారణమైన ప్రేమ ప్రేమ అనిపించుకోలేదమ్మా. మాకూ, దయారహితమైన ధర్మంతో పనిలేదు. మాకున్న సంబంధమంతా దయానిబద్ధమైన హృదయంతోనే.

స్త్రీ:—అయితే నాకు మీరు సూచించే మార్గాంతరం?

ఖయామ్ : — మార్గాంతరం ఎందుకమ్మా, నీప్రియుడు నిన్ను నిరసించాడని అన్యమార్గమాలోచిస్తావా? హృదయం కుమ్మరించైనా అతనిలో పరివర్తన తేవాలి.

స్త్రీ:—ఇది సాధ్యమేనా ఖయ్యాముగారూ ?

ఖయామ్:—సాధ్యం కాకేమమ్మా, చూడూ, నాసాఖీ నన్ను నిరసించినా నేను నాసాఖీని నిరసించను. పో, వెళ్ళు, తెల్లవారకముందే ప్రియుణ్ణి నీవాణ్ణి చేసుకో.

[నిజాముల్ ముల్క్ ప్రవేశించిన అడుగులసవ్వడి]

నిజాముల్ ముల్క్:—ఖయాంజీ, ఏం చేస్తున్నావ్?

ఖయామ్:—ఆఁ...ఎవరు? నిజాముల్ ముల్క్ మంత్రిగారా, రండి, కలవని తలంపుగా వచ్చారే ప్రొద్దుపోయి?

స్త్రీవ్యక్తి:—(నిజాముల్ ముల్క్ అనే పేరు వినగానే ససంభ్రమంతో) ఆఁ...క్షమించండిఖయామ్ గారు; నాకిక సెలవు.

ఖయామ్:—అటుకూర్చోమ్మా. నిజామి వచ్చి అందాక పంపుతాడు;......

ఆఁ...నిజాముల్ ముల్క్! స్నేహితుడు ఇన్నాళ్ళకు గుర్తుకు వచ్చాడా?

నిజాముల్ ముల్క్:—గుర్తుకురాకేం ఖయామ్! అందమైన పానపాత్ర, సుందరమైన స్త్రీ కన్పించినప్పుడల్లా నీవు గుర్తుకు వస్తూనేవుంటావ్! పగటివేళ ఎప్పుడు వచ్చినా మీ విందులకు, విహారాలకు శృంగార క్రీడలకు భంగం కల్గుతుందని ఈవేళ ప్రభువుగారి రాచకార్యాలెట్లాగో ముగించి ప్రొద్దుపోయి నీవద్దకు వచ్చాను.

స్త్రీ:—నేను వెళ్తున్నాను స్వామీ!

నిజా:—ఖయామ్‌జీ ఎవరీమె? ఈ అర్థరాత్రి ఒక్కతే ఇక్కడ ఎందుకు ఉంది?

ఖయామ్:—ఎవరో భర్తృపరిత్యక్త, ప్రణయార్తురాలై వచ్చింది.

నిజా:—(వికటంగా నవ్వి) ఉద్ధరించి పంపుతున్నారా స్వామీ?

స్త్రీ:—(బిగ్గరగా) ఎవరో మర్యాద తెలియకుండా అన్యవ్యక్తినిగూర్చి అప్రస్తుతంగా మాట్లాడుతున్నారు.

నిజా:—ఎక్కడిదీ ఈ కంఠధ్వని......... ఎవరు నీవు? (ఆశ్చర్యంతో) నీవా? రాణిసాహెబా? (ఉచ్చైస్స్వనంతో) ఖయామ్, ఈమెఎవరో తెలుసా? పారశీకప్రభువులైన మలిక్ షా అర్ధాంగి.

ఖయామ్:—హాఁ, ఆమె ఇక్కడ అడుగు పెట్టినప్పుడే ఊహించాను; ఎవరో ఒక పారశీక ప్రభువు అర్ధాంగి అయివుంటుందని.

నిజా:—చాలు, నీ వ్యూహాగానం చాలించు; నీ వింతవరకూ పాముతో చెలగాటమాడావ్,...తెలిసిందా?

ఖయామ్:—నిజాముల్ ముల్క్! నేను నాకర్తవ్యాన్ని నిర్వర్తించాను. అంతే!

నిజా:—ఖయామ్, నీ విప్పుడు మాట్లాడేది నీ మిత్రుడైన నిజాముల్ ముల్క్‌తో గాదు. ప్రభువులైన మలిక్ షా గారి మంత్రితో, ఇటు చూడు. ప్రభువులు నిన్ను పాలుపోసి పెంచారు; నీకు జాగీర్లిచ్చి నిన్ను భోగలాలసుణ్ని చేశారు. చివరకు వారి అంతఃపురగౌరవానికే కళంకం ఆపాదించావ్! చాలు నీ కృతజ్ఞత?

ఖయామ్: — నిజాముల్ ముల్క్, త్వరపడుతున్నావ్.

నిజా:—త్వరపడవక్కర్లేదు! స్పష్టంగా అర్థమౌతూంది. ...హుఁ...ఖయామ్, నీమీద నాకుండే మక్కువకొద్దీ, పిల్చి, ఉన్నతమైన రాజోద్యోగమిప్పిద్దా మనుకున్నాను. కాని నీ విట్లా చివరకు .........

ఖయామ్:—ఎందుకయ్యా నీ ఉద్యోగాలు? ఎదుటివారి సహార్థం జేసుకొని మన్నూ మిన్నూ తెలియకుండా మండిపడడానికా? నిజామీ, ఎక్కడ ద్రాక్షాసవం?

నిజా:—ఖయామ్! నీవెంత దుస్థితికి జారిపోయావ్! నీవల్ల పారశీక దేశమాతకే తలవంపులు గల్గాయి.

ఖయామ్:—ఎక్కడ నిజామీ ద్రాక్షాసవం?

నిజా:—హుఁ; ఫిరయాస్‌వంటి పరాక్రమవంతులుద్భవించిన వీరభూమిలో నీవంటి భోగశీలురుద్భవించడం అవమానకరం. అవెస్తా, ఖురాన్ వంటి పవిత్రగ్రంథాలు చదివి పునీతులైన పారశీకులు నీ ప్రేమసూత్రాలు పఠించి పతితులౌతున్నారు.

ఖయామ్:—ఓహో మిత్రుడా ఎంత చక్కని కవితాగానం! నిజామీ ఒక్కగుక్క మధుపానం (త్రాగినగుటకలు, పానపాత్రలు కదిలిన సవ్వడి) (తూగు మైమత్తులో)—

'మనో వేదనలు మాయాలంటే,

దివాయామ పమే తీరాలంటే
వినోదాలలో విలాసాలలో
ద్రాక్షాసారమే త్రాగాలి...'

నిజా:—ఛీ, మందభాగ్యుడా! పారశీక కవిత్వానికి రసపుష్టి కూర్చిన ఫిర్‌దౌసివంటి మహాకవుల కావ్యాలు విన్న చెవులతో నీ త్రాగుబోతుగీతాలు విన వలసి వచ్చింది. కళలకు కాణాచియైన పారశీకం నీవు ప్రతిష్ఠించిన పానశాలవాసనలతో వాసయోగ్యం కాకుండా పోతూంది.

ఖయామ్:— నిజాముల్ ముల్క్, అబ్బా .. ఇప్పటికి ఆవేశంతో నిండినకవితావిషయాలు మాట్లాడ గల్గుతున్నావ్: రససిద్ధి పొందాలంటే...కొంచెం... ద్రాక్షాసవం.

నిజా:—హుం...నిన్ననిప్రయోజనం లేదు. నీవు వట్టి ఉన్మాదుడవు. కానీ ... అన్నిటికంటె ఎక్కువగా నా హృదయానికి కల్గిన ఆఘాతం ఒక్కటే. అభిజాత్యగౌరవం గల మలిక్ షావంటి ప్రభువుల శుద్ధాంతంలోని ఒక కులీనస్త్రీ,...అంతే కాదు...వారి దేవేరి ఇంతటి నీచానికి పాల్పడుతుందని నేనెప్పుడూ అనుకోలేదు.

రాణిసాహెబా:—(గట్టిగా) మంత్రీ, మీరు ప్రభువుగారి అర్ధాంగి ఆంతరంగికవిషయాల్లో అనవసరంగా జోక్యం కలుగజేసుకొంటున్నారు.

నిజా:—రాణీ సాహెబా! మీ ఆంతరంగిక విషయాలికి కట్టిపెట్టండి. వంశప్రతిష్ఠనీ, దేశగౌరవాన్నీ సమూలంగా నాశనంజేసే ఆ ఆలోచనలూ రాణిగారి ఆంతరంగికాలైనా వాటితో మంత్రులకు జోక్యం ఉన్నది.

రాణి:—మంత్రిగారూ, మీ మాటలు రాజకుటుంబంపట్ల మీకున్న భక్తిగౌరవాల్ని మాత్రమే సూచిస్తాయ్. కాని మీ విజ్ఞానవివేకాల్ని ఏమాత్రం సూచింపవు. ఇంతవరకూ మీరు మీ భావనకు అందిన చరిత్ర అంతా గాలించి ఖయ్యాముగారిని దూషించినా, మిమ్మల్ని వారొక్కమాటైనా అనలేదు.

నిజా:—రాణిసాహెబా, తప్పుచేశానని తెలుసుకొన్నప్పుడు అతడు ఖయామైనా, ఆమె మరి యేరాణి ఐనా, తలివాల్చి దూషణ భరింపవలసిందే. అందులోనూ, ఎప్పుడూ, తాగినమత్తులో తూగే ఇతనికా దూషణభూషణాలు?

రాణి:—మంత్రి, త్వరపడి ఖయ్యాముగారిని తూలనాడబోకండి. అసలు జరిగిందేమిటో తెలిస్తే? మీరిట్లా ఆవేశపడేవారు గారు. ఇటుచూడండి మంత్రీ! నేను ప్రభువుగారి ప్రతిష్ఠకు భంగంకలిగే ఏపనీ చేయలేదు. ఖయాంగారి శీలం పరీక్షించడం కోసం మీ మలిక్‌షా ప్రభువులే నన్నిట్లా పంపారు.

నిజా:—(సన్నగానవ్వి) ఏమంటున్నారు రాణి సాహెబా? మీరు చెప్తున్నారు కాబట్టే మీమాటలు నేను విశ్వసించాలా?

రాణి:—నమ్మలేకపోతున్నారామంత్రీ, మీరూ వట్టిపట్టుదల మనుష్యులు. ఈ ప్రక్క చూడండి. ఈసున్నంగుండా అటుచూడండి. మన కుడిచేతివాలుగా ఆ కనుపించేతోటలో, ద్రాక్షపందిరి ప్రక్కగా పండు వెన్నెల్లో పచార్లు చేస్తున్న ప్రభువులు ఎవరో చెప్పండి?

నిజా:—(ఆశ్చర్యంతో) ఆఁ......మలిక్‌షా ప్రభువులు?

రాణి:—మలిక్‌షా ప్రభువులేనా? ... ఇక్కడ ఖయ్యాముగారిగృహంలో చీమ చిటుక్కుమన్నా వారికి స్పష్టంగా కన్పిస్తుంది.

నిజా:—నన్ను నేను నమ్మలేకపోతున్నాను రాణిసాహెబా?

రాణి : — ఇంకా నమ్మలేక పోతున్నారా మంత్రీ!

నిజా : — నమ్మలేక పోవడం కాదు రాణి సాహెబా? నా కిప్పుడు సర్వం బోధపడుతోంది. అబ్బా! ప్రభువుల యీ పరిపాలనాదక్షత, నిప్పువంటి ఈ మీశీలమే లేకపోతే పారశీక మెప్పుడో పాడుపడి పోయేది. ఆవేశంలో ఏమేమో అన్నాను. నన్ను క్షమించండి.

రాణి:—మంత్రీ, ఖయ్యాముగారు, మీరూ, మేమూ ఊహించినంత దుశ్శీలురుగాదు. వారి వాదానికీ, మతానికీ త్రోవ లేనన్నా ఉన్నాయ్...... ఖయ్యాముగారూ! ప్రభువులు నాకోసం బైటవేచి వున్నారు. మీ వాదవిధానమంతా చెప్పి వారిని ఆనందపరవశుల్ని చేస్తాను. స్వామీ సెలవు.

ఖయామ్:—రాజ్ఞీ పోయిరా! నీరాజుప్రక్కగా నీవాయనను స్పృశిస్తూ, ఒయ్యారంగా నడిచి పోతూంటే నేను చూచి ఆనందిస్తాను.

నిజా:—ఖయామ్‌జీ, నీవేది మాట్లాడినా మునుసులో దాగి మాట్లాడుతావ్! అందుకనే నీతత్వం లోకానికి సువ్యక్తం గావడంలేదు. నావరకు నేను నిన్నింతవరకూ అర్థం జేసుకోలేకపోయ్యాను. బ్రదుకు కోసం నిత్యం పాపాలలో మునిగితేలేది ఈ జడ ప్రపంచంమిమ్మల్ని అసలు అర్థం జేసుకోలేదు.

ఖయ్యామ్:—మిత్రుడా, పాపాలనీ, పుణ్యాలనీ కోమలమయిన మనస్సును హింసించకూడదు. అయినా పాపం చేశామేమోనని భయమెందుకు? అటువంటి తప్పుదారులకులాగే మనస్సును భగవంతు డెందుకు సృష్టించాలి?

నిజా:—ఖయ్యాంజీ, భగవంతుణ్ణవలోకించండి. ఆయన స్వభావం చాలా చిత్రమయింది పాపపుజీవిని సృష్టించడం ఆయనకు సరదా. సృష్టించి, ఆజీవిని పవిత్రం చేయడం ఆయనకు మరీ సరదా. దేవుడు దయాశీలుడు సుమా!

ఖయ్యామ్:—దయాశీలుడా దేవుడు? అయితే లోకంలో కనిపించే ఈ కష్టనష్టాలకు కారణం? కావాలని మోజుపడి సృష్టించిన ప్రకృతిని తానై దగ్ధంచేసే దేవుణ్ణి దయాశీలు డినటంకంటె పిచ్చివాడనటం మంచిది. శైలిస్య ముట్టిపడే శిల్పాన్ని మలిచిన కళాతపస్వి తన చేతుల్తో దాన్ని పాడు చేయగలడా?... ఆc...సరే, ఈ సృష్టివాదాలకేమిలే, అదుగో, అటు చూడు. రాణి రాజును కలుసుకొన్నది. రాజు ఆమె హస్తాన్ని పట్టి దగ్గరకు తీసుకొంటున్నాడు.

నిజా:—అది కాదు ఖయ్యామ్; ఎంతసేపుమాట్లాడినా సృష్టినిగూర్చీ లయాన్నిగూర్చీ ముచ్చటిస్తారుగాని, ఆత్మనుగూర్చి మాట్లాడ రేం?

ఖయ్యామ్:—ఏమిటేది నిజాముల్ ముల్క్? అటు చూడు! ఆ ద్రాక్షపందిరిప్రక్కగా రాజూ రాణీ మెల్లగా అడుగులువేస్తూ, తోటబైటకు వస్తున్నారు.

నిజా:—ఖయ్యాం, ఎప్పుడూ ఒకటే పాట, నా ప్రశ్నకు జబాబు లేదా?

ఖయ్యామ్:—ప్రశ్నలూ, జబాబులూ, ఇంతేనా ...అదుగో, ఆ తోటమలుపులో వారిద్దరూ ఎందుకో ఆగారు. మలిక్‌షా వట్టి చిలిపివాడు సుమా! రాణి హాహాబామీద ముద్దులవర్షం కురిపిస్తున్నాడు.

నిజా:—ఖయ్యాంజీ, నాకు మళ్ళీ కోపం గల్గిస్తున్నారు. నాకు జబాబు కావాలి.

ఖయ్యామ్:—ఏం జబాబయ్యా.

నిజా:—ఆత్మ భగవదంశమని ఒప్పుకుంటారా?

ఖయ్యామ్:—నిజాముల్ ముల్క్! వట్టి రాజనీతికోవిదుడవే అనుకున్నాను. నీకు వేదాంతం పిచ్చికూడా వుంది. అసలూ ఆత్మ అంటూ ఒకటుందా? చెప్పు...అబ్బా, మళ్ళీ నా సౌందర్యోపాసననుండీ నన్ను ప్రక్కకు లాగుతున్నారు. ఓహో, రాణి రాజు చేతిలో పువ్వువలె నలిగిపోతూ వుంది. నలిగిపోయిన కొద్దీ ఆమె అందం యినుమడిస్తూంది. అదుగో, రాజు చేతుల్లోనుంచి ఆమె కోడె త్రాచులా క్రిందకు జారి చివుక్కున లేచింది. అబ్బా, సాకీ, ఎక్కడున్నావ్, ఈ తీయని వేళ...

నిజా:—ఖయ్యాం, ఈ పారవశ్యమే నీ తత్త్వానికి అందం తెస్తూంది.

ఖయ్యామ్:—అయ్యో, వారప్పుడే చాలాదూరం పోయారు. ఆ నాపప్రక్క ఇసుకతిన్నె మీదగా... అదుగో, ఒకరిచేతులొకరు పెనవేసుకొని నడిచిపోతున్నారు. ఆహా! వారి పాదవిన్యాసంలో నాకు నవజీవనమార్గాలు కన్పిస్తున్నాయ్. సాకీ, ఎక్కడా నీవు, ఈ కమ్మని సమయంలో దగ్గర లేకుండా?

నిజా:—ఖయ్యామ్, నీస్వభావం నాకు ఆశ్చర్యం గొల్పుతూంది.

ఖయ్యామ్:—నిజాముల్ ముల్క్, ఆ సోఫామీదనుంచిలే, వారు మనదృష్టికి అందకుండా పోతున్నారు. బయటకు పోదాంపద. సాకీ, ఏం చేస్తున్నావ్, వస్తున్నావా, రా, అదుగో గగనగమెరిసే వారి రాజప్రాసాదం వారు చేరుకున్నారు. వెన్నెల వెలుగుల్లో, తెల్లగులాబీరేకుల క్రింద, అటునిటు ముసలే నల్లని నీడలా,...ఆc...కాదు కాదు.... చంద్రుణ్ణి చాటుచేసికొని సిగ్గుతో వాలిన చుక్కకన్నెలా, రాణి దృశ్యాదృశ్యయై పోతూంది. సాకీ, ఎక్కడ నీవు.

నిజా:—ఖయ్యామ్, నీవూహ అమోఘం. నీవు నిజంగా రససిద్ధుడవు.

ఖయ్యామ్:—ఆహా, వారిని మాస్తూంటే నాకు కవినిగా లేనన్న భయం తీరిపోతోంది. సాకీలే, సితార తీసుకో, తీవలు శ్రుతిచేయ్ ఇంకా అనుమానిస్తున్నావా? (సితారా శ్రుతిసమ్మేళనంతో)

'అనుమానింపగ తావులేదట,
విలాసార్థమ్ముగా నిట్టి జీ
వన శృంగారవనమ్ములో వలపు
తీవల్ పాగ, ఉయ్యాలలూ
గిన నీతోడిద నాకు స్వర్గము
లతాంగీ, లెమ్ము లేలెమ్మికన్
సానలై సెమ్మది పొంగి వచ్చు
కవితాస్రోతస్సులం దేలెదన్.'

నిజా:ఖయ్యాం, నీ ఆశయాలూ, ఆదర్శప్రాయాలైనా కాకపోయినా, నిషాపురంలో చివురు తొడిగిన నీ కవితాలతమాత్రం లోకాలకు సాగి కమ్మని వాసనలు చిమ్ముతుంది.

# ముమ్మడి కులోత్తుంగ చోళదేవుడు

(క్రీ. ౧౧౭౮-౧౨౧౬)

★

శ్రీ భావరాజు వెంకటకృష్ణారావు

చాళుక్య చోళ చక్రవర్తులలో కడపటివాడు ముమ్మడి కులోత్తుంగ చోళుడు. ఆతడు శిథిలమంతయు, చితికి చెదరిపోవుచున్న చోళ మండల సామ్రాజ్యమును రక్షించుకొనుటతో గడచి పోయెను. తెనుగు చోడు లొకవంక బలవంతులయి, చాళుక్య చోళ చక్రవర్తిని ఎదిరింపసాగిరి. పొత్తపి నుండి తమ రాజధానిని విక్రమ [చోళ] సింహపుర మైన నెల్లూరికి మార్చుకొని విజృంభింపసాగిరి. కులోత్తుంగ చోళుని ఎదిరించి స్వాతంత్ర్యమును ప్రకటింప సాహసించిరి. కులోత్తుంగునకు శక్తిచాలమి మిన్నకుండుట సంభవించెను. వెలనాంటి రాజేంద్రచోడుని రాజ్యమందుగూడ నట్టి విపరీతపరిస్థితు లేర్పడెను. వీరరాజేంద్ర చోడుడు వృద్ధుడయి, మరణించుటకు పూర్వము రాజ్యభారమును తన కుమారుడయిన మూడవ గొంకరాజునకు నొప్పగించెను. శాసనము లందు మూడవ గొంకరాజు కులోత్తుంగ చోడ గొంక రాజని వ్యవహరింపబడెను. ఇమ్మడి రాజేంద్ర చోడు నికి ప్రధానియు సంధి విగ్రహియునగు నందూరి కొమ్మనమంత్రి గొంకరాజునకుగూడ రాజ్యతంత్ర ముఖ్యుడై రాజ్యభారము బూనియుండెను.1 ఆనాడు వెలనాంటి రాజ్యము మహేంద్రగిరి మొదలుకొని కాళహస్తి పర్యంతము వ్యాపించియుండెను.2 కొమ్మన మంత్రి వెలనాంటి రాజేంద్రచోడ, కులోత్తుంగ చోడ గొంకరాజుల ఆజ్ఞచొప్పున పాకనాడిరువదియొక్క మండలమును రాజప్రతినిధిగా కూడ పాలించెను.

వీరరాజేంద్ర చోడుని చివర కాలమునాడును, కులోత్తుంగ చోడ గొంకభూపతి కాలమునాడును, "సమధిగత పంచమహాశబ్ద మహామండలేశ్వర, ఎల రాయ సింహ" ఇత్యాది ప్రశస్తి సహితులయిన కొండ పడుమటి బుద్ధరాజు రాజ్యమున బలవంతుడయిన మహా సామంతుడై రాజ్యచక్రము ద్రిప్పుచుండెను. దానికి గల ముఖ్యకారణము, కొండపడుమటి శాసనులకు వెలనాంటి రాజ్యవంశముతో గల బంధుత్వము గా తోచును. రాజేంద్ర చోడుడు తన యగ్రమహిషి గుండమదేవులు గతించిన వెనక కొండపడుమటి బుద్ధ రాజు చెలియలు అంకమదేవి లేక అక్కాంబికను పెండ్లియాడెను. ఆ దంపతులకు కులోత్తుంగ చోడ గొంకరాజు జన్మించెను. అతడు రెండవ కులోత్తుంగుని కాలమున బుట్టుటవలన గాబోలు "కులోత్తుంగచోడ" పదము అతని పేరుకు చేర్చబడెను. కులోత్తుంగ చోడ గొంకరాజు కొండ పడుమటి బుద్ధరాజు కూతుని జాయాంబికను ద్వాహమాడెను. ఆ దంపతుల కుదయ మయ్యెను పృథ్వీశ్వరుడు. వెలనాంటి రాజులలో నాతడు కడపటివాడు.

మూడవ గొంకరాజు, తండ్రి మరణించుటకు పూర్వము నాలుగు సంవత్సరములు రాజ్యాభిషిక్తు డయ్యెను. అతని రాజ్యకాలము క్రీ. శ. ౧౧౭౦ సంవత్సరమున ప్రారంభమయి ౧౧౭౮ లో ముగిసెనని యూహింపవచ్చును. గొంకరాజురాజ్యకాలమంతయు నిరంతర సంగ్రామములతో గడచిపోయెను. ఒకవంక దక్షిణమునుండి తెనుగు చోడులు వైరముబూని తమ రాజ్యమును పాకనాటిలోనికి విస్తరింపజేసి, వెల నాంటి రాజ్యమునకు భంగము కలిగించుచుండిరి.

1. కేయూర బాహుచరిత్రము.

2. కేయూర బాహుచరిత్రము. *S. I. I. Vol. VI. No.* 211 ఈ శాసనమందు గొంకరాజు పరిపాల నము శ. ౧౦౭౦ కు బూర్వము ప్రారంభమయినట్లు సూచనగలదు. గొంకరాజు పరిపాలన మిందు ఉదాహ రింపబడెను.

కమ్మనాటి తెనుగుచోళులు తమకు సన్నిహితులు బంధువులు, స్వజాతీయులునైన పొత్తపి తెనుగు చోడుల తలంపులు ప్రయత్నములు సాగుటకు సాయ పడుచుండిరి. ఒకవిధముగా స్వామిద్రోహపరాయ ణులై వర్తించుచుండిరి. పడమటను కళ్యాణ కటక మందు కల మర్త్య చాళుక్యరాజ్యము అంతరించిన కారణమున, అనుమకొండ రుద్రరాజు (క్రీ. శ. ౧౧౬౦-౧౧౯౬) విజృంభింప సాగెను. అతని ధాటికి నిలుచు వారు లేనందున, రుద్రరాజు పూర్వాంధ్ర దేశముపై కన్ను వేసియుండెను. అతడు నతవాడి చతుర్థకుల దుర్జయ రాజవంశముతో బాంధవ్యము నెఱపి వారి వారిని తన కిష్టులను జేసుకొనెను. నతవాడి బుద్ధరాజు కుమారుడు రుద్రరాజుకు కాకతి రుద్రుడు తన తమ్ముడు మహాదేవరాజుకూతురు మైలమదేవి నిచ్చి పెండ్లిజేసెను. ఈ బంధుత్వ మేర్పడిన కారణమున నతవాడి రుద్రరాజు, వెలనాంటి కులోత్తుంగ గొంక రాజును, అతని తరువాత పృథ్వీశ్వరునకు సామం తుడై యుండినను, కాకతి రుద్రరాజుపక్షము నే యవలంబించుచు, వెలనాంటిరాజ్యము విధ్వస్తమగుటకు కూడ తోడ్పడియెను. కులోత్తుంగ గొంకరాజు మహా పరాక్రమశాలియు, సమరసమయ కౌండుడు నగుట చేతను వెలనాంటి రాజ్యము. అనాటికింకను బలీయమై యుండుటవలనను కాకతి రుద్రదేవుడు, పైకిమాత్రము మిత్రభావము ప్రకటించుచు, లోలోన వైరమును తల పోయుచు, తరుణమునకై వేచియుండెను. అతని దేవులు నన్నమదేవి యొకసారి దక్షారామమున కేతెంచి క్రీ. శ. ౧౧౪౦ సంవత్సరమున కుంభమాసమున శ్రీ భీమేశ్వర మహాదేవునకు అఖండవర్తి లోహ దండు దివియ నొక్కంటిని సమర్పించెను.1 ఆనాడు కాకతి రుద్రదేవరాజుకూడ దక్షారామమునకు వచ్చి యుండవచ్చును. కాని అతని శాసనము కానరా కున్నది.

వెలనాంటి రాజ్యమున కీరీతిగా మూడు వైపు లందు విరోధులు ప్రబలుచుండ, పల్నాడు మాండలిక రాజ్యమందు విపరీతములు బుట్టెను. పలనాటిని ఆనాడు హైహయవంశ మొకటి సామంత నృప చిహ్నములు గలిగి పరిపాలించుచుండెను. హైహ యులు ఆత్రేయ గోత్రజులగు సుక్షత్రియులయినను, చతుర్థకులమువారైన వెలనాంటి ప్రభువులతో సంబంధ బాంధవ్యములు గల్గియుండిరి. వెలనాంటి ఇమ్మడి గొంకరాజు (కులోత్తుంగ చోడ గాంగేయ గొంక రాజు. క్రీ. శ. ౧౧౩౨-౧౧౬౧) కూతురు మైలమ దేవి పలనాటి అలుగు లేక అనుగు భూపతికి పట్టపు దేవి. ఆ దంపతులకు నలగామరాజని రెండవ పేరుగల వీరకామనృపతి జన్మించెను. అనుగురాజు క్రీ. శ. ౧౧౬౭ సంవత్సర ప్రాంతమున మరణించెను. అతడు మరణించునాటికి వీరకాముడు, బాలుడు. అతడు యుక్తవయస్కుడగువఱకు పల్నాటి మాండలిక రాజ్యమును మంత్రి దొడ్డనాయుడు, తరువాత అతని కుమారుడు బ్రహ్మనాయుడును శాసించిరి. నలగాముడు యుక్తవయస్సు వచ్చినతరువాత రాజ్యభారము తానే బూనెను. అది బ్రహ్మనాయునికి సమ్మతము గాకుం డెను. తన యాధికారము తొలగిపోవుట కాతడిష్ట పడక, నలగామరాజునకు అతని సవతి తమ్ములు పెద్ద మలి దేవ పినమలిదేవరాజులకు నడుమ వైరము పెంచి, తాను పెదమలిదేవ పినమలిదేవుల పక్షముబూని రాజ్యము పంచియిమ్మని తగవు పెట్టుకొనెను. నలగామరాజు రాజ్యము పంచియిచ్చుటకు సమ్మతింపకుండెను. నల (వీర) కామునికి మంత్రిగా కుదిరిన నాయకురాలు వీరకామునికిని యాతని మరియొక సవతి సమ్ముడు నరసింహునికి సుస్థిరమైత్రి కల్గించి, బ్రహ్మనాయని యెదిరించి, నలగామునిచేత పలనాటి మండల రాజ్య మున పాలింపజేసెను. బ్రహ్మనాయుడు కోడిపోరునం దోడి, మలిదేవాదుల పక్షమున సమయము జేసికొని, ఏడేండ్లు పరస్థలములందు, త్రిపురాంతకము చెంత మేడపియందు పరవాసముచేసి, తిరిగివచ్చి, తన సంర క్షణలోనున్న మలిదేవ రాజాదులకు రాజ్యము పంచి యిమ్మని మరల నలగామునికి సందేశమంపెను. నల గాముడు రాజ్యమును పాలోసగక, యుద్ధసన్నద్ధుడై వచ్చిన బ్రహ్మనాయని సైన్యమును కారెమపూడి రణ క్షేత్రమున గదిసెను. శౌర్యమూర్తులయి విజృంభించిన వీరులు పెక్కండ్రు సమరస్థలిని గూలిరి. బ్రహ్మ నాయడు పరాజయమంది పలినాడు విడచి వెడలి పోయెను. విజయుడై వీరకాముడు సుఖముగ కొంతకాలము పల్నాటిని శాసింపగల్గెను. కారెంపూడి యుద్ధము జరుగుటకు పూర్వము కొంత కాలమునుండియు వెలనాంటి కులోత్తుంగ చోడ గొంకరాజు, పల్నాడున జరుగుచుండిన విపరీత పరి స్థితులను అరికట్టి బంధువులయినవారిలో పుట్టిన అంతః కలహములను బాపజాలకపోయెను. అనాడు మూడవ గొంకరాజు దృష్టియంతయు దక్షిణమునందే తెనుగు

1. *S. I. I. Vol. IV. No. 1095.*

2. పల్నాటి వీరచరిత్రమందు ఈ చారిత్రక గాథయంతయు తెలుపబడియున్నది.

చోడుల దాడులను, పడమటనుండి కాకతి రుద్రరాజు ప్రతికూల చోర ప్రవర్తనలను ఎదుర్కొని వెలనాంటి మహారాజ్యమును సంరక్షించుకొనుటలో నిండి యుండెను. పల్నాటి సీమయందు జరిగిన అంతర్విప్లవము కారణముగా, ఆకస్మికముగ సంభవించిన కులోత్తుంగ చోడ గొంకరాజు మరణము కారణముగా, వెలనాంటి మహారాజ్యము సడలి కూలిపోవసాగెను.

పిఠాపురము కుంతీ మాధవస్వామి గుడిలోనున్న వెలనాంటి పృథ్వీశ్వర మహారాజు శిలాశాసనమును[1] పరికించిన నందు గొంకరాజు పరిపాలనము ఏరీతిగా సాగినదియు కొంతవఱకు నూహింపవచ్చును. పల్నాటను నలగామరాజు సవతి సోదరులతోను బ్రహ్మనాయునితోను ప్రతిఘటించియు, తన రాజ్యమందు బ్రహ్మనాయుడు లేవదీసిన సాంఘిక, మతవిప్లవములను అణగద్రొక్కజాలకపోయెను. ఆ విప్లవకాలమును పురస్కరించుకొని, దక్షిణమున తెనుగుచోడులు విజృంభించి పాకనాటను ప్రవేశించి ప్రజల సంక్షోభింప జేయసాగిరి. తెనుగు చోడులను బలిమిచాటించి అణచివచ్చునంతలోపల, పల్నాడు రణరంగముగా మారిపోయెను అది యదనుగా జూచుకొని కాకతి రుద్రరాజు, మిత్రునివలె ప్రవర్తించుచు నలగామ భూపతికి కొంతసైన్యమును సహాయముగా బంపి, బహుళ సైన్యముతో పూర్వాంధ్ర దేశమును జొచ్చి కృష్ణా గోదావరి నదుల నడుమనున్న దేశమును స్వాధీన పఱచుకొని దక్షారామ పర్యంతము జొచ్చుకొని పోయెను.[2] ఆ సమయమున తన విరోధభావము వెలిగి, ఎప్పుడు వెన్నంటి తఱుముకొనుచువచ్చి పైబడునో యను భీతిని, తన మహాప్రధాని మల్లల వేమాద్రిరెడ్డిని, విశేషసైన్యమిచ్చి, కులోత్తుంగ చోడ గొంకరాజు తిలపడి మోడింప వలయునని యాదేశించి పంపెను. కృష్ణకు దక్షిణపుటొడ్డున నెక్కడో గొంకరాజునకు వేమాద్రిరెడ్డికిని భీకర సంగ్రామము నడచెను. అందు గొంకరాజు ఓడుటయు, వేమాద్రిరెడ్డి విజయము పొందుటయు సంభవించెను. అది క్రీ.శ. ౧౧౮౭ వ సంవత్సరమున జరిగియుండునని యూహింపవచ్చును. మల్లల వేమాద్రిరెడ్డి ఈ యుద్ధము జరిగినతరువాత పలు బదియేండ్లకు పైగా జీవించియుండి, దాక్షారామ భీమేశ్వరునకు అఖండవర్తి దీపదానమును చేసి దానశాసనము వ్రాయించెను. దానియందు, తాను కులోత్తుంగ చోడ గొంకరాజును సంగ్రామ రంగమున జంపినట్లు, "కులోత్తుంగరాయ రాజేంద్ర చోడ గొంకదిశాపట్టు" అని బిరుదము వేయించుకొనియుండెను.[3] గొంకరాజు, మరణించుట, కాకతి రుద్రరాజు దాక్షారామ శిలాశాసనమునకు బూర్వము జరిగియుండవచ్చును. ఆ శాసనమందు గొంకరాజు ప్రశంసలేదు. అందు[4] చాళుక్య చోళ చక్రవర్తి యగు కులోత్తుంగుని విజయరాజ్య వర్షము దాహృతమైనది. యగు కులోత్తుంగుడు రాజ చాళుక్యనామముతో సర్వలోకాశ్రయ శ్రీ విష్ణువర్ధన మహారాజని పేర్కొనబడినాడు. దానినిబట్టి కాకతి రుద్రరాజు కులోత్తుంగ చోడ గొంకని సార్వభౌమునితో, ఆంధ్ర దేశాధీశ్వరునిగా సంగీకరింపలేదని యూహింపవచ్చును. పృథ్వీశ్వరుని పిఠాపుర శాసనమునందు ఈ కాకతి రుద్రరాజు పేరు నుడువదు. కాని ఆ రుద్రుని "రిపుడ"ని నిరసనగా బలుకుచు ప్రజలు "రిపు" శబ్దమునకు, "చోర" శబ్దమునకు వ్యుత్పత్త్యర్థము నెఱుగజాలకపోయిరని తెలుపును. శత్రువుయొక్క పేరు సయితము ఉచ్చరింపక పిఠాపుర శిలాశాసన కావ్యకర్త ఆంధ్రదేశముపై దండెత్తి వచ్చిన రిపుడు రుద్రరాజు, చోరునివలె ప్రవేశించి ద్రోహకార్యము లాచరించెనని సూచించినాడు. దానికి కాకతి రుద్రుని ద్రాక్షారామ శిలాశాసనము తోడ్పడుచున్నది.[6] కాకతి రుద్రరాజు గావిం

---

1. ఎపి. ఇం. సం. ౪. పుట. ౩౨ మొ.

2. *S. I. I. Vol. IV. No.* 1155. ఈ శాసనమందుదాహృతమైన శక సంవత్సరము ౧౧౦౮ గాదు. అదుచో నది గతాబ్దముగాక వర్తమానాబ్దము కాదగును. అట్లయిన శ. ౧౧౦౮ (వర్తమాన) కార్తీక పూర్ణిమ సోమవారము సరిగా ౨౧ వ అక్టోబరు ౧౧౮౬ కు సరిపోవును.

3. *S. I. I. Vol. IV. No.* 1335.

4. *S. I. I. Vol. IV. No.* 1155, "శక వరుసంబులు ౧౧౦౮ (ఇది వర్తమానాబ్దము) అగు నేటి సర్వలోకాశ్రయ విష్ణువర్ధన మహారాజుల విజయ రాజ్య సంవత్సరంబులు ౫౨ అగు—"———.

5. ఎపి. ఇం. సం. ౪. పుట. ౩౨ మొ. శ్లోకము ౫౮.

తాభ్యాం శ్రీ పృథివీశ్వరః స్వయ
మివా శేషస్థితేః కారణం
దేవః శ్రీ ప్రృథివీశ్వరో జని జన
ప్రస్తూయ మానోదయః।
యస్మిన్ రాజని రక్షతి క్షితితలం
క్షీణారివర్గేజనో
వ్యుత్పత్తిం రిపు చోరవాచిషు
న చ ప్రాప్నోతి శబ్దేష్వపి॥

6. *S. I. I. Vol. IV. No.* 1155.

చిన మిత్రద్రోహ కార్యములకు గినిసి వెలనాంటి పృథ్వీశ్వరుడు బహుళ సైన్యసమేతుడై కాకతి రుద్రరాజుమీదికి కోపోద్దీపితుడై నడచెను. అది శ. ౧౧౮౬ సం. అక్టోబరు ౨౧ తేది కార్తిక పున్నమ తరువాతను, జరిగియుండెను. కాకతి రుద్రరాజు పృథ్వీశ్వరుని సంగ్రామ రంగమున ఎదుర్కొనజాలక 'చోరునివలె వెన్నిచ్చి పారెను. అనాడు పృథివీశ్వరుడు కాకతి రుద్రరాజును పోరున నోడించెనని, యాతని శౌర్యానలమునకు తాళజాలక రుద్రరాజు సంగ్రామ రంగమునుండి పలాయితుడయ్యెనని పిఠాపుర శాసనశ్లోకములు సూచించుచున్నవి. ప్రథివీశ్వరుడు జైత్రయాత్రకు బహుళ సేనాసమేతుడై వెడలినాడని, తెలిపిన భయంకరమయిన "సంభత్పటహ పటుతర ధ్వానమును" వినినంతనే, అతని శత్రువుల సమూహము భయచకితులయి వారి దేశదేశములకు పారిపోయిరట!

పృథివీశ్వరు డంతట విజయోత్సాహముతో నేరుచు పిఠాపురమును ప్రవేశించెను. అతడు తండ్రి వలె ముకుందాశ్రిత చిత్తవృత్తి గల వైష్ణవుడు గావున శ. ౧౧౦౮ వ సంవత్సరమున మేష సంక్రమణ పుణ్యకాలమందు (అందుకు సరియైన ఇంగ్లీషు తేది మార్చి ౨౪,౧౧౮౬ అనుచున్నది.) మహామండలేశ్వర వెలనాంటి కులోత్తుంగరాజేంద్ర చోడరాజులయిన పృథివీశ్వరునితల్లియు, కులోత్తుంగ చోడ గొంకరాజుల భార్యయు (రాజమాత,రాజపత్నియును)అగు జాయమ దేవులు ప్రోలునాంటిలోని నవఖండవాడను గ్రామమును 'గృహ క్షేత్రారామసహితము'గ, అఖండముగ శ్రీ పిఠాపురవాసియైన భగవంతుడు శ్రీ కుంతీ మాధవ స్వామివారికి హావిర్బల్యర్చనలకు, నిత్య నైమిత్తిక మహోత్సవ సంవత్సరోత్సవాదులకొఱకు గీత నృత్త వాద్యాది వివిధభోగార్థము దానము చేసెను.1 జాయమ దేవులు అర్పించిన దానమును, ఆమె కుమారుడును, 'రాజరాజ పరమేశ్వరుడును, రాజపురందరుడును, పరమమాహేశ్వరుడును ఖండితరిపు మండలుడు నగు పృథివీశ్వరమహారాజు మంత్రి పురోహిత సేనాపతి యుత రాజదౌవారికాదుల సమక్షమున ఆజ్ఞాపించెను. ఈ శాసనమునుబట్టి చూడ, పృథివీశ్వర మహారాజు చాళుక్యచోళ చక్రవర్తి మున్నగు కులోత్తుంగ చోళ దేవుని సార్వభౌమత్వమును అంగీకరింపక, తానే సార్వభౌముడని, రాజరాజపరమేశ్వరుడని ప్రకటించుకొనినట్లు తెలియగలదు.

పృథివీశ్వరుడు సమర్థుడు. సకలనయ (నీతి) శాస్త్రమును పూర్తిగా పఠియించుచేసిన రాజనీతి వేత్త; కావున సడలిపోవుచున్నట్టున్న ఆంధ్రరాజ్యమును తనకు ఆజ్ఞానువర్తిని జేయుటకు పృథివీశ్వరుడు గట్టిగా సంకల్పించుకొనెను. కాని యాతనికి కాలము అనుకూలముగాక విపరీతముగా నుండెను. అటు ఉత్తరాంధ్ర దేశమును, కళింగమండలమును తన యదుపులోనికి తీసుకొని వచ్చుచుండ, దక్షిణమున పాకనాటి సీమయందును తత్పరిసర పులుగులనాడు రేనాటి సీమలందు తెనుగుచోడులు విజృంభించి, అటు చాళుక్య చోళ చక్రవర్తి యధికారమునకు, ఇటు వెలనాంటి పృథివీశ్వరుని రాజపరమేశ్వరత్వమునకును ఎగ్గు తలపెట్టి సాగిరి. శ్రీ పిఠాపుర శాసనకాలము క్రీ. శ. ౧౧౮౬ మొదలుకొని ఇంచుమించుగా పండ్రెండు సంవత్సరములు, అనగా క్రీ. శ. ౧౨౦౭ వఱకు పృథివీశ్వరుడు నందూరి కొమ్మనమంత్రికుమారుడు కేతనమంత్రిసహాయమున తన రాజ్యము శిథిలము గాకుండ కడుదక్షతతో శాసించెను. పృథివీశ్వరుని కాలమునాటి శాసనములు మూడు మాత్రము గాన వచ్చుచున్నవి. పృథివీశ్వరుని ఆంధ్రరాజ్యము అతని తండ్రి తాతలనాడుండినట్లు, మహేంద్రగిరిపర్యంతము విస్తరించియుండినట్లు అతని శ్రీ కూర్మనాథు దేవుని నగరియందున్న శిలాశాసనము సాక్ష్యము.1 అందు చమూపతి కొల్లూరు ఎఱపనాయకుడు పృథివీశ్వరుని యానతిగా యావత్కళింగము నేలుచుండినట్లు తెలుపబడినది. ఆ వీరభటాగ్రణియొక్క తండ్రి తాత ముత్తాతలు వెలనాంటి మహారాజుల సైన్యములందు చమూపతులై యుండిరి. చమూపతి ఎఱపనాయకుడు

---

1. శ్లోకములు ౫౯,౬౨.
యస్యాతి నిర్మలతరేణ పరీతమేతద్
  బ్రహ్మాండమాసు యశసా నితరాం విభాతి।
దూమాంకధౌత కలధౌత కరండభాండ
  మధ్యప్రవిష్ట మివ విష్టపవల్లభస్య॥
యా అ ప్రారంభ సంభత్పటహ
  పటుతరధ్వానమాకర్ణ్య
తూర్ణంహిత్వా దేశాం దిగంతాణ్
  భయచకిత దృశో వ్యాప్య యస్యారిసంఘాః
కిం స్విత్సంవర్త మేఘధ్వనిరుత
  వికట ప్రస్ఫుటత్కాండఘోషః
కింవా కల్పాంతవాయు క్షుభిత మితి
  ముహుశ్చింతయంతో భ్రమంతి॥
2. ఎపి. ఇం. సం ౪. పుట ౩౪ మొదలు (౧౩౪-౧౫౪ పంక్తులు)

*1. S. I. I. Vol. V No. 1338.*

చతుర్థకులజుడు. అతని శాసనము శ. ౧౧౧౦ కు సరియైన క్రీ. శ. ౧౧౮౮ నాటిది. ఆ సంవత్సరమున చైత్ర శుక్ల పంచమి బుధవారము (మార్చి ౧౧౮౮) నాడు చమూపతి ఎఱపనాయకుడు తన తండ్రికి ధర్మార్థముగా శ్రీ కూర్మనాథ దేవరకు అఖండవర్తిదీపమును బెట్టెను. ఎఱపనాయకుని శాసనము చూడ, క్రీ. శ. ౧౧౮౬ తరువాత పృథివీశ్వరుడు శ్రీ పిఠాపురము నుండి శ్రీ కూర్మమువఱకు సైన్యసమేతుడయి అరిగి, ఆ రాజ్యమునందు తన (శాసన) మును సుస్థిరము జేసి వచ్చెనని యూహింపవచ్చును. పృథివీశ్వరుని యనంతరము కళింగము కటకగంగవంశీయుల క్రీ.శ. ౧౨౦౪ ప్రాంతమున అధీనమయ్యెను.1 విశాఖపట్టణమున దొరికిన శిలాశాసన మొకటి శకవరుషంబులు ౧౧౨౬ మార్గశిర శుద్ధ ౧౦ గురువారము (డిశంబరు ౩,౧౨౦౪) నాటిది, శ్రీమన్మహామండలేశ్వర కులోత్తుంగ పృథివీశ్వరునిపాలనము దెలుపునది గలదు2 అది యొక వ్యాపారి ముఖ్యునిచే విష్ణాలయమున వేయబడిన దాన మును తెలుపుచున్నది. మూడవశాసనము కోశాధ్యక్షు అనంతయది. పృథివీశ్వరుడు సమస్తేశ్వరుడనియు, అనంతుడు పృథివీశ్వరుని కోశాధ్యక్షుడనియు నాశాసనము దెలుపుచున్నది. శ. ౧౧౨౭ మేష సంక్రమణ పుణ్యకాలమున అనంతయ శ్రీ కూర్మనాథునికి అఖండ వర్తి దీపమును బెట్టించెను.3 కావున క్రీ. శ. ౧౨౦౬ వఱకు వెలనాంటి పృథ్వీశ్వరుడు పాలించుచుండినట్లు తెలియుచున్నది.

క్రీ. శ. ౧౨౦౪ కడపటి నెలలనాటికి కులోత్తుంగ పృథివీశ్వరుని రాజ్యము అంతమందినట్లు ఊహింపవచ్చును. ఆతడు క్రీ. శ. ౧౨౦౪ న మరణించినట్లు కన్పడుచున్నది. శ్రీ కూర్మమునన్న గాంగవంశనృపతి వీరనరసింహుని శాసనమును బట్టి చూడ వెలనాంటివారిశాసనము కళింగమున శ. ౧౧౨౭ తులాసంక్రమణమునాటికి (౨౩ అక్టోబరు ౧౨౦౫) నశించెననియు, గాంగవంశమువారి శాసనము నెలకొనెనని యూహింపవలయును. కళింగమునందుమ, పాకనాటియందేగాక మధ్యాంధ్రభాగమునందునుకూడ వెలనాంటి పృథివీశ్వరుని రాజ్యము ఒక్కసారిగా కూలిపోయెను. దక్షిణమున తెనుగుచోడులు, మూడవ కులోత్తుంగ చోడ చక్రవర్తి నెదిరించి సర్వస్వతంత్రులయి వెలనాంటి పృథివీశ్వరుని జయించి, యొక విశాల తెనుగుచోడ రాజ్యమును స్థాపింప ప్రయత్నించిరి. ఆ సంకల్పమును కార్యరూపమున పెట్టినవాడు. తెనుగుచోడ తిక్కరాజు. వెలనాంటి రాజవంశమును నిర్మూలనచేసి వారి రాజ్యలక్ష్మిని వశపఱచుకొనుటకు తెనుగుచోడులందరు తిక్కరాజు నాయకత్వమున ఏకమై నిలచిరి. కమ్మనాటిలోని కొట్యదోన తెనుగు చోడులు మొదలుకొని పొత్తపినాటివఱకు గల తెనుగు చోళ మండలేశ్వరులందరు విక్రమ సింహపురాధీశ్వరుడయిన మొదటి మన్మసిద్ధికుమారుడయిన యువరాజ చోళతిక్కరాజు నాయకత్వము నంగీకరించి యుద్ధ సన్నద్ధులయిరి. పృథివీశ్వరుడు గురుములూరు లేక గురుములూరికడ తెనుగు చోళ తిక్కరాజు సైన్యముల నెదుర్కొనెను. గురుములూరు పాకనాటిలోనున్నది.4 విక్రమసింహపురమని బరగిన నెల్లూరికి దక్షిణమున ఇరువదిమైళ్ళదూరమున నున్నది. గురుములూరికీనాడు గూడూరని పేరు. ఆ యూరిచెంత జరిగిన ఘోర సంగ్రామమునందు పృథివిరాజు పరాజితుడయి మరణించెను. గురుములూరి యుద్ధము ప్రాయశః ౧౨౦౪ న జరిగియుండెనని నిర్ణయింపవచ్చును. నిర్వచనోత్తర రామాయణమందు తిక్కనకవి 5 ఈ చోళ తిక్కరాజు

---

1. S. 1. I. Vol. V No. 1265.

2. S. I. I. Vol. X No. 211. ఈ శాసనమున గల శకవర్షములో గడపటి సంఖ్య లేదు. మిగిలిన తిథి వారములనుబట్టి లెక్క బెట్టినపుడు ఆ కడపటి సంఖ్య ౬ అని తెలియుచున్నది. కావున శాసనపు తేది శ. ౧౧౨౬ అని తేలుచున్నది.

3. S. I. I. Vol. V. No. 1254.

4. రంగాచారిగారి టొపోగ్రాపికల్ లిస్టు. సంపుటము రెండు, పుట ౧౦౪౦ గూడూరుకు గు(రు)రుములూరని పేరున్నట్లు అక్కడి పెరుమాళ్ళ గుడి శాసనములందున్నది.

5. కేశవసన్నిభుండు సంగీత
యశోనిధి చోళతిక్కధా
త్రీశుఁడు కేవలుండె! నృపు
లెవ్వరి కాచరితంబుఁగల్గనే

శౌర్యమును వర్ణించెను. ఆ సంగ్రామము జరిగిననాటికి తిక్కననృపతి ఇంకను బాలుడేనట! అతడింకను యువరాజే! ఆయుద్ధము జరిగిన పదునెనిమిదియేండ్లకు పిమ్మటగాని యతడు రాజ్యాభిషిక్తుడు కాలేదు.1 అతడు తిక్కన సోమయాజి పోషకుడయిన రెండవ మనుమసిద్ధి రాజునకు తండ్రి. గురుజులూరి యుద్ధము నందు చోళ తిక్కరాజు నాయకత్వమున వెలనాంటి పృథివీశ్వరు నెదిరించి పోరాడిన మండలేశ్వరులందరును ఆనాటినుండి వంశపరంపరానుగతముగా 'పృథివీశ్వర శిరఃకందుక క్రీడావినోద' బిరుదమును ధరించియుండిరి.2

వెలనాంటి పృథివీశ్వరుని మరణముతో ఆంధ్రభూమియందు చాళుక్యచోళుల సామ్రాజ్యము అంతరించెను. మూడవ కులోత్తుంగుని విజయరాజ్యవర్షములు పాకనాటియందును, పొత్తపినాటియందును ఉదాహరింపబడుచుండినను చాళుక్యచోళుల యధికారము నామమాత్రావశిష్టమై యుండెను. పశ్చిమమున కాకతి రుద్రరాజు ఆమరణాంతము తన రాజ్యము సుస్థిరమగుటకు దేవగిరి పురాధీశులైన సేవణ యాదవులతో పోరాడుచు తెఱపి లేకుండిరి. కాకతి రుద్రరాజు క్రీ. శ. ౧౧౯౬ ప్రాంతమున కడు వృద్ధుడయి రణరంగమున ప్రాణములు గోల్పోయెను. అతడు పుత్రవిహీనుడగుటచేత వాని తమ్ముడు మహాదేవరాజు రాజ్యాభిషిక్తుడయి మూడు నాలుగు సంవత్సరములు మాత్రమే పాలించెను. అతని రాజ్యకాలము దేవగిరి యాదవులతోడి పోరాటములతో గడచిపోయెను. చివర కాతడు గూడ రణస్థలిని గూలి వీరస్వర్గమును బొందెను. అతని తనయుడు గణపతిదేవుడు బాలుడు సేవణరాజు చేతులబడి పదియేండ్లు ఇంచుమించుగా దేవగిరియందు చెఱననుభవించెను. క్రీ.శ. ౧౨౦౯-౧౦ ప్రాంతమున గణపతిదేవుడు చెరవిముక్తుడయ్యెను. అంతకు పూర్వము వెలనాంటి పృథివీశ్వరుడు మరణించెను గావున ఆంధ్రదేశమున సార్వభౌముడు కాదగిన నరపాలుడు గణపతిదేవుడుతక్క వేరొకడు గానరాడయ్యెను. తెనుగుచోడులుగూడ తమలో తామైక్యతను బడయజాలక క్రుంగిపోయిరి. క్రీ. శ. ౧౨౧౦ తో చాళుక్య మంతరించుటయు కాకతీయ యుగము ప్రారంభమగుటయు నొకసారిగ సంభవించెను. ఆనాటితో ప్రాచీనయుగ మంతరించి మధ్యయుగము ప్రారంభమయ్యెను. ఆంధ్రదేశమునకు చోళ సంబంధబాంధవ్యములు అంతరించెను.

---

శైశవలీల నాఁడు పటు
శౌర్యధురంధరబాహుఁడైన పృ
థ్వీశ నరేంద్రు మస్తకము
చేర్తిరఁ గందుకకేళి సల్పఁడే!
౬౩ వ పద్యము.

1. తిక్కరాజు పట్టాభిషేకము శ. (౧౨౦౯ నందు జరిగియుండునని రాబర్టు సూయెలు లెక్కించి చెప్పినాడు. ఆనాడు పొత్తపినాడు పాకనాడులు రెంటిని ఒక్కవంశమువారే శాసించుచుండిరి.

2. ఉదాహరణను క్రింద చూడుడు:— *S. I. I. Vol. IV. No. 661*, మఱియు *S. I. I. Vol. VI. No. 166.*

చాళుక్య చోళచక్రవర్తులయు వారి భృత్యులైన వెలనాంటి మహామండలేశ్వరులయు కాలము. ఇందు సంవత్సరములు క్రీ. శ. మున నున్నవి.

## చాళుక్య-చోళులు

త్రిభువన చక్రవర్తి -
సప్తమ విష్ణువర్ధనులయిన
మొదటి కులోత్తుంగ
చోళదేవుడు
౧౦౭౬ - ౧౧౧౮.

|

విక్రమ చోళచక్రవర్తి
౧౧౧౮ - ౧౧౩౫.

|

రెండవ కులోత్తుంగచోళుడు
౧౧౩౩ - ౧౧౪౬.

|

రెండవ రాజరాజచోళుడు
౧౧౪౬ - ౧౧౭౩.

|

రెండవ రాజాధిరాజు
౧౧౬౩ - ౧౧౭౮.

|

మూడవ కులోత్తుంగ
చోళదేవుడు
౧౧౭౮ - ౧౨౧౬.

## వెలనాంటి వంశము

మొదటి వెలనాంటి గొంకరాజు
౧౦౭౬ - ?...

|

మొదటి వెలనాంటి రాజేంద్ర చోడుడు
౧౦౯౩ - ౧౧౦౪.
చక్రవర్తికి దత్తకుమారుడు

|

రెండవ వెలనాంటి గొంకభూపతి
కులోత్తుంగచోడ గాంగేయ
గొంకరాజు ౧౧౩౨ - ౧౧౬౧.

|

వెలనాంటి కులోత్తుంగ రాజేంద్రచోడుడు -
రెండవ రాజేంద్రచోడుడు, లేక వీరరాజేంద్రచోడుడు
౧౧౬౧ - ౧౧౮౧.

|

కులోత్తుంగ చోడ గొంకరాజు
(మూడవ గొంకభూపతి)
౧౧౭౮ - ౧౧౮౫.

|

రెండవ కులోత్తుంగ రాజేంద్రచోడుడు
లేక పృథివీశ్వరుడు
౧౧౮౫ - ౧౨౦౭ - ౮.

# రాష్ట్రగానము

★

శ్రీ సూరంపూడి భాస్కరరావు

కృష్ణాగౌతమి తుంగభద్ర లోకటన్ క్రీడించి వర్తించి శ్రీ
విష్ణుప్రీతిగ నాంధ్రఖండమున మాధ్వీకుల్యలై పారె మా
తృష్ణ ల్దీరగ; నేటి కిట్లు మొరయున్ దివ్యాంధ్ర భూశయ్యలన్
కృష్ణానంత విభావరీగ్లపిత శుష్కీభూత జీవమ్ములై.

"ముప్పదిమూడు" దీర్ఘ యుగముల్వలె వత్సరము ల్గతించె, మా
నిప్పుల కోర్కెలే చదలనిండి దహించె మహాంధ్ర భూమినీ,
ముప్పులు తప్పరాని వయిపోయిన పోవునుగాక గాని పె
ల్లుప్పెనయై మహోద్యమ మహోదధి ముంచెడుసుమ్ము లోకముల్!

లేదు విరామమింక, కెరలించిన యీ హృదయమ్ములందు ఏ
వో దివసాంతకాళి మలభూధరముల్ పెఠిల్లిపోయి, దు
ర్నాద విదారితమ్మయి మనఃఫలకమ్ములు క్రగ్గిపోయి, ని
ద్రాదళనమ్ము రుద్ర డమరమ్ముగ నాంధ్రము మారుమ్రోగెడిన్.

మల్లిమొగ్గల వాల్జడ లల్లుకొన్న
కల్ల లెరుగని ప్రశాంతాంధ్ర కన్య దలచి
నా పునీతాంధ్ర మాతృస్తనంధయుండు
ప్రతి కుమారకుడు న్నేడు ప్రతిన చేయు
మాతృరక్షావిధికి ప్రాణ మర్పణముగ.

"గంగదరిని గాని కాశిలోపల గాని - గౌతమీ తరంగ గానపూర్ణ
కోటిలింగ తీర్థవాటి దక్షిణకాశి - గుండెలోన మేలుకొనునుగాక."

---


ప్రతిదిన మలినములోని
క్రిములనుండి మీ ఆరోగ్యమును కాపాడుకొనండి
లైఫ్‌బాయ్‌యొక్క
రక్షకమైన నురుగుతో!
మీ రెంత జాగ్రత్తగానున్నప్పటికి-మలినములోని క్రిములనుండి ప్రతిదినము అంటురోగమును పొందుటకు అవకాశమున్నది. లైఫ్‌బాయ్ సబ్బుతో తరచు స్నానముచేసి మీ ఆరోగ్యమును కాపాడుకొనండి. దాని రక్షకమైన నురగ మలినములోని క్రిములను తరిమివేసి రోజంతా మిమ్ములను హాయిగానుంచును.
LIFEBUOY SOAP
లైఫ్‌బాయ్ సబ్బు
ప్రతిదిన క్రిములనుండి ప్రతిదిన రక్షణకు
L. 230-50 TL

వేటూరి—

సుందరశాస్త్రిగారి

## వర్ణ సుందర రసము

**సర్వసవామేహములకుసంజీవి.**

గుణము ప్రత్యేకము

అనుభవసిద్ధము. ఇంజెక్షన్లు అవసరం లేదు. ఎటువంటి సవామేహాలనైనా కుదుర్చును.

**50 మాత్రలు రు. 5.**

**ఆర్షరసాయనశాల, ముక్త్యాల.**

---

## పాలసుగంధిలేహ్యం

ఇది రక్తవృద్ధిని చేయు విలువ గల వస్తువులచే తయారు చేయబడినది. మేహములు, నిశ్శక్త నిస్సత్తువ, శుక్ల నష్టము, అతిమూత్రము మొదలగు వాటిని ఖండించి, మంచిబలమును వీర్యపటుత్వ మును కలిగించుటలో అద్భుతమయినది. అనేక సర్టిఫికెట్లు గలవు. 2 డబ్బీలు చాలును.

20 తులముల డబ్బీ రు. 2/-

పోస్టేజి ప్రత్యేకము.

**పి. సి. ఏ. అండ్ కంపెని**

ఆయుర్వేదసమాజం.

పెరిదేపి, (నెల్లూరు జిల్లా)

---

## కుష్ఠు ★ బొల్లి

వగైరా మేహ మచ్చలు, సెగ, సవాయి వ్యాధులకు గ్యారంటీ చికిత్స. క్యాటలాగు ఉచితము.

---

**జి. వి. రెడ్డి అండ్ కో**

(రిజిష్టర్డు)

"భాస్కరాశ్రమము"

గోపాలపురం, తూ. గో. జిల్లా.

---

లోకప్రసిద్ధిపొందిన

## పి. వి. రాజన్ అండ్ కంపెనివారి

శ్రేష్ఠమైన మదరాసు నశ్యం

**R. S.** సుగంధ ముక్కుపొడి

అన్నిటిలో సాటిలేనిది.

ధర వివరములకు వ్రాయుడు.

తయారుచేయువారు:—

**పి. వి. రాజన్ & కంపెని,**

అరక్కోణం, Arkonam, N. A. Dt.

# నిజానిజాలు

"హితశ్రీ"

★

ప్రస్తుత సామాజిక, ఆర్థికవ్యవస్థల నే పగ్గాల ఉచ్చుల్లో చిక్కుకుని, ఊపిరిఆడక క్షణమొక యుగంగా గడిపే దురదృష్టవంతుల స్వీయచరిత్రలు 'బరువుగుండెలు' శీర్షిక ద్వారా ప్రకటిస్తూ, సమస్యాపరిష్కారానికి పూనుకోగల ఉదాత్తహృదయులకి ఒక అవకాశం కలిగిస్తున్నందుకు మీకు నా కృతజ్ఞత.

బతుకుబాటలోని కఠినశిలల ఎదురుదెబ్బలతాకిడికి నా బతుకే భయంగా మారింది. నా చిన్నతనంలోనే మా నాన్న మరణించాడు. ఎనిమిదోఏటనే వివాహవైధవ్యాలు సంప్రాప్తించాయి. సంసారం గడిచే ఆధారం లేదు. అప్పటిదాకా ఎన్ని కష్టాలు వచ్చినా గడపదాటకుండానే గడుపుకుపోయిన మా అమ్మ పరాయిచోట నాలుగురాళ్లకోసం ఊడిగం చేయాల్సొచ్చింది. 'వంటమనిషి' బిరుదు పొందింది. ఎన్నో అవమానాలకి, అధికారాలకి తలవొంచింది. ఇదంతా నా కోసం. ఇంటర్మీడియేట్ రెండోసంవత్సరం సగంవరకూ అష్టకష్టాలుపడి చెప్పించింది. చివరికి మందు కొనటానికి డబ్బులేక ఈ లోకంలో కష్టాలకి తుది ఉద్వాసన చెప్పింది. ఏమీ చెయ్యలేక పోయాను. మరి బాధలుపడే అవసరం ఆమెకి తీరిపోయిందని మనసుని ఊరడించుకున్నాను.

ఇహ ఇంటర్ పూర్తిచెయ్యటం కలలోకూడా అసంభవం. జీవితంలో ముందుకి అడుగు ఎలా వెయటం? ఈ క్లిష్టపరిస్థితిలో మరో కొత్తసమస్య ఎదురైంది. మేము ఉంటూఉన్న ఇంటి యజమాని దగ్గిర మా అమ్మ అప్పుడప్పుడు తీసుకున్న చిన్న-చిన్న అప్పులన్నీ కలిసి రెండువందలయినయిట. మా అమ్మ ఆఖరిక్షణాల్లో ఆయన వొచ్చి ఏదో కాగితంమీద వేలుముద్ర వేయించుకుని వెళ్లాడు. అప్పుడు నేనా విషయం పట్టించుకోలేదు. ధర్మాత్ముడు, ఆ రెండు వందలు వదిలేస్తాడుటగాని, ఒకషరతు ఉందిట, ఆయన ప్రథమభార్య, ఆయననీ ఇద్దరుపిల్లలనీ వొదిలి పరలోకం వెళ్లిపోయిందిట. ఆ పిల్లల్ని పెంచటానికి రెండోపెళ్లి తప్పనిసరి కాబట్టి నన్నందుకు ఒప్పుకోమని ఆయనకోరాడు. అలా అయితే రెండువందలబాకీ చెల్లిపోతుంది. లేకపోతే పదిరుబాకీ అసలు ఫాయిదాల వసూలు నిమిత్తం కోర్టులో దావా పడబోతుందనీ, అందునిమిత్తం కాగల ఖర్చులుకూడా భరించుకోవలసి ఉంటుందనీ రిజిష్టరునోటీసు అందుతుందిట.

ఏ దిక్కుకి తిరగను? కాలేజీ యువకులు చాలామంది నా మీద 'ప్రేమ'ని వెలిబుచ్చారు. ఒకాయన ఆత్మహత్యకూడా చేసుకుంటానని అల్టిమేటమ్ ఇచ్చాడు. 'నిజంగా ప్రేమిస్తున్నారా?' అని అడిగాను. 'ప్రాణాధికంగా' అన్నాడు.

'ప్రేమ అంటే ఏమిటి?'

జవాబు చెప్పలేకపోయాడు.

"వినవా వివాహం మీ కిష్టమేనా?"

తెల్లబోయాడు. మళ్లీ కనిపించలేదు. మరో ప్రబుద్ధుడు షేవ్ చేసుకుంటూంటే తెగింది కాబోలు. రక్తంతో రాశాడు, 'నిన్ను ప్రేమిస్తున్నాను' అని, కారిన నెత్తురు సద్వినియోగం చెయ్యాలనుకున్నాడేమో! 'కళ్ళలోకి చూడమన్నాను' బెదిరి పారిపోయాడు. 'ఫలానా అమ్మాయికి మెల్ల, ఏమిటో అనుకున్నాను' అని ప్రచారంచేశాడు. నా సహాధ్యాయినులు నవ్వుకున్నారు. అంతా ఇంతే. ఎవరి నమ్మను?

చదువులేక, డబ్బులేక, ఆప్తులులేక, స్వార్థపరులతో నిండిన ఈ ప్రపంచంలో ఏకాకిగా, నిస్సహాయంగా ఎలా బతికేను? అనేక సుడిగుండాలతో నిండిన ఈ సముద్రం ఎలా ఈదటం? ఈ కష్టాలకంతటికీ మూలకారణం దారిద్ర్యమే కదా! డబ్బే ఉంటే ఎలాగో ఏ బి.ఏ. వరకో చదివి స్వతంత్రంగా బతకటానికి ఓదారి నిర్పడేది! చుట్టూ ఉన్న సంఘం సౌహార్ద్రంగా ఉన్నా సమస్యలు తీడిపోయేవి. కాని సమాజం ఎంత అధోగతికి పోగలదో అంతవరకూ పోయింది. ఎన్నో 'కుక్కమూతి పిందెలు' వేస్తోంది.

నాలాంటివాళ్లు చాలామంది ఉన్నారని నాకు తెలుసు. కలగచేసుకోటానికి ప్రభుత్వానికి డబ్బూ, ఓపికా కూడా లేవని తెలుసు!

ఆర్థిక విప్లవానికి ముందు అత్యవసరంగా రావలసిన భావవిప్లవంకోసం యువకులు తీవ్రమైన ఉద్యమం నడిపిస్తారనీ, ముందుతరాలవాళ్లయినా బాగుపడగలరనీ ఆశించటంకంటె ఏం చెయ్యగలను?

పుట్టుకతో వొచ్చిన మానవసహజమైన లోపాలూ, బాధలూ ఉండనే ఉన్నాయి. కనీసం మన చేతుల్లో ఉన్నంతవరకైనా మనని మనం బాగుచేసుకోలేమా? మనం సృష్టించిన డబ్బూ, మనం విధించుకున్న నిబంధనలూ మనమీద స్వారీ చెయ్యటం చూస్తూ ఊరుకోటం కంటె మనం ఏమీ చెయ్యలేమా?

—రాగ.

వరదరాజు కల్లోలితమైన మనసుతో సముద్రంవైపు చూశాడు. మళ్లీ దృష్టి మరల్చి గాలికి రెపరెప కొట్టుకొట్టుకుంటున్న, ఆ అచ్చు కాగితంవైపు చూశాడు. తరవాత ఆకాశంలోకి కళ్లు తిప్పాడు. అకస్మాత్తుగా సూర్యుడు అస్తమించబోతున్నాడు. అతనికి భయమేసింది. ఈ సుందరమయప్రకృతినించి సూర్యుడు వేరవుతున్నాడు. తనవైపు పరుగెత్తుకుంటూ వొస్తున్న అలలవైపు మళ్ళీ చూశాడు వరదరాజు. అప్రయత్నంగా వెనక్కి రెండడుగులు వేశాడు.

ఆ క్షణంలో వరదరాజుకి ప్రకృతి ఎంతో ఆకర్షణీయంగా, అత్యద్భుతంగా, నిరుపమానంగా కనిపించింది. తను ఇన్నాళ్ళనించీ అంత గుడ్డివాడుగా ఎలా ఉండగలిగాడు!

అలలమీద పడుతూ మెరుస్తున్న సూర్యకాంతి క్రమంగా అంతరిస్తోంది. వరదరాజు అది గమనించి విషాదంగా నవ్వాడు. 'అంతే, క్షణికం' అనుకున్నాడు. కాని వెంటనే అతని మనసులో మెరుపు మెరిసింది.

"మళ్లీ రేపు సూర్యోదయం అవుతుంది. ఆ కాంతికి ఈ అలలు వెండినీరులా మెరుస్తూ ఆనందంతో ఆటలాడుకుంటాయి."

వరదరాజు మనసు సందిగ్ధావస్థలో పడ్డది.

"జీవితం ఉదయాస్తమానాలబండిచక్రం. అస్తమించిన సూర్యుడు మళ్లీ అవతరిస్తాడు. కాలగమనంతో కలిసిపోయి మార్పుకి అలవాటుపడటం మానవధర్మం." పురాతనపు జ్ఞాపకాలు వరదరాజు మనసులో మెసలాయి; వర్తమానపు ఉద్రేకాలు మనసుని ఆవరించాయి. అతను ఆలోచనగా వెనక్కి తిరిగాడు. చేతిలోని కాగితంసంగతి గాలి జ్ఞాపకం చేసింది. క్షణంలో అతనిముఖం వివర్ణమయింది. తను ఏం చెయ్యదల్చుకున్నాడు? ఏం చేస్తున్నాడు? సమాధానం ఏ విధంగా చెప్పగలడు?

ఇంకా బతకాలని తనని ఎవరు బలవంతం చేస్తున్నారు. అన్నీ ఆకర్షణలూ పోయాయి. అనుకున్న తనకి ఇంకే ఆకర్షణ మిగిలింది? ఎందుకు మళ్లీ వెనక్కి...

వరదరాజు సముద్రంవైపు నడిచాడు. పెద్దఅల వొస్తోంది. అప్రయత్నంగా పంచ పైకి లాక్కున్నాడు. వెంటనే అతనికి నవ్వొచ్చింది. వెధవ బతుకు! ఎందుకింత ఆపేక్ష?

అలవొచ్చి అతనికాళ్లని తడిపింది. అతనుఇంకా ముందుకి నడిచాడు. కర్తవ్యం ముందుకి తోస్తోంది. బతికినన్నాళ్లూ ఎవర్నీ సుఖపెట్టలేదు తను. ఒక్కజీవిఅయినా తనవల్ల సుఖపడితే...

పెద్దఅల వొచ్చి కొట్టుకుంది. పంచ తడిసింది. చేతిలో కాగితం కొట్టుకుపోయింది. ముందు అగాధంలా సముద్రం తనమీదికి పరిగెత్తుతోంది... కాగితాన్ని సముద్రం నీళ్ల అడుగున దాచేసింది. కాగితంకోసం చూశాడు అతను. కనపడలేదు. పెద్దఅల... కొద్దిక్షణాలు... కళ్లుమూసుకున్నాడు అతను. కాని ఉండలేకపోయాడు. వెనక్కి పరిగెత్తాడు. అలవొడ్డుకు వచ్చి విరిగిపోయింది. మళ్లీ వెనక్కి వెళ్లిపోతూ అతని కాళ్లముందు ఆ కాగితం పడేసి క్రమంగా నీళ్ళలో కలిసిపోయింది.

వరదరాజు ఆ కాగితంవైపు అలాగే కాసేపు చూశాడు. తరవాత దాన్ని తీసి మళ్లీ జాగ్రత్తగా

జేబులో దాచాడు. అతని పిరికితనానికి అతనికే అసహ్యం వేసింది. మనసు సంక్షోభం చెందింది. ఇంత చేతకానివాడు అనుకోలేదు తను. తనలో ఇంత స్వార్థం ఉందనికూడా ఎప్పుడూ తెలుసుకోలేక పోయాడు. సామర్థ్యం లేనప్పుడు నడుంబిగించి ముందుకి ఎందుకు ఉరకాలి తను? అతనికి వెంటనే ఓ అనుమానం కలిగింది. తను రాధని చూడకముందు ఇంత దుర్బలుడు కాదేమో! రాధ! రాధకోసం చావాలనుకున్నాడు. కాని...

అతను ఆలోచిస్తూ నడుస్తూ ఓ యింటిగుమ్మం ముందు ఆగాడు. తలుపు తట్టబోయి మళ్లీ తటాలున ఆగిపోయాడు. తను అసలు ఇక్కడికెందుకు, ఎలా వొచ్చాడు? బుద్ధిపూర్వకంగా రావాలని అనుకోలేదు. కళ్లూ, కాళ్ళూ అంతరాంతరాలలో పరీకా! ఒక క్షణం అలా నిలబడి వరదరాజు వెనక్కి తిరిగి చరచర నడిచిపోయాడు. అతను ఆ ఇల్లుదాటి పదిఅడుగులు వేశాడో లేదో, ఆ ఇంటితలుపు తెరుచుకుంది. రాధ వీధివాకిటనుంచుని యథాలాపంగా ఇంటిముంగిట చూసే సరికి పాదాల గుర్తులు కనిపించాయి. అవి తనవి మటుకు కావు. ఒకగంటకింద కొద్దిగా కురిసి వెలిసిన వాన ఆ విషయం స్పష్టంగా చెబుతోంది. ఇంటి వరకూ వచ్చి తనని పిలవకుండా ఆ పెద్దమనిషి ఎవరో ఎందుకు వెళ్లిపోయాడో అర్థంకాక ఆమె తలెత్తి వీధి వైపు చూసింది. వరదరాజు బరువుగా అడుగులో అడుగు వేసుకుంటూ వెడుతున్నాడు. రాధ గుండె వేగంగా కొట్టుకుంది. సందేహంలేదు. అతను వరద రాజే. వెనక్కి దువ్విన క్రాఫు, ఖద్దరుగుడ్డలు, ఆ నడక తీరూ-సర్వస్వం పోగొట్టుకున్నవాడిలా ఎప్పుడూ బరువుగా అడుగులు వేసే ఆ స్వరూపం, అతను వరదరాజే నని ఘంటాపథంగా చెబుతున్నాయి. రాధ అతని వైపు కన్నార్పకుండా అలాగే చూడసాగింది. విరాగిలా సాగిపోతున్న అతన్ని చూసి ఆమెకి ఒకక్షణం జాలివేసింది. మరుక్షణంలో ఆమె హృదయం కంపించింది - ఏ తలపైతే తను జ్ఞాపకం తెచ్చుకోకుండా ఉంచేలానికి, ఏ నిజమైతే తను అబద్ధం మాత్రమేనని అసహజంగా సరిపెట్టుకోటానికి ప్రయత్నిస్తోందో ఆ తలపు, ఆ నిజం వెంటనే ఆమె స్మృతిలో మెరుపుల్లా మెరిశాయి. వరదరాజు తనభర్త.

రాధ భావశూన్యంగా అతనివైపు చూస్తూ నిలబడింది. వరదరాజు క్రమంగా దూరమవుతున్నాడు. ఆమె హృదయంలో ఏమూలో దాగిన అశాభావం క్రమంగా అదృశ్యమౌతున్నట్లుగా ఆమె అనుభూతి పొందింది. క్షణంసేపు లోకంలో తనకంటె దూర్తు రాలు ఎవరైనా ఉన్నారా అనే సందేహం కలిగిం దామెకి. అసలు తను పత్రికలో 'స్వీయచరిత్ర' ఎందుకు రాయాలి? అంతకంటె సముద్రంలో పడి చచ్చిపోతే బావుంటేది! రాధ మనసులో గతించిన సంఘటనలు ప్రతిబింబించాయి. వరదరాజు తనని ఉద్ధరించటానికి వొచ్చిన దేవు డనుకుంది. ఎందుకో అతన్ని చూడగానే తనకి అతనిమీద సదభిప్రాయం కలిగింది. కాని మనస్సు ఇలా వంచిస్తుందని ఏమాత్రం సూచనగా తెలిసినా...

"పత్రికలో మీ దైన్యచరిత్ర చదివాను" అన్నాడు అతను. అతనిముఖంలోను వ్యక్తమైన సానుభూతికిహృదయంలో నిండినదయతో. సంబంధం లేదను కోటానికి తగిన ఆధారం ఏమీ తనకి దొరకలేదు.

"నాలాంటివాళ్లు ఎంతమందో!"

అతను కొంచెంసేపు ఏమీ మాట్లాడలేదు. తర వాత మాటిగాఉపోద్ఘాతం ఏమీ లేకుండా అన్నాడు.

"నేను యథాశక్తిని మీకు సహాయంచెయ్యదల్చుకున్నాను."

తను ఏమీమాట్లాడలేకపోయింది. హృదయంలో కృతజ్ఞతాభావం నిండి, తొణికి తనముఖంలోనించి బయటికి వస్తోందని అతను గ్రహించటానికికూడా అవకాశంలేదు. అతను తనవైపుచూసి మాట్లాడటం లేదు. రాగానే, ఏ ఒక్కసారి చూశాడో, అంతే. పాపం, ఎంత నమ్రత!

"అయితే, ఇందుకు మీ సహాయం చాలా అవసరం."

"ఏం సహాయం?" తనకే వినపడకుండా అంది.

"చెబుతాను. నన్ను చూస్తే మీకు ఎలాంటి అభిప్రాయం కలుగుతోంది?"

"మీరు చాలామంచివారు. ఇతరుల కష్టసుఖాలు వినిపించుకోటానికే 'టైం' లేక 'స్వార్థం' వెంట పరిగెత్తే మనుషుల్లో మీలాంటి ఆదర్శవాది ఉండటం..."

"పొగడకండి. నేను అడిగింది అదికాదు. నేను ప్రపంచంతో సంబంధం ఉన్న మనిషిలా కనిపిస్తున్నానా?"

"చాలా నిర్లక్ష్యంగా ఉన్నారు. కారణం ఏమిటో..."

 

"నేను విరాగిని."

తను విస్మయంగా చూసింది అతనివైపు. నలిగి, మాసిన దుస్తులతో, పెరిగినగడ్డంతో, సంస్కారం లేని క్రాపుతో కృశించిన దేహంతో ఉన్న అతన్ని చూడగానే మొదటే తనకి కొద్దిగా ఆశ్చర్యం వేసింది.

"ఇంత చిన్న వయసులో..."

"కారణం ఉంది. అదంతా ప్రేమగాథ. మిమ్మల్ని విసిగించను. సూక్ష్మంగా చెబుతాను. ప్రేమించి, విఫలప్రేమతో భగ్న హృదయుడినై జీవితం ఎడారిలో ఒంటరిలా గడుపుతున్నాను. నాకు ఎవరూ లేరు. పదివేలరూపాయల ఆస్తి ఉంది. అది అమ్మేసి ఆ డబ్బు మీకిచ్చేసి నేను ఏ హిమాలయాలకో వెళ్ళి పోతాను. నా జీవితంలో నా వల్ల ఎవరికీ సుఖం లభించలేదు. కనీసం ఒక కష్టజీవికైనా సహాయం చెయ్యగలిగానన్న తృప్తి ఉంటే చాలు."

తను ఆ మాటల్ని వెంటనే నమ్మలేకపోయింది. ఏం జరుగుతుందో ఊహించుకోలేకుండా ఉంది.

"కాని..." ఏదో అనబోయింది.

"దయచేసి మీకు నాకేమీ సలహా చెప్పవద్దు." అతను తీక్ష్ణంగా అన్నాడు. అతని ధోరణికి తను తబ్బిబ్బైంది.

"నేన నేది..."

"నాకు తెలుసు. నా కర్తవ్యం నాకు తెలుసు. మీరు ఒప్పుకోకపోతే ఇంకొకరికి ఇచ్చేసి పోతాను. నా లక్ష్యం ఏమిటో నేను నిర్ణయించుకున్నాను. అది మారబోదు. నేనడిగే ప్రశ్నలకి సూటిగా సమాధానాలు చెబితే, మీ 'టైం' అనవసరంగా వృథాకాదు" దృఢంగా అన్నాడతను. తనకి కొంచెం దెబ్బతగిలిన మాట నిజంకావు, అంతా తనకోసమే కదా! అంత వరకూ ఆ వ్యక్తి ఎవరోకూడా తనకి తెలియదు. ఇవాళ ఉచితంగా పదివేలరూపాయలు ఇస్తానంటున్నాడు. తనకి మతిపోతోంది.

"మీరు మాట్లాడేది నేనర్థం చేసుకోలేకుండా ఉన్నాను."

ఏం మాట్లాడుతుందో తనకే తెలియదు.

"ఇందాక చెప్పాను. ఆస్తి స్థిరాస్తి రూపంలో ఉందని."

"ఊఁ."

"అది ఇంకా నా స్వాధీనంలోకి రాలేదు."

"అయితే..."

"అది నా స్వాధీనంలోకి రావటానికి ఒకషరతు ఉంది."

"ఏమిటి ?"

"నేను 'ఫలానా' అమ్మాయిని ప్రేమించానని, అది ఫలించలేదని మా నాన్నకి తెలుసు. వివాహం చేసుకోమని ఆయన నన్ను చాలా బలవంత పెట్టారు. అది జరగనిపని. నామూలంగా ఆయనకి చాలా కష్టం కలిగింది. ఎంతో బాధపడ్డాను. ఏం చెయ్యను ? నా మూలంగా మరోజీవి జీవితాంతం దుఃఖించటం నేను ఎలా సహించగలను ? చివరికి మా నాన్న ఆఖరిప్రయత్నంగా తన స్వార్జితమైన స్థిరాస్తి విల్లు రాస్తూ, అది నేను వివాహం చేసుకున్నపక్షంలోనే నాకు చెందుతుందని రాసి, దానికి ట్రస్టీలని ఏర్పరిచారు. అదీ పరిస్థితి."

అతనివృత్తాంతం వింటుంటే తనకి జాలివేసింది. ఆ పితృహృదయం ఎంతగా బాధపడ్డదో!

కొంచెంసేపటిదాకా ఎవరూ మాట్లాడలేదు. తరవాత అతనే అన్నాడు.

"ఆఆస్తి నాకు సంక్రమించటానికి 'వివాహం' అడ్డువొచ్చింది."

"అయితే .."

"అవును. నాకుఇష్టంలేకపోయింది. ఆస్త్రీకోసం నేను బతకటంలేదు. అయినప్పుడు అది ఎలా పోతే నాకేం ? కాని ఇప్పుడు చింతిస్తున్నాను. ఆస్తి ఉండీ, ఇతరులకి సహాయం చెయ్యలేకపోతున్నానని."

మరయితే తనకి పదివేలుఇస్తానని ఎలా వాగ్దానం చేశాడు ? తనకోసం అతను ఇప్పుడు పెళ్ళిచేసుకుంటాడా ? అయితే ఆమెగతి ఏం కాను ?

"ఆ షరతు నెరవేరితేకాని అది నాకు లభ్యం కాదు. ముక్కుకు సూటిగా చెప్తున్నాను. మీరు ఒప్పుకుంటే మనం 'రిజిస్టర్ మేరేజి' చేసుకుందాం. ఆస్తిరాగానే మనం విడిపోదాం. తరవాత హిమాలయాలకి వెళ్ళిపోతాను" అతను తన కళ్ళల్లోకి మొదటిసారిగా చూశాడు. తనుకూడా అదేసమయంలో చూసింది. కొద్దిసేపటికింద అతనిమీద తనకున్న సదభిప్రాయం అంతా మంచులా కరిగిపోతోంది. ఇదంతా ఒకనటన అన్నమాట. ఇంకా అతనెంతో ఉదారహృదయుడు అనుకుంది.

తనవైపు అతను ఇంకా అలాగే చూస్తున్నాడు. తను కళ్లు దించింది. ఏం సమాధానం ఎలా చెప్పాలో తను ఊహించుకుంటోంది.

"ఇందులో మీరు అనుమానపడాల్సిందేమీ లేదనుకుంటాను. మీరు చదువుకున్నవారు. ఎంతో కష్టదశలో ఉన్నారు. 'సెంటిమెంట్స్'తో అంతగా కుస్తీపట్టక్కర్లేదనుకుంటాను. బతుకుముందు ముఖ్యం- మీలాంటివాళ్లకి. ఎంతో జీవితం ముందుంది. అనుభవించాల్సిన ఆనందం ఇంకా మొదలుకాలేదు. ఈ డబ్బుతో మీ ఇష్టం వొచ్చినంతవరకు చదువుకోవచ్చు. తరవాత జీవితంలో స్థిరపడొచ్చు."

ఏవేవో భావాలు తన మెదడులో దొర్లిపోతున్నాయి.

"నా మాటల్లోని నిజాయితీని మీరు అనుమానించాల్సిన అవసరం లేదు. డైవోర్సుపిటీషన్ మీదకూడా ఇప్పుడే సంతకం పెట్టి మీకిచ్చేస్తాను. ఒక సాంకేతికమైన చిక్కు తొలగించుకోటానికే ఇలా చేస్తున్నామనే భావంతో మనం ప్రవర్తించలేమా"

తను వింటోంది. తనకేమాత్రం ఇష్టం లేనిసంభాషణ అయినా మట్టిబొమ్మలా మాట్లాడకుండా నుంచునిఉంది. పరుషంగా 'వెళ్లిపొమ్మ'ని అనాలనుకుంది కాని ఏదో తనని మాట్లాడకుండా అడ్డుపెడుతోంది.

"అసంభవమనుకుంటున్నారా?" వివాహం పవిత్రమైన బంధం అని నేను ఒప్పుకుంటున్నాను. దానిని కేవలం ఆర్థిక ప్రయోజనాలకోసం వినియోగించుకోటం నైతిక విలువల పతనమని మీరనుకుంటున్నారనీ నాకు తెలుసు. కాని ఆర్థికంగా విలువలేని వాళ్ల జీవితాలు దుర్భరంగా చేసిన ఈ భౌతికప్రపంచంలో, తిండీ, బట్టా, ఇల్లూకూడా కరువై నామమాత్రంగా బతికున్నామని సంతృప్తిపడటంకంటె ఏ విధంగానో సమస్యాపరిష్కారానికి మనమీద మనం నమ్మకం కుదుర్చుకుని ప్రయత్నించటం మంచిదనుకుంటాను. ఏమంటారు?"

అతని వాగ్ధోరణికి తను కొంచెం చలించింది. అతను ఆవేశంగా, నిష్కల్మషంగా కనిపించేలా మాట్లాడుతుంటే తను మూర్ఖంగా తిరస్కరించటం తన విజ్ఞానానికి, తన విజ్ఞతకి ఏమంత ఘనం? తటపటాయిస్తూ అంది. "కాని..."

"నేను నిష్కల్మషంగా చెబుతున్నాను. ఈ నామమాత్ర వివాహం అయినతరవాత మళ్లీ మిమ్మల్ని నేను కలుసుకోటం డబ్బు మీ కివ్వటానికి వొచ్చే రోజునే. ఆ పని అయింతరవాత నా దారిన నేను పోతాను. నన్ను నమ్మటానికి మీకేమీ అభ్యంతరం లేదనుకుంటాను."

అతని ప్రవర్తన కేవలం నటనే అయితే అంత ఆత్మవిశ్వాసం ఉట్టిపడేలా ఎలా మాట్లాడగలడు? తనకీసహాయం చెయ్యటంకోసం అతను అంత కష్టపడటం చూసి తను మనస్ఫూర్తిగా అతన్ని నమ్మింది. కాని అతనే మళ్లీ అన్నాడు.

"అయినా మిమ్మల్ని నిరాధారంగా నన్ను నమ్మమని అడుగను. రిజిస్ట్రారు ఆఫీసులో 'విల్లు' కాపీకి దరఖాస్తు పెడతాను. మీరే స్వయంగా అది చూసి నా ఋజుప్రవర్తనని నమ్మగలరు. తరవాత నేను ఫలానా అని కూడా మన కరణంగారిచేత ఋజువు పరుస్తాను. ఇంకా ఏవైనా మీకు అనుమానాలున్నాయా?"

ఇహ తనేం మాట్లాడగలదు? అతనివైపు అలా గుడ్లప్పగించి చూడటంకంటె ఏమీ చెయ్యలేకపోయింది. తను మాట్లాడకపోవటం చూసి అన్నాడు అతను.

"మీరు 'సెంటిమెంటల్'గా ఫీలవుతున్నారనుకుంటాను. బాగా ఆలోచించండి. మీ ఇష్టం. కాని వ్యవహారం త్వరగా తెమిలిపోతే బావుంటుంది. నా దోవన నేను పోతాను-ఈ బాహ్య ఆకర్షణలూ, కృత్రిమవాతావరణం, నిరంతర సంసారజంజాటం లేని ప్రశాంతస్థలంలోకి."

అంతర్యుద్ధాన్ని అకస్మాత్తుగా ముగించి అంది తను "మిమ్మల్ని నమ్ముతున్నాను. మీ ఇష్ట మొచ్చినట్టు చెయ్యండి."

అతను తన కళ్లలోకి చూశాడు. ఎంతో జాలి ఆ కళ్లలో ప్రతిఫలించినట్టుగా తను అనుకుంది. నీళ్లు కూడా తిరిగాయని తన అనుమానం.

అన్నట్టుగా అతను అన్నిఋజువులు చూపించాడు. ఏదో చూసింది. తనకేం తెలుసు? అయినా అతను మంచివాడనీ, మోసగాడు కాడనీ అతన్ని చూస్తేనే తెలుస్తోంది. లేకపోతే అంతఅదురూ బెదురూ లేకుండా ఆత్మవిశ్వాసంతో, కేవలం వ్యవహారరీత్యా మాత్రమే మాట్లాడుతూ ఎలా ప్రవర్తించగలడు? ఇంటియజమాని బాకీ తీర్చటానికి రెండువందలూ, మరో రెండువందలు ఖర్చుకీ ఇచ్చాడు. కేవలం యాంత్రికంగా స్వీకరించింది. చెయ్యకూడని పని

చేస్తున్నట్టుగా బాధపడ్డది. కాని ఆ నిస్సహాయ స్థితిలో దొరికిన ఆ కొత్త ఆధారం ఎలా వొదులుకోటం ?

పెళ్లిఅయింది. అన్నీ తెలిసిఉండీ, ఫలితం ఎలా ఉండటానికి అవకాశం లేకపోలేదో ఆలోచించి కూడా ధైర్యంగా ముందుకి ఉరికింది. తనేం తప్పు చేసింది ? లోకం తనని ఒంటరిగా, ఏవీ సంబంధం లేనట్టుగా వొదిలి తనదారి తను చూసుకోకుంటే ఏం చెయ్యగలదు ? అయినా తను బాధపడుతూనే ఉంది. ఆ రోజునించీ తనకి మానసికంగా శాంతి దూరమయింది. నెలా, రెండూ, మూడూ, నాలుగు నెలలు గడిచాయి. అప్పటిదాకా ఆశతో ఎదురుచూసింది. మరో నెల ఆశ, నిరాశల తెరమరుగులతో గడిపింది. ఆస్తి రావటానికీ, అమ్మివేయటానికీ ఇన్ని రోజులు కావాలా ? ఒకవేళ కావాలిసివొచ్చినా ఉత్తరం ముక్క రాయొచ్చు కదా ! పెళ్లిఅయిన తర్వాత మళ్లీ కనిపించకపోతే ఎంతో నిజాయితీ కలవాడని మెచ్చుకుంది. డైవోర్సు పిటీషన్ కూడా తనచేతిలో పెడితే ఆదర్శవంతుడనుకుంది. అది ఉపయోగించే పద్ధతి తనకి తెలీదు. అయినా ఫరవాలేదు. కనుక్కోవచ్చు. కాని ఇంతవరకూ వొచ్చి ఇప్పుడు తొందరపడితే...

ఎదురుచూస్తూనే ఉంది, నిరాశగానే అయినా. తన అమాయకత్వానికి తనకే నవ్వొస్తోంది - అంత విచారంలోకూడా. బాహ్యవిలువల్ని నమ్మమని ఎవరు చెప్పారు ?...ఆ వరదరాజు ఎప్పుడో తన దగ్గరకి రాకతప్పదు. రాకపోతే మోసం చెయ్యటంలో అర్థంలేదు. ఒక దీర్ఘమైన ఘాటైన ఉపన్యాసం తయారుచేసుకుంది-మనసులోని కసిఅంతా మాటల్లో ఇరికించి.

ఇన్నాళ్లకి కనిపించాడు. రాధ అతనివైపు కోపఘూర్ణితంగా అలాగే చూస్తూ నిలబడింది. ఏం సాకు చెబుతాడో చూడాలి. ఇహ అతని మాయమాటలకి లోబడటం వొట్టిది. నిశ్చితమైన మనసుతో రాధ లోపలికి పోవటానికి వెనక్కి తిరిగింది. ఆ తిరగటంలో ఇంటిముందరి పాదాలగుర్తులు మళ్లీ కనబడ్డాయి. ఇంటిదాకావొచ్చి అతను తనతో మాట్లాడకుండానే ఎందుకు వెళ్లిపోయినట్టు ? బహుశా ధైర్యం చాలలేదేమో ! ఇంతలో ఆమెకి టక్కున ఓ విషయం జ్ఞాపకం వొచ్చింది. డబ్బు తీసుకువస్తే గాని అతను మళ్లీ తనదగ్గరికి రానన్నాడు. ఆ విషయం అకస్మాత్తుగా జ్ఞాపకంవొచ్చి మాట నిలబెట్టుకోటానికి అలా వెళ్లిపోయాడేమో ? ఇంతవరకూ ఆలస్యం కావటానికి బహుశా ఏదైనా చిక్కు వచ్చి ఉండవచ్చు. ఆ విషయం చెప్పిపోవటానికి వచ్చి మళ్లీ మనసు మార్చుకున్నాడా ?

రాధ నిట్టూర్పు విడిచింది. తను అతన్ని అనవసరంగా సమర్థిస్తోంది. తన ఈ తెలివితక్కువతనమే ఇంతవరకు తెచ్చింది. ఇంకా ఆ పిచ్చిఊహలు తనని వదలటంలేదు. రాధకి తనమీద తనకే వెర్రి కోపం వచ్చింది. ఆ కోపంలో తనకే శాస్తి కావలసిందేనని అనుకుంది. మళ్లీ తన నిస్సహాయతే జ్ఞాపకం వొచ్చి కళ్లనీళ్లు పెట్టుకుంది.

శూన్యహృదయంతో, కన్నీటితో బరువెక్కిన రెప్పలతో అలా ఎంతసేపు గతాన్ని స్మరిస్తూ, భావిని ఆలోచించి భయపడుతూ, గోడకి చేరగిలబడి ఉందో ఆమెకి తెలియదు. చిన్నదగ్గు వినిపించి ఉలిక్కిపడి చూసింది. అప్పుడప్పుడే ఆవరించిన చీకటిలో నీడలా ఎవరో మనిషిని చూసి భయంతో లేచి నిలబడింది.

"ఎవరు?" వెంటనే జవాబు రాలేదు. మళ్లీ ప్రశ్నించింది.

"నేను వరదరాజుని."

రాధముఖం ఒక్కసారిగా ఎర్రబడటం ఆ చీకటిలో అతను గమనించలేదు. మృదువుగా అన్నాడు "రాధా!" ఈ పిలుపులో మిగిలిన కొత్త సహనం కూడా ఆమెకి అంతరించింది. కటువుగా "ఏం కావాలి ?" అంది. అతను విస్తుపోయాడు. మళ్లీ తేరుకుని, కొంచెం తటపటాయించి అన్నాడు. "దీపం లేదా ?" అతని మాటలు అనటం నిప్పుపెట్టెకోసం తడుముకుంటున్న రాధ, నిప్పుపుల్ల వెలిగించటం ఒకే సారి జరిగాయి. దీపం వెలుగులో వరదరాజు ముఖం వైపు తీక్ష్ణంగా చూసిందామె. అతను చాలా దీనంగా ఉన్నాడు. కాని ఈ సారి ఆమె మోసపోదల్చుకోలేదు. అతను ఎలా మొదలుపెట్టాలో తెలియక తడుముకుని అన్నాడు.

"మొదట రాకూడదనే అనుకున్నాను..."

"నాకు తెలుసు."

అతను ఆమెవైపు ఆశ్చర్యంగా చూశాడు. "ఎలా?"

"నాకూ కళ్లున్నాయి."

తనురావటం ఆమె చూసిందన్నమాట. అయినా పిలవలేదు.

"తరవాత వొకసారి కనబడిపోవటమే మంచిదనుకున్నాను."

"నేనూ అదే అనుకున్నాను."

"ఏది?"

"మీరలా అనుకోక తప్పదని..."

"ఎందుకని?"

"అది స్పష్టంగా తెలుస్తూనే ఉంది."

"మీరేమనుకుంటూ ఏం మాట్లాడుతున్నారో నాకు తెలియటంలేదు. పోనీండి. వచ్చినపని క్లుప్తంగా చెప్పి వెడతాను." అతను ఆగాడు.

"మీరు చెప్పబోయేది ఏదో నాకు తెలుసు. ఎందుకు పాపం. మీ కనవసర శ్రమ."

"ఏం చెప్పబోతున్నాను?"

"ఆ స్త్రీవ్యవహారంలో ఏదో అనుకోని చిక్కు వచ్చిందని..."

"మీకెలా తెలుసు."

"నేను బహుశా మీరనుకున్నంత తెలివితక్కువదాన్ని కానేమో."

"మీరు తెలివితక్కువవారని ఎవరన్నారు?"

"చర్యలవల్ల తెలుస్తూఉంటే, ఇంకా అనటమెందుకు?"

"మీకు కోపం రావటంలో అర్థం లేకపోలేదు. కాని నేను చెప్పేది..."

అతను ఇంకా తన తప్పు ఒప్పుకోకపోవటం చూసి రాధకి వొళ్లుమండింది. కన్నీటితో ఎర్రనైన కళ్లు, కోపంతో మరింత ఎర్రబడ్డాయి. తీక్ష్ణంగా అతని వైపుచూస్తూ అంది.

"ఏమిటి మీరు చెప్పేది?"

ఆ ఉద్ధృతం చూసి వరదరాజు చకితుడై ఆమె వైపుచూశాడు. కోపంలో ఆమె పెదవులు వొణుకుతున్నాయి. సహజంగా సువర్ణచ్ఛాయలో ఉండే ఆమె ముఖవర్చస్సు రాగరంజితమై మరింత మనోహరంగా ఉంది. వరదరాజు కొంచెంసేపటివరకూ అలాగే దృష్టినిలిపాడు. ఒకక్షణం ఆమె కోపంగా ఉందనే సంగతి మర్చిపోయాడు. ఆ క్షణంసేపూ తను అక్కడికి ఎందుకు వొచ్చాడో అతనికి జ్ఞాపకం రాలేదు. అతను తనవైపు అలా పరకాయించి చూడటం చూసి రాధ ముఖం పక్కకి తిప్పుకుంది ఆమె అనదలుచుకున్నమాటలన్నీ అనలేకపోతోంది తను అనవసరంగా తొందరపడుతున్నదేమోననే అనుమానం ఆమెకి యింకా పోలేదు. ఏమైనా, అతను చెప్పదలుచుకున్నదేదో పూర్తిగా విని తను అనాలిసిన మాటలు అనటం మంచిదని తమాయించుకుంది.

రాధ ముఖం పక్కకితిప్పుకోటంతో వరదరాజుకి తన పరిస్థితి అర్థమైంది. తను ఏం చెప్పినా ఆమె నమ్మేస్థితిలో లేదు. మనుషులు మనుషుల్ని ఇంత అపనమ్మకంతో ఎందుకు చూడాలి? తను ఏం చెయ్యబోయాడు. ఏం చెయ్యదల్చుకున్నాడు? ఏం చేస్తున్నాడు? తననిఆమె ఎందుకు నమ్మదు. మనుషులంతా ఇంతేనా? అతనికి రాధమీద ఉన్నట్టుండి అమిత కోపంవొచ్చింది. తను ఆమెకి బుద్ధిపూర్వకంగా ఏమీ అపకారం తలపెట్టలేదు. ఇకముందుకూడా ఏమీ చెయ్యదలచుకోలేదు కూడా. అయినప్పుడు ఆమె అనవసరంగా నీడని చూసి బెదరటం ఎందుకు? తనని తను నమ్మలేక ఆ అపవాదు పక్కవాడిమీద వేసే ఈ దౌర్బల్యం జయించలేక జీవితం దుఃఖభాజనం చేసుకునే ఇలాంటివారిమీద తను ఎందుకు కనికరం వహించాలి?

వరదరాజు మెదడులో విహ్వలభావం క్రమంగా వ్యాపించింది. పరులకష్టాల్ని ఆదుకోబోయాడు. అందుకే శిక్షింపబడుతున్నాడు! ప్రపంచం ఇంత స్వార్థపూరితంగా ఎందుకు తయారవుతోందో తనకి పూర్తిగా తెలిసిపోయిందనుకున్నాడతను. స్వార్థం కోసం పాటుపడకపోవటంవల్లే గదా తను ఈ నిందని మీద వేసుకోవలసిరావటం. వొచ్చిన నింద రానే వొచ్చింది. ఇహ తను ఆమెకెందుకు భయపడాలి? ఆమె ఏమనుకుంటుందో అని ఎందుకు మథనపడాలి?

వరదరాజు మనసు భయానకంగా వక్రించింది. తను ఆమెభర్త. అతనిలో ఏవో శక్తులు విజృంభించాయి. "రాధా!"

రాధ ఆ స్వరం విని బెదిరి అతనివైపు చూసింది. తన స్వరం విని వరదరాజే దిగ్భ్రాంతుడైనాడు.

ఆ పిలుపులోనికోపం, కాఠిన్యం, అధికారం – అన్నింటినీ మించి దౌర్జన్యం అతని మనసుని చికాకు పరిచాయి. అవన్నీ కాక ఆ పిలుపులో మరేదోభావం- అవ్యక్తంగా, అస్పష్టంగా ఇమిడిఉన్న ఇంకేదో భావం వరదరాజు మానసవీధిలో గోచరించింది. తనలో ఇన్ని దుర్గుణాలు అణగారి ఉన్నాయని అతనెప్పుడూ అనుకోలేదు. ఎలా సాహసించగలిగాడు తను? అతని మనసు కుంగిపోయింది. పశ్చాత్తాపంతో ఆమెవైపు చూశాడు. రాధ ఏమీ అర్థంకాక

ఏమనాలో తోచక శూన్యంగా చూడసాగింది. అతనిలో ఒక్కసారిగా జాలికలిగింది. తన పరిస్థితి సరిగాలేదు. ఇహ ఇక్కడ ఉండకూడదు. అతను లేచి నుంచున్నాడు.

“క్షమించండి” అని మాత్రం అనేసి బరువుగా అడుగులు వేసుకుంటూ గుమ్మందాటాడు. అతను పోవటం ఊరికే చూస్తూ ఉండటంకంటె రాధ ఏమీ అనలేకపోయింది. తను ఏదో తప్పుచేసినట్లుగానే ఆమె భావించుకుంది. ఆమెకి ఏమీ తోచలేదు. తనకి ఏమీ చేతకాదనీ, ఆలోచించి మనసుని పాడు చేసుకోటం, అవకాశాలని పాడుచేసుకోటంకంటె ఇంకేమీ చెయ్యలేదనీ ఒకనమ్మకం ఆమెలో పాతుకుపోతోంది. తను అలా మాట్లాడటానికి తగిన కారణం ఉందని ఆమెకి తెలియకపోలేదు. అయినాకూడా తనమీదే తప్పంతా తోసివేయబడటం ఎందుకో, అతను తన నామాత్రం ఎందుకు అర్థం చేసుకోలేడో ఆమెకి తెలియలేదు. పరుషంగా మాట్లాడవలసింది తను. కాని చివరికి అతనే తనని అధికారయుక్తంగా ఆజ్ఞాపిస్తున్నట్టుగా మాట్లాడగలిగాడు. రాధ నుదురు గట్టిగా పట్టుకుని కూలబడ్డది.

వరదరాజు నడుస్తున్నాడే కాని ఎటు పోతున్నదీ అతనికి తెలియదు. తను ఆమెని అలా పిలవటం ఎలా సంభవించింది? రాధ తీవ్రోక్తులు తనని కోపింపచేశాయా? ఆమె అలా మాట్లాడటంలో తప్పేముంది? తన వాగ్దానంప్రకారం తను నడవలేకపోయినప్పుడు ఆమె తన ప్రవర్తనని అనుమానించటంలో తప్పేముంది? అయినప్పుడు ఆమె - ఆ స్థితిలో ఉన్న ఏ స్త్రీఅయినా - తనని అలా ఎదుర్కోటంలో అసహజం కాని, అన్యాయం కాని ఏముంది? అసలు ఆమె అలా అనటానికి అవకాశం ఉందనే తనుకూడా అనుకొన్నాడు కదా! అకేందు కదా తను ఆమెతో చెప్పకుండా ఇన్నాళ్లు ఉంది. తన ప్రయత్నాలుకూడా ఆ ఉద్దేశంతోనే కదా చేసింది. అయినప్పుడు తను అకాత్తుగా కోపించటంలో అర్థంలేదు. ఇందులో ఇంకేదో రహస్యం ఉంది. ఆమె మాటల్లోని తీవ్రతకాకుండా, వాటిలో ప్రస్ఫుటంగా కనిపించే స్వార్థం తనకి కోపం తెప్పించింది. తను స్వార్థరాహిత్యంతో ఒకపని చేస్తున్నప్పుడు తనకి స్వార్థం అంటకట్టటంలో గల స్వార్థం చూసి తనకి వొళ్లుమండింది. కాని ఇందులోకూడా మళ్లీ ఇందాకటి చిక్కే వొస్తోంది. ఆమె అంత పరుషంగా మాట్లాడటానికి కారణం ఉందని తను ఒప్పుకున్నాడు. మరే స్త్రీ అయినా అలాగే ప్రవర్తించి ఉంటుందని కూడా ఒప్పుకుంటున్నాడు. అయినప్పుడు ఇందులో స్వార్థం ప్రసక్తిరాదు ఆమె తనమీద నిందవెయ్యటానికి ప్రయత్నించిందా? ఆమెభావం ఇదేనని వేరే చెప్పటమెందుకు. అసలలా మాట్లాడటానికి మూలకారణం అదే కదా!

అయితే తనకి కోపం తెప్పించింది. వీటిలో ఏదీ కాదు. వరదరాజుగుండె వేగంగా కొట్టుకుంది. దేవుడా! ఆమె మాటల్ని తరిచి తరిచి ఆలోచిస్తే ఏం లాభం? తప్పు తనమీద ఉంది! అవును. నగ్నంగా కనిపిస్తున్న నిజం తను ఇందాకటినించీ చూడదలుచుకోలేదు. తను అనుకున్నంత పవిత్రుడు కాడు వరదరాజు? అది దాచి లాభంలేదు. తను కేవలం మానవమాత్రుడు. మానవసహజమైన దౌర్బల్యాలూ, లోపాలూ తనకి లేకుండా ఎలా పోతాయి? తన హృదయం చితికిపోయిందనీ, తన మనసు లౌకిక సుఖాల్ని ఆశించదనీ, తను బతికే మృతుడైనట్టేననీ భావించుకుంటున్నాడు. అది ఘోరమైన అసత్యం. రాధని చూసినప్పటినించీకూడా బహుశా, తన మనసు రహస్యంగా, తనకే తెలియనివ్వకుండా (!) ఆమెవైపు మళ్లింది. అందుకే ఎలాగైనా తను ఆమెని వశంచేసుకోవాలని అంతరాంతరాలలో కోరుకున్నాడు. అందుకే ఆమె మాటల్లో తప్పుపట్టటానికి ప్రయత్నించాడు. తప్పంతా ఆమెమీదికే తోసేయాలనుకున్నాడు. తనని నిందించినంత స్వార్థం కల స్త్రీపట్ల స్వార్థత్యాగం అనవసరమని సరిపెట్టుకోటానికి చూశాడు. ఎలాగైనా దొరికిన అవకాశం వినియోగించుకోవాలని తనలో ఏవో శక్తులు సర్వవిధాలా ప్రయత్నించాయి. ఇంకా నయం, త్వరలో మేల్కొన్నాడు. ఒక్కనిమిషం ఆలస్యం అయి ఉంటే ఆమె జీవితం ఏమయిఉండేదో! ఏమయినా, తనకి ఇప్పుడు గర్వంగా ఉంది. మానవసహజమైన దౌర్బల్యాలని మానవసహజమైన విజ్ఞానంతో ఓడించాడు.

ఎన్నోరోజులతరవాత ఆ రాత్రి వరదరాజు ప్రశాంతంగా నిద్రించాడు. నిద్రలో అతనికి చిత్రమైన కలవచ్చింది. పొగమంచు దట్టంగా వ్యాపించింది. చుట్టుపక్కల ఏ వస్తువూ కనిపించటంలేదు. అంతా అయోమయంగా ఉంది. తను తప్ప ఇహ ఎవరూ తన సామీప్యంలో సంచరించటంలేదు. తను ఎటు పోతున్నదీ తెలియదు. తనదారికి ఎక్కడా ఏదీ అడ్డం రావటంలేదు. కాళ్లకింద మృదువైన లతలెన్నో నలిగిపోతున్నట్టుగా ఉంది. తటాలున ఏదో గోతిలో జారిపడ్డాడు. అలా ఎంతసేపున్నాడో తెలియదు. క్రమంగా చుట్టుపక్కల వస్తువులు గోచర

మవుతున్నాయి. వెలుగు క్రమంగా వస్తోంది. తను ఒక్కడే కాదు - ఆ ప్రాంతంలో. ఇంకా ఎంతో మంది జనం హడావిడిగా తిరుగుతున్నారు. గట్టిగా కేక వేశాడు. ఎవరూ వినిపించుకోలేదు. మళ్లీ కేక వేశాడు.

కళ్లు నులుముకుని చుట్టూ చూశాడు వరదరాజు. చీకటిగా ఉంది. గోతిలో కాదు, పక్కమీద ఉన్నాడు.

ఈ సంఘటన తరవాత వరదరాజుకి ఆత్మపరీక్ష ఎక్కువైంది. రాధనిగురించి ఎక్కువగా ఆలోచించటం మానుకోదల్చుకున్నాడు. కాని పరాకుగా ఉన్న సమయంలోమనసులో రాధ ప్రతిబింబం ప్రత్యక్షమవుతోంది. ఆమెని మళ్లీచూడాలనే వాంఛ ఎక్కువౌతోంది. నిశితంగా ఆలోచించి అతను తీర్మానించాడు. తను రాధని ప్రేమిస్తున్నాడు. సందేహం లేదు. కాని ప్రేమ అంటే ? మళ్లీ అతనికి డోలాయమానంగా ఉంది. రాధ అంటే తనలో ఏదో అనిర్వచనీయమైనఅభిమానం,ఏదోసన్నిహితమైనబాంధవ్యం తరాలనుంచి వోస్తున్నట్టుగా అనుభూతి, కలుగుతున్నాయి.'ప్రేమ'అంటే ఇంతకంటె మరేదీకాదని అతనికి తోచింది, కాని, రాధదగ్గిరికి తను ఎలావెళ్లగలడు? తనని చూడగానే ఆమె తారాజువ్వలా ఐపోతుంది. ఆమెకిచ్చిన వాగ్దానంప్రకారం ఎలాగైనా పదివేలు సంపాదించి ఆమెచేతిలో పెట్టాలి. తనమాటలమీద విశ్వాసం వమ్ముకాలేదని ఆమె గ్రహించాలి. కాని పదివేలు ఎలా సంపాదించగలడు ?

వరదరాజు, చేతిలోఉన్న కాస్త డబ్బూ గుర్రపు పందాలలో, ఖర్చుపెట్టి అదృష్టం పరీక్షించుకోవాలనుకున్నాడు. పరీక్షించుకుని తన దురదృష్టం నిరూపించుకున్నాడు. ఇహ తను చేయగలిగిందేమీ లేదు. రాధతో ముఖాముఖి మాట్లాడి పరిస్థితి ఆమెకి విశదపరచటంకంటె ఆచరణీయమైన పద్ధతి ఏమీ తోచ లేదు అతనికి.

వరదరాజు వెళ్లేసరికి రాధ అలవాటుప్రకారం గత జలసేతుబంధనంలో నిమగ్న అయి ఉంది. అతన్ని చూడగానే జుగుప్సాభావంతో ముఖం చిట్లించుకుంది. అది గమనించగానే అతను చిన్నబుచ్చుకున్నాడు.

"ఏం కావాలి ?" కటువుగా అడిగింది రాధ.

ఇంకేదో కావలసివొస్తే తను ఆమెదగ్గిరి కెందుకు రావటం.

"దురదృష్టవశాత్తూ నా వాగ్దానం అన[illegible] ప్రకారం నెరవేర్చుకోలేకపోయాను."

"ఇహ ఆ విషయం ఎత్తకండి."

"నా మీద నుండే మీరు దురభిప్రాయం కలిగించుకుంటే ఏం లాభం ? పరిస్థితుల్ని తెలుసుకుని మంచిచెడ్డలు పరిశీలించటం విజ్ఞులలక్షణం. సాహార్థంతో విమర్శనకి పూనుకోటం బుద్ధిమంతుల లక్షణం."

"ఇప్పుడు మీరు లక్షణగ్రంథాలు తిరిగెయ్యక్కర్లేదు."

"మీరు విన్నా వినకపోయినా రెండుముక్కలు చెప్పి పోదల్చుకున్నాను."

"చేసిన అపకారం చాలక ఇంకా సన్నెందుకు బాధిస్తారు ?"

వరదరాజుకి కోపం రావటంలేదు. కాని విసుగుదలతో బుర్ర గోక్కున్నాడు.

రాధ ఉద్రేకం ఆపుకోలేకపోతోంది. వరదరాజు అనుకున్నదంతా చెప్పటానికి సందేహిస్తున్నాడు. కాని ఏదో తేల్చివెయ్యటం మంచిదని తోచిందతనికి, అన్నాడు.

"మీరు నన్నిలా అనుమానించటంలో అర్థం ఉంది. అందుకు నేను కోపగించుకోను. ఆ స్పే విషయంలో అనివార్యమైన చిక్కు రాకపోతే నా మంచితనం నిరూపితమై ఉండేది. అసలీ ఆ స్తికి..."

"ఈ కుంటిసాకులు నేను వినను" దృఢంగా అందిరాధ.

అతను ఆమెవైపు సారి చూసి, "ఓపోనీ ఆ విషయం చెప్పనులెండి" అన్నాడు.

"ఏ విషయమూ మీరు చెప్పనవసరంలేదు. నన్నిలా బతకనియ్యండి."

"మీకంత కష్టం కలిగిస్తున్నానని నాకు తెలియదు. మీరు నన్నెంత తృణీకారభావంతో చూస్తున్నారో, నేను మిమ్మల్ని అంతకంటె ఎన్నోరెట్లు ఎక్కువగా..." అతను వాక్యం పూర్తిచేసేముందు ఆమె కళ్లలోకి సూటిగాచూస్తూ భావోద్రేకంతో నెమ్మదిగా, దృఢంగా, నిజాన్ని బయటపెడుతున్నట్టుగా అన్నాడు—"ప్రేమభావంతో చూస్తున్నాను."

ఈమాటలతో రాధసహనానికి ఆఖరిపట్టుకూడా విడిపోయింది. ఇన్నాళ్లనించీ తను అనుమానించినా

...సారం లేకుండా నిందించటం తొందరపాటును ...త్రం చెయ్యటమేననే ధోరణిలో మాట్లాడుతూ వొచ్చింది. ఇప్పుడు మనిషి అసలురంగులలో బయటపడ్డాడు. ఆమెలో అవమానం, అపహాసం, అభిమానం, క్రోధం, జుగుప్స అన్నీ మూర్తీభవించాయి. తనని తానే మర్చిపోయి మండేకళ్లతో నిప్పులవర్షం కురిపించింది. పెదవులు వ్యంగ్యంగా వరదరాజుని చూసి పకాలున నవ్వాయి.

"నిస్వార్థ ఋషిపుంగవులకి హిమాలయాలమీది భ్రమ తొలగిపోయినట్టుంది."

వరదరాజు ఏమీ మాట్లాడలేదు. ఆమె నవ్వు అతనిగుండెల్లో గుచ్చుకుంది. రాధ తటాలున నవ్వు ఆపేసి గంభీరంగా, తీక్ష్ణంగా శక్తులన్నీ కూడదీసుకుని దులిపెయ్యసాగింది.

"మనిషిలో స్వార్థంకంటె మాటలలో తేనె ఎక్కువ ఉంటుందని నాకు తెలీదు, మీతో పరిచయం అయ్యేదాకా. మా ఇంటి యజమానిని స్వార్థపరుడని తిట్టాను. కాని అతను చెయ్యదలచుకున్నదేదో స్పష్టంగా చెప్పి చెయ్యటానికి సిద్ధపడ్డాడు. ఆర్థికంగా నా హీనస్థితిని తన స్వార్థానికి ఉపయోగించుకోవాలనుకున్నాడు. అది ఎంత హేయమైనా, దాంట్లో తెరమరుగు వ్యవహారం లేదు. నమ్మకద్రోహం లేదు. తేనెమాటల వెనకాల విషగుళికలు లేవు. దొంగ సాకులు లేవు. నాటకం లేదు. వేషాలు లేవు. పిరికితనం లేదు. రాత్రి కన్నంవేసే దొంగకంటె బందిపోటు దొంగ నయం. చేసేది బహిరంగంగా చెయ్యటం ఉత్తమం. వలలుపన్ని ఉచ్చులు బిగించే కిరాతకుడికంటే, తుపాకితో కాల్చి చంపే వేటగాడు నయం.

"ఒక నిస్సహాయ స్త్రీని లోబరచుకోటంకోసం ఇంత ప్లాను కావాలా? ఇంత తెలివితేటలు కావాలా? ఇన్నిరోజులు కాచుకుకూచోవాలా? ఇంత దొంగజపం చెయ్యాలా? ఇంత కష్టపడి దొంగవేషం వేసుకోవాలా? ఇంత కుతంత్రం పన్నాలా?

నాలో ఏం చూసి ఇన్నిబాధలు పడ్డారు? పాపం, ప్రేమించారా? ప్రేమించి వివాహం చేసుకోటం సాధ్యంకాకపోయేసరికి, వివాహం ఏ విధంగానైనాముందే చేసుకుని తరవాత తీరిగ్గా ప్రేమిద్దామనుకుని ఇలా చేశారా? ఎంతశ్రమ! శ్రమపడ్డ తరవాత ఫలితం దక్కకపోతే ఆత్మహత్య చేసుకోడానికి సిద్ధపడతారేమో! నాకెందుకు ఆ పాపం మీ ఇష్టం వొచ్చినట్టు చేసుకోండి. ఎలాగైతే ఏం మీ తంత్రం పారింది. చట్టంరీత్యా నేను ఏమీ చెయ్యలేను. అది మీకూ నాకూ కూడా తెలుసు.

మనిషి ఎవరినైనా నమ్మవచ్చుకాని మనిషిని మాత్రం నమ్మకూడదనే వాక్యం నిజం చేశారు. నమ్మకద్రోహం మరేమంత కష్టం కాదనికూడా కష్టపడి ఋజువుచేశారు."

వరదరాజు తలవొంచుకు కూచున్నాడు. రాధ అనే ప్రతిమాటా అతనిగుండెలో గుచ్చుకుంటోంది. అయినా ఏమీ అనలేదు. అతని మౌనం ఆమెకి మరింత దుస్సహంగా ఉంది. ఎంతఘాటుగా, సూదిపోటు మాటలన్నా ఆమెకి కసితీరటంలేదు. పదాలు దొరకటంలేదు. ఆవేదన, ఆవేశం ఉపశమించలేదు. పదాల అభావంవల్ల అవి బయటపడే మార్గంలేక కన్నీరుగా మారి ఏకధారగా ప్రవహించసాగాయి.

"నేను మీకేం అపకారం చేశాను? అసలే కష్టాలతో పోరు భరించలేకుండా ఉన్న నా మీదే మీ సామర్థ్యం ఉపయోగించాలా? ఏమీ చెయ్యలేని నిస్సహాయస్థితిలో ఉన్నాననే కదా మీరిలా ధైర్యం చెయ్యగలిగారు. మీరు చెయ్యదల్చుకున్న ఆ మిగతా కార్యక్రమంకూడా చేసెయ్యండి. ఏమయినా భరించటానికి సిద్ధంగా ఉన్నాను. ఎందుకలా చూస్తారు? మీరు చేతకానివారు కారు. "ఏమిటీ వాగుడు?" అని గద్దించండి. బెదిరించండి. మీ అధికారం చలాయించుకోండి. మీ ఆధిక్యత ప్రదర్శించుకోండి. మీరేం చేసినా చెల్లుతుంది కదా. అడ్డుపెట్టేదెవరు? అడిగేదెవరు? ఒక్క ఆడది మిమ్మల్నేం చెయ్యగలదు?..."

వరదరాజు ముఖాన నెత్తురుచుక్క లేదు. అవమానంతో అతను కుంగిపోయాడు. రాధమీద అతనికి కోపం రావటానికి ఆస్కారంలేదు. ఆమె ఏమన్నా అందులో ఆశ్చర్యపడాలిసింది లేదని ఇదివరకే తను తెలుసుకున్నాడు. తనమీద తనకే కోపం వొచ్చింది. తను ఎంత సిగ్గులేకుండా ప్రవర్తించగలిగాడు! తను ఇన్నాళ్లనించీ బతికిఉంది. ఇలా ఘోరంగా అవమానించబడడానికేనా?

"మీ పాదాలకి శతసహస్ర నమస్కారాలు. దయచేసి ఇకనించైనా నన్నిలా బతకనివ్వండి. నా జీవితం ఎలాగూ ధ్వంసంఅయింది. ఆ బతకాలిసిన నాలుగురోజులూ అయినా కొంచెం శాంతి ఉండనివ్వండి నాకు."

వరదరాజు ఆమెముఖంవంక తేరిపారచూశాడు. ఆమెచీరచెరగు నోటికి అడ్డంపెట్టుకుని పొంగిపొర్లే

దుఃఖం ఆపుకుంటోంది. ఆ దృశ్యంచూసి అతని మనసు వికలమైంది. ఆమె దగ్గరగా వెళ్ళి అనునయించాలనే గాఢవాంఛ కలిగిందతనికి. లేచి నుంచున్నాడు. రెండడుగులు ఆమెవైపు వేశాడు. ఆమె బెదురు చూపులుచూసి తటాలున లోపలిగదిలోకి వెళ్లి తలుపు దిడాలున వేసుకుంది.

ఒకక్షణం వరదరాజు తను ఏ లోకంలో ఉన్నాడో మర్చిపోయాడు. ఆ క్షణంలో తను మరణిస్తే బావుండుననుకున్నాడు. కొంచెంసేపు అలాగే నిలబడి, మూసినతలుపువైపు శూన్యంగా చూసి వెనక్కి తిరిగి ఇల్లుదాటి రోడ్డుమీదికి నడిచాడు. రాధ అన్నమాటలు అన్నీ అతనికి జ్ఞాపకం రాసాగాయి. తను కిరాతకుడుగా, దొంగగా, వేషధారిగా హృదయంలేని రాతిబొమ్మగా చిత్రించబడ్డాడు. అవును. కారణం ఏమైతేనేం. తను ఇచ్చిన మాటల నిలబెట్టుకోలేకపోయాడు. దానివల్ల కలగబోయేదుష్ఫలితం తనకి తెలియనిదికాదు. ఇచ్చినమాట ఏ పరిస్థితిలో అయినా నిలబెట్టుకోగల శక్తిలేని తను అసలు ఎందుకు రంగంలోకి దూకాలి. మానంకంటె ప్రాణం ఎక్కువగా చూసుకున్నాడు. ఫలితం అనుభవించాడు.

వరదరాజు. తను ఈ ప్రపంచంలో ఇంకా బతికిఉండాలిసిన ఆవశ్యకత ఏమిటో బోధపడలేదు. జీవితం ఎడారివంటిదని తెలుసుకునీ, దూరాన ఏదో కనబడితే పచ్చికబయలు అని భ్రమించాడు. మోసపోయాడు. అపహసించబడ్డాడు. తను వొట్టి అబద్ధాలకోరుట! అన్యాయంగా ఓ స్త్రీని వంచించటానికి పూనుకొన్న నమ్మకద్రోహిట? అతని శరీరం జ్వలించిపోతోంది. ఈ అబద్ధం ఇహ ఎంతో కాలం ప్రచారం కావటానికి వీల్లేదు. నిజం నిప్పులా బయటపడాలి.

అతను సరాసరి ఇంటికి వెళ్లి కాగితం, కలం తీసుకున్నాడు. రాధరూపం అతనికళ్లముందు సాక్షాత్కరించింది. విషాదంగా నవ్వాడు.

"ప్రియమైన రాధా,

ఈ ఉత్తరం పూర్తిగా చదువుతారని ఆశిస్తున్నాను. నా దురదృష్టంవల్ల మీరు నన్ను పూర్తిగా అపార్థంచేసుకున్నారు. జరిగిన సంగతి ఇది. నా వాగ్దానం నెరవేర్చుకోటానికి, ఇంటిని అమ్మే ప్రయత్నంలో నేనేమీ లోపం చెయ్యలేదు. ఆ ప్రయత్నాలు జరుగుతుండగా, నా దౌర్భాగ్యంవల్ల ఆ స్తిని అమ్మటానికి పేచివచ్చింది. ఆఆస్తిని మా నాన్నగారు స్వార్జితధనంతో కొన్నారు. దానికి మైనరుతగాదా ఉందిట. అది నాకు తెలియదు. తీరా నేను దాని అమ్మక ప్రయత్నంలో ఉండగా కోర్టులో దావా పడ్డది. అది తేలేదాకా ఆ స్తిని అమ్మటానికి నాకు అధికారంలేదని ట్రస్టీలు చెప్పారు. ఈ విషయం మీకు తెలియచెయ్యాలని చాలా ప్రయత్నించాను. ఉత్తరం రాద్దామనుకున్నాను. కాని స్వయంగా చెప్పటం మంచిదని ఆ ప్రయత్నం విరమించుకున్నాను. ఎప్పుడు మీ దగ్గిరికి వొద్దామని బయలుదేరినా ధైర్యంచాలేదికాదు. మీరీ విషయం నమ్మరేమోనని అనుకున్నాను. చాలా సున్నితవిషయం కదా! ఏంచేయాలో తోచలేదు, చాలారోజుల వరకు. తరవాత ఓ ఆలోచన తట్టింది. కోర్టువారు జారీచేసిన ఉత్తరువులు మొదలైన కాగితాలు మీకు చూపిస్తే నా నిర్దోషిత్వం రుజువు అవుతుందని ఆశించాను. కాని మళ్లీ ఇదంతా నా కుతంత్రం అని మీరనుమానించటానికి అవకాశం ఉందని ఆ ప్రయత్నం కూడా విరమించుకున్నాను. (తరవాతి నా ఊహ బలపడ్డదనుకోండి.)

ఇహ ఏదిదారి? ఒక్కే ఒక్క ఉపాయం తోచింది నేను బతికి చెయ్యాలిసిన ఘనకార్యాలేమిటో. నాకర్థంకాలేదు. జీవితంలో మొదటిసారి దెబ్బతిన్నానని మీకు చెప్పానని జ్ఞాపకం. జీవచ్ఛవంగా బతికటంకంటె శాశ్వతంగా కన్నుమూయటం శ్రేయస్కరమనిపించింది. ఇందువల్ల శాంతిలేని నా మనసుకి చిరశాంతి లభించటమే కాకుండా. మరో ప్రాణి— జీవితంలో ఎన్నో అనుభవాలు చవిచూడాలిసి ఒక పేదజీవి - సుఖపడగలదు. ఎలా అంటారా? నాకు లైఫ్ ఇన్సూరెన్సు పాలిసీ ఉంది—పది వేలకి. తతంగం పూర్తిచేశాను.

అంతర్వాహినిలా, మనిషి అంతరంలో కోరిక లెప్పుడూ జీవనదిలా ప్రవహిస్తూంటాయి కాబోలు. చావటం సులభమనుకున్నాను. కాదని తేలింది. ఎన్నోసార్లు ప్రయత్నించాను. స్థైర్యంకోసం మీరు పత్రికలో రాసిన 'స్వీయచరిత్ర' జేబులో పెట్టుకుని సముద్రతీరానికి వెళ్లేవాణ్ణి. లాభం లేకపోయింది. ఏదో కోరిక మనసులో మెదిలేది. తరవాత గ్రహించాను. నా దౌర్బల్యానికి కారణం మరేమిటో కాదు. మీరు నమ్మకపోవచ్చు. కాని ఇప్పుడు, ఈ క్షణంలో అబద్ధం చెప్పటానికి నాకు బలమైన కారణం ఏమీ లేదనుకుంటాను.

నా జీవితంలో రెండోసారి ప్రేమించాను. ఫలితంకోసం అర్రులుచాచటం మానవసహజం. నేను

సరిహద్దులు దాటి ఎప్పుడూ వెళ్ళలేదు. చివరిదాకా అలాగే ప్రవర్తించగలిగినందుకు నాకు నిజంగా గర్వంగానే ఉంది. మనసులో బలీయమైన సంఘర్షణ జరిగింది - ప్రాపంచిక శక్తులకీ, నైతిక శక్తులకీ.

మానసిక బాధ ఇలా ఉండగా మీ దగ్గిరికి చివరిసారి రావటం జరిగింది. నా పొరబాటు గ్రహించుకున్నాను. చాలా బుద్ధిహీనుడిలా ప్రవర్తించాను. లోకంపోకడ తెలిసీ తెలియనట్టు అవసరానికి నటించుకున్నాను. మాట నిలబెట్టుకోటంకంటె - ముఖ్యంగా ఇలాంటి సున్నితమైన విషయాల్లో - ప్రధానమైంది ఏదీ లేదని తెలిసింది.

బహుశా, రేపు పొద్దునకి నేను మీరనుకున్నంత - కనీసం అన్నంత - దుర్మార్గుడిని కానని గ్రహించగలరనుకుంటాను.

మనమంతా మానవులం. ఒక సంఘంగా బతికాలిసినవాళ్ళం. ఈ విషయం తెలుసుకున్న తరవాత ఒకరినొకరం అర్థం చేసుకోగలం. మీ ప్రవర్తనలో అసహజం ఏమీ లేదు. కాగా, మీమీద నాకేమీ కోపం లేదని చెప్పటం అనవసరమే నేమో.

సెలవు
మీ
వరదరాజు.

ఉత్తరం పోస్ట్ చేసి తేలికపడ్డ హృదయంతో వరదరాజు ఊరిబయటికి నడిచాడు. ఎంతో సేపు అలా తిరిగాడు - ఆ చీకట్లో. తిరిగి తిరిగి రైలుపట్టాల దగ్గిరికి చేరుకున్నాడు. నక్షత్రాల కాంతిలో పట్టాలు అస్పష్టంగా కనిపిస్తున్నాయి. వాటివైపు చూసి విషాదపూరితంగా చిన్నగా నవ్వాడు అతను. దూరాన ఏదో రైలు వస్తున్న సవ్వడి వినిపించింది. తాటిచెట్ల సందుల్లోంచి 'లైట్' కనిపిస్తోంది. పట్టాల మీద అడ్డంగా పడుకున్నాడు వరదరాజు. ఇప్పుడతనికేమీ విచారం లేదు. రాధకి రేపో, ఎల్లుండో ఈ సంగతి తెలియక మానదు. తన ప్రవర్తనకి పశ్చాత్తాప పడుతుంది. వరదరాజు నమ్మకద్రోహి కాడు. ఈ ఆలోచన అతనికెంతో ఉత్సాహం కలిగించింది. తన నిర్దోషిత్వం రుజువవుతుంది. వరదరాజు మాట తప్పని పెద్దమనిషి! వాగ్దానం తీర్చుకోటంకోసం ప్రాణత్యాగం చేసిన త్యాగి.

రైలు చాలా దగ్గిరకి వొచ్చేసింది. తనని ఎవరూ చూడరు గద! అతనికి అకస్మాత్తుగా ఓ సందేహం పట్టుకుంది. తనుచావటం భయపడటం లేదు. ఎందుకు? ఎప్పుడెప్పుడు ఆ ముహూర్తం దగ్గిరపడుతుందా అని కనిపెట్టుకున్నాడు. తన పిరికితనం ఏమయింది? రైలు చాలా దగ్గిరికి వొచ్చేసింది. ఇహ కొద్దినిమిషాలు - కొద్దిక్షణాలు. అయినా తనకేమాత్రం భయం లేదు. చిత్రం. ఏమిటి కారణం? తను మొదట ప్రేమించి విఫలుడైనప్పుడు ఆత్మహత్య తలపెట్టలేకపోయాడు. అసలు ఆ మాటే అతని మెదడులో ప్రవేశించలేదు. రెండోసారి రాధకోసం చావలేకపోయాడు. తన మరణంవల్ల ఆమె బాధపడుతుందని తెలిసీ తను సాహసించలేకపోయాడు. అయితే ఇప్పుడామె తనని నిరాకరించటంవల్ల ఆశలుడుగంటి విరాగిఅయి మృత్యువుని ఆహ్వానిస్తున్నాడా? ఆ కారణంవల్ల తను ఆ నిశ్చయానికి రాలేదు. కేవలం తన ఆత్మగౌరవం కాపాడుకోటంకోసం-అవును కేవలం అందువల్లే తను చచ్చిపోతున్నాడు. రాధకోసం కాదు. హఠాత్తుగా అతని మెదడులో ఏదో ఆలోచన మెరిసింది. ఏదో నగ్నసత్యం ఎవరో చెవిలో చెప్పినట్టయింది. ఇన్నాళ్ళనించీ తెలుసుకోలేకపోయాడు. తన నరనరాల్లో ఇలా...

రైలు తనమీదికి ఉరకబోతోందని అచేతనంలో గ్రహించాడు వరదరాజు. యంత్రంలా లేచి ఒక్క గంతు వేశాడు. కాని ఇంజన్ తాకిడికి బలంగా తోసివేయబడి చాపచుట్టగా పడిపోయాడు. తెలివితప్పిపోయింది.

మళ్ళీ తెలివివచ్చేసరికి వరదరాజు గవర్నమెంట్ హాస్పిటల్లో 'బెడ్' మీద ఉన్నాడు. వొంటిమీద పట్టీలున్నాయి. తను చావలేదన్నమాట. ఒకదీర్ఘనిశ్వాసం తరవాత తల పక్కకి తిప్పిచూశాడు. అతను తనకళ్ళని తను నమ్మలేకపోయాడు. ఎదురుగా రాధ ఉంది. ఆశ్చర్యంగా అలాగే ఆమెవైపు చూడసాగాడు. ఆమెముఖం పాలిపోయి, ఉంది. వరదరాజు కళ్ళు తెరిచి తనవైపు చూడటంతో ఆమె ముఖంలో సంతోషం తాండవమాడింది.

"ఎలా ఉంది?" మృదువుగా అడిగిందామె.

"బాగానే ఉంది" అన్నాడు. తనగొంతు తనకే వినిపించలేదు సరిగా.

"నన్ను క్షమించండి." ఆమె వరదరాజుని వేడుకుంటూ అంది. వరదరాజు జరుగుతున్నది అర్థం చేసుకోలేకుండా ఉన్నాడు. రాధ తనని ప్రథమంగా వేడుకుంది. స్వర్గలోకంలో విహరిస్తున్నట్టుగా అనుభూతిపొందాడు. ఏమీ మాట్లాడలేకపోయాడు.

"మిమ్మల్ని అనరానిమాటలు అన్నాను.

నాకేమీ తెలియదు. మూర్ఖురాల్ని, ఎంతో బాధించాను. మీ మనసు గ్రహించలేకపోయాను."

ఈ సారి వరదరాజు భావయుక్తంగా చిన్నగా నవ్వాడు. "నా మనసు నేనే గ్రహించలేకపోయాను చివరిదాకా. నన్ను గురించి నాకు తెలుసని అనుకుంటూ ఉండేవాణ్ణి. అది శుద్ధ పొరపాటని తేలింది."

రాధ అర్థంకాక ఏమిటన్నట్టుగా అతనివైపు చూసింది.

"నన్ను గురించిన నిజాలు ఎప్పటికప్పుడు నాకు కొత్తగా అవగతమవుతుంటే, అసలు నన్ను గురించి నాకేమీ తెలియదని ఒప్పుకోవాలిసి వస్తోంది. నేను జీవచ్ఛవంలా బతుకుతున్నాననుకున్నాను. కోరికలేమీ లేవనుకున్నాను.. ఇహ స్వార్థంమాటుకు ఉంటుందని ఎలా అనుకుంటాను? కాని మొదటినించీ చివరిదాకా నేను నాకోసమే బతుకుతున్నాననీ, స్వార్థ-చింతన అత్యధికంగా ఉందని చివరినిమిషంలో తెలుసుకున్నాను. భగ్నజీవితంనడుపుతున్నా, ఒకరి మేలుకోసం నా ప్రాణం ఇవ్వలేకపోయాను. చివరికి నా గౌరవం కోసం, నా గొప్పతనం నిరూపించుకోటంకోసం-అంటే నా కోసం నేను ప్రాణం పోగొట్టుకోగల స్థితికి వొచ్చాను."

రాధకి ఇదంతా కొత్తవిషయంగాకనిపించలేదు. ప్రపంచంలో పూర్తిగా అమలులో ఉన్న విషయం గురించి అతనంతగా ఎందుకు బాధపడుతున్నాడో ఆమెకి తెలియలేదు. ఏమీ అనకుండా అతనివైపు చూస్తూ ఊరుకుంది. కాసేపటి తరవాత అతనడిగాడు.

"నేను ఇక్కడ ఉన్నానని మీకెలా తెలిసింది?"

"నేను మీ భార్యని. 'నువ్వు' అనండి."

వరదరాజు ఆమెవైపు తేరిపార చూశాడు.

"కాని..."

గిర్రున తిరిగిన కన్నీటి తెరలలోంచి ఆమె అతనివైపుచూస్తూ వేడుకోలుగా అంది.

"నేను చేసింది క్షమించరాని తప్పే అనుకోండి. కాని..."

"అదికాదు. సరే, అసలు ఇక్కడికి రావటం ఎలా సంభవించింది?"

"మీ ఉత్తరం చదివి నా తప్పిదం తెలుసుకున్న తరవాత మనసు ఎంతో సంక్షోభం చెందింది. బయట ఎవరో కుర్రాళ్లు అనుకుంటూ వెడుతున్నారు. రాత్రి రైలుకింద ఎవరో పడ్డారనీ, జనరల్ హాస్పిటల్‌కి తీసుకొచ్చారనీ, ఇహ ఎవరై ఉంటారనుకుంటాను?"

వరదరాజు కొంచెంసేపు విశ్రాంతి తీసుకుని అన్నాడు.

"మీతో ముఖ్యవిషయం చెప్పాలి."

"మళ్లీ..." జాలిగా అతనివైపు చూసిందామె.

"సరే, అవను. అసలా విషయం చెప్పటానికే బతికాను. ఆఖరినిమిషంలో తట్టింది—బహుశా నేను ఎవర్నీ ఇంతవరకు ప్రేమించలేదేమో. రాధని కూడా..."

అతనామెవైపు చూశాడు. ఆమె ముఖభంగిమలో మార్పు ఏమీలేదు.

"ఏమాత్రం ప్రేమించిఉన్నా అలా ఉత్తరం రాయకలిగిఉండేవాణ్ణి కాదు. ఆ ఉత్తరం చాలా బాధ కలిగిస్తుందని నాకు తెలుసు. జీవితాంతం దుస్వప్నంలా వెంటపడుతుందని తెలుసు. అయినా అలా రాయకలిగాను. కసిలేదనుకుని నన్ను వంచించుకోదలచాను. కాని నా మనసుని నేనే వంచించాను. నా అంతరాంతరాలకీ నాకూ మధ్య ఎన్నో తెరలున్నాయి. రాధా, నీ మీద కోపగించననీ, కోపగించటానికి అధికారంలేదనీ నిశ్చయించుకున్నాను. కాని ఎక్కడో నా మనసులో ఏ మూలో నీ మీద కోపం కసీ ఆరని దీపాల్లాగా మిణుకుమిణుకుమంటూ ఉన్నాయి. లేకపోతే అలా రాయటం నా తరమై ఉండేదికాదు. ఇహ ప్రేమిస్తున్నానని ఎలా అనగలను? ఈ నిజం చెప్పేదాకా బతకాలని కోరుకున్నాను. బతికాను. మనసు చాలా తేలికగా ఉంది, ఈ క్షణం."

ఇంత సునిశితంగా విమర్శించుకుంటున్న వరదరాజుని చూసి రాధకి విస్మయంతోపాటు జాలికూడా కలిగింది. ఒకక్షణం ఆగి చిన్నగా నవ్వుతూ అంది.

"ప్రేమ అంటే ఏమిటి?"

ఏదో చెప్పవచ్చు. కాని వరదరాజు వెంటనే ఏదీ చెప్పలేకపోయాడు. ఏంచెప్పాలో ఆలోచించ సాగాడు.

"ప్రేమ అంటే ఏమిటో సరిగా తెలియకుండానే, అది లభ్యంకాలేదని హిమాలయాలకు వెళ్లిపోవాలనుకుంటారా ఎవరైనా ? ఎంత అమాయకులండీ ?"

రాధ ముసిముసిగా నవ్వింది, అతనామెవైపు తదేకంగా చూశాడు. అప్రయత్నంగా నవ్వాడు - హార్దికంగా వెన్నెల వెలుగులా, తేలికగా, హాయిగా. జీవితంలో అలా నవ్వటం అతనికి బహుశా అదే మొదటిసారేమో బుద్ధి తెలిసిన తరవాత ! కాని మరి కొంచెం సేపటిలోనే అతనికో సందేహం కలిగింది. సూటిగా అడగదలుచుకున్నాడు.

"మరి..."

కాని రాధ అతన్ని మాట్లాడనివ్వలేదు. ఎక్కువగా మాట్లాడటం అంత మంచిదికాదని అతని నోరు మూసేసింది.

తను ఆమెని ప్రేమించాడని అన్నప్పుడు తిరస్కరించి యిప్పుడు ప్రేమించటంలేదని పరిస్థితి వ్యక్తం చేసి నవ్వుడిలా ఆమె ప్రవర్తించటంలో గల అంతర్యం ఏమిటా అనే ప్రశ్న వరదరాజుకి కొంచెం సేపటి వరకూ సమస్యగానే తోచింది.



## మీరు ఖర్చుపెట్టిన డబ్బుకు ఈవిధములుగా డాల్డా వనస్పతి పూర్తిగా లాభము గలుగజేయును



డాల్డానుండి అతను తెచ్చుకొను శక్తివల్ల
అతను రోజంతా సంతోషముగాను,
ఆరోగ్యకరముగాను ఉంటాడు

డాల్డాతో వండబడిన ఆహారమును మీ కుటుంబమునకు ఇచ్చినచో ప్రతి మనిషికి ప్రతిదిన ఆహారములో తప్పకుండ నుండాలని డాక్టర్లచే చెప్పబడు శక్తినిచ్చు క్రొవ్వు పదార్థమును వారు పొందుచున్నారని మీరు నిశ్చయముగా నుండవచ్చును. డాల్డా గాలికూడ చొరవకుండ సీలుచేయబడిన టిన్నులో మిక్కిలి శుద్ధముగాను, క్రొత్తగాను, ఆరోగ్యకరముగాను ఉండును. దానిని వాడుటవలన మిక్కిలి తక్కువ ఖర్చగును.

మన ఆహారములో విటమినులు ఎందుకు ఆవశ్యకము?
ఉచిత సలహాకు ఈవేళే ఈ క్రింది అడ్రసుకు వ్రాయండి:
ది డాల్డా అడ్వైజరీ సర్వీస్, పోస్ట్ బాక్సు నంబరు 353,
బొంబాయి 1




# డాల్డా

ఆరోగ్యకరముగానుంచే వంటక్రొవ్వుపదార్థము

10 పౌన్లు, 5 పౌన్లు, 2 పౌన్లు మరియు 1 పౌను టిన్నులలో దొరకును

HVM 190-50 TL

# సౌందరనంద విమర్శనము సింహావలోకనము

★

శ్రీ పొట్లపల్లి సీతారామారావు

విజయ - విశాఖ భారతిలో శ్రీ పి. గణపతిశాస్త్రి గారు సౌందరనందాన్ని సమర్థిస్తూ ఒక వ్యాసం వ్రాశారు. సురభి గారు వ్రాసింది చాలా సమర్థనీయంగా ఉందనీ, నేను వ్రాసినదానిలో ఎక్కడా సహృదయత కనుపించటం లేదనీ, ఒక తీర్పు చెప్పారు. ఇద్దరు వివాదము చేసికొనేటప్పుడు తాను మధ్యస్థముగానుండి తీర్పు చెప్పదలచుకొన్న వారికి నిష్పాక్షికమైన దృష్టి ఉండాలి. అదిగాక లోకములో ఆయన సమర్థుడై ఉండాలి. ఆయన చెప్పిన మాటకు తిరుగుండకూడదు. ఈ రెండు లక్షణములూ లేని శ్రీ పి. గణపతిశాస్త్రి గారు సమీక్ష చేయటానికి ప్రయత్నించటం హాస్యాస్పదం. ఆ వ్యాసమంతా నన్ను నిందించటమే యున్నది. వ్యర్థనిందలకు విమర్శ యేమున్నది. దానిని వదిలిపెట్టి ఆయన నాకు సమాధానమీయటానికి ప్రయత్నించిన భాగములకు మాత్రం కొంత సమాధానముగా వివరిస్తాను.

మన దేశమునకు సాహిత్యసంప్రదాయానుబద్ధములైన విమర్శలు కావలెను. ఇంతవరకు దేశములో వచ్చిన విమర్శలన్నియు వట్టి గాలికబుర్లు. కవియొక్క ప్రతిభను తూచేవి కావు. ఇలాంటి విమర్శలవల్ల దేశములో దుష్టమైన సారస్వతము పెరిగింది. దాన్ని పెరుగనీయకుండా ఉంచటానికి సాహిత్యానికి మంచి విలువరావటానికీ పూర్వాలంకారికులు నిర్మించిన సూత్రములమీదుగా విమర్శ సాగించాలి. ఆ ప్రయత్నానికి అడ్డురావటం, తన్ను వంచించుకోవటం; ఇతరులను వంచించటం అవుతుంది. గణపతిశాస్త్రి గారు "ప్రపంచంలో సువిస్తృతమైన విమర్శనామార్గాలు అనేకం బయలుదేరిన ఈరోజుల్లో ఇంకా ఈ అలంకారశాస్త్రమార్గముపట్టుకొని, ఇక అందులో ఉన్నదే వేదమనీ తద్విరుద్ధమైనదంతా అపమార్గమనీ వేళ్ళాడటం ఎందుకో తెలియటం లేదు" అని వ్రాశారు. అలంకారశాస్త్రం ఏమి చెబుతుంది? విమర్శించటానికి కావలసిన కొన్ని శాశ్వతమైన పరమసత్యాలను చెబుతుంది. ఆ సూత్రాలను మనం తీసికొని దానిమీదుగా నొక మార్గాన్ని నిర్మించాలి. కావ్యవిమర్శనములో మన మెన్నివిధాలనున్నతస్థాయి నందుకొన్నామో, అలంకారశాస్త్రం చదివితే తెలుస్తుంది. మన దేశములో విమర్శ ఒక శాస్త్రంగా అభివృద్ధి చెందింది. అలంకారశాస్త్రము ఏ ఒక కవినో ఉద్దేశించి వ్రాసినది కాదు. సర్వకవులనుద్దేశించీ వ్రాసినది. వారి దృక్పథమే యుదాత్తమైనది. ఎంత చిన్న విషయమునైనా పరిశీలించి వ్రాశారు. మన అదృష్టం కొద్దీగా వారు ఋషులవలె అనేకమార్గాలు తీర్చి వెళ్లారు. అలా తీర్చడానికి కావలసినంత ప్రతిభ వారికున్నది. దోషము వస్తే కాళిదాసాదులనైనా అంగీకరించరు వారు. అలాంటిమార్గాలనన్నీ వదలిపెట్టి ఇవ్వేళ నేనుగానీ, గణపతిశాస్త్రి గారుగానీ, ఒక అపూర్వ విమర్శనాపద్ధతిని ప్రవేశపెడితే, ఇక దానిశోభ అడుగనవసరం లేదు. వారుచెప్పిన ప్రపంచములోని విస్తృతమార్గాలన్నీ యీ అలంకారశాస్త్రంలో అంతర్భవిస్తవి. కాబట్టి అలంకారశాస్త్రం చదివి దానిదృష్ట్యా విమర్శించవలె. వేఱొక గత్యంతరం లేదు. ఇప్పుడు దేశంలో వాడుకలోనున్నది 'గాలికబుర్లమార్గం.'

అర్థకుసిగా అలంకారశాస్త్రం చదివి, సంస్కృత శ్లోకాల నుదాహరిస్తూ పాఠకలోకాన్ని హడలుకొడుతున్నారని గణపతిశాస్త్రి గారు విచారిస్తున్నారు. ఇందులోని వాస్తవికత అట్లా ఉంచుదాం. కనీసం ఒకశ్లోకమైనా రాకుండా నాలుగు మాటలు చెప్పి లోకాన్ని హడలుకొట్టేవారి నేమనాలి. వీరికంటే వారే నయం. తోచినది వచ్చినట్లుగా నటనచేసే పద్ధతి ఎవరిదైందీ, వ్యాసధోరణులనుబట్టి తెలుస్తూనే ఉంది. "మూలములో కామప్రవృత్తులైన సుందరీనందులు పరిణతులై క్రమంగా ధర్మమార్గంలోనికి వచ్చారు... ... తెలుగు కావ్యంలో సుందరీనందుల ప్రేమ, బౌద్ధ ధర్మస్వీకరణద్వారా విస్తృతమై పునీతమైనది" అని

వ్రాశారు. మూలములో సుందరీనందులను కాముకులగా వర్ణించారు. తెలుగుకావ్యములోకూడా సుందరీనందులను కాముకులుగానే వర్ణించారు. ఆ ఘట్టంలో మూలములో ఎట్లాఉందో తెలుగులోగూడా, అచ్చుగుద్దినట్లు అట్లే యున్నది. మరి దాన్ని కామం—దీన్ని ప్రేమ—అని ఎందుకనాలి? ఏమిటో అయోమయం. సుందరీనందుల ప్రేమ బౌద్ధధర్మస్వీకరణ ద్వారా విస్తృతమైనదట. ఎలా విస్తృతమైనది? బుద్ధుడు, స్త్రీ, పురుషులు, గాఢంగా ప్రేమించుకోవలెనని 'దండోరా' వేయించాడా? గణపతిశాస్త్రిగారు ఇంత అయోమయంగా, తాను విమర్శ వ్రాస్తూ పైగా నావిమర్శ అయోమయమంటారు. ఈ ప్రేమ కామములనుగురించి ఇదివరకే వ్రాశాను. మళ్ళీ వ్రాయుటయెందుకు?

ఇక రసవిరోధాన్ని గురించి సమాధానం చెప్పబోయ్యారు. దానికి సమాధానం దొరకలేదు కాబోలు. ధ్వన్యాచార్యుడు సూత్రప్రాయంగా చెప్పారు అంతేకాని అన్ని కావ్యాలలోను ఉండవలెనని చెప్పలేదని తమ సహజధోరణి కొనసాగించారు. ఆనందవర్ధనుడేమన్నాడో చూడండి.

"స్వేచ్ఛాపి యదియోజ్యాః తద్రసవిరోధినః సహోగాజ్యాః"

"ప్రబంధే ముక్తకేవాపి రసాదీన్ బంధుమిచ్ఛతా
యత్నః కార్యః సుమతినా పరిహారే విరోధినామ్

ప్రబంధే ముక్తకేవాపి రసభావ నిబంధనమ్ ప్రత్యాదృతమనాః కవిర్విరోధి పరిహారే పరమ్ యత్నమాదధీత" ఇక్కడ కవి అంటే సర్వకవులకు యత్నించదా? పి. గణపతిశాస్త్రిగారి కీమాత్రమెందుకు తెలియలేదో! నాది బుకాయింపు అంటాడేమి? ఇక గణపతిశాస్త్రిగారు ఆయన ఏమి వ్రాస్తాడో ఆయనకే తెలియును. అన్నీ స్వవచనవ్యాఘాతాలే. అవన్ని విమర్శించడంతో నాకు నిమిత్తం లేదు. నాకీయన సమాధాన మెంతవరకు ఇచ్చాడో దానికి మాత్రమే జవాబు చెబుతాను. నేను అంగరసం, అంగిరసాన్ని మింగివేస్తుందంటే అది లేదంటాడీయన. సౌందరనంద గ్రంథంతీసి ఆకావ్య మెన్ని ఆశ్వాసాలో—అన్ని ఆశ్వాసాలలో అంగరస మెంత విపరీతంగా ఉందో పరిశీలిస్తే తెలుస్తుంది. బహుశః ఈయన అంగిరసాన్ని గంగానమ్మలాంటి ఒకదేవతగా భావించి యుంటాడు. అందుకే కనుపించలేదు. కథాభాగంలో సగానికి పైబడి సుందరీనందులఘట్టముంది. ఇది బాగా చూస్తే తెలుస్తుంది. ఇవన్నీ పెద్దవిషయాలు. విషయం తెలిస్తేనే అవి అవగతమౌతవి. ఏదో లౌకికంగా సమాధానం చెబుదామంటే తేలేవిషయాలు గావు.

సమర్థుడైన కవి కావ్యములో వాతావరణం సాధించడానికి శాయశక్తులా ప్రయత్నిస్తాడు. కథ ఏకాలంలో జరిగింది—ఏదేశములో జరిగింది—దాన్ని వ్యక్తంచేయడానికి ఎలాంటిరచనచేయాలి—ఏశబ్దము వాడితే ఆ వాతావరణం పట్టుకొంటుంది—ఇవన్నీ కవి ఊహించుకోవాలి. కవి ప్రతిభగలవాడైతే వాతావరణాన్ని సాధించుకోటానికి అనంతమార్గాలు కనుపిస్తవి. వాతావరణం కూర్చుకోవాలన్నవిషయం ప్రతి స్వల్పకథకునికీ తెలుస్తుంది. కథకు వాతావరణం ఉద్దీపనవిభావమౌతోంది. కాబట్టి అది లేకపోతే కావ్యంలో రసం ఉద్దీప్తి పొందదు. కాళిదాసుని శాకుంతలం చూడండి. కణ్వాశ్రమాన్ని వర్ణించేటప్పుడు ఆ యాశ్రమజీవితపరిస్థితులను ప్రతిబింబింపచేయటానికి ఎంత ప్రయత్నమైనా చేశాడు. తన ప్రతిభచేత చతుర్థాంకమంతా దానికి ధారపోశాడు. ప్రతిభచే వాతావరణాన్ని ఎంత ప్రౌఢంగా సాధించారన్న విషయమట్లాఉంచుదాం. అసలు వాతావరణాన్ని, సృష్టించుకోవాలన్న స్వల్పవిషయమే, సౌందరనంద కర్తలకు తెలియదు. దాన్ని గణపతిశాస్త్రిగారు సమర్థించాలని ప్రయత్నం చేస్తారు. భారతములోనైనా, మరే గ్రంథములోనైనా, ఆకాలానికి తత్పరిస్థితికి భిన్నమైన వాతావరణం కనుపిస్తే అది దోషమే. భారతంలో అది ఉన్నదా లేదా అని చర్చించడం అప్రస్తుతం. ఒకవేళ మహాకవులలో ఇలాంటివి కనుపించినా మనం చేయగూడదు. దాన్ని స్మరింపనీయనన్ని మంచిలక్షణములు వారిలో నుంటవి. సౌందరనందములో అవిలేవు. ఆనందవర్ధనుడుకూడా ఇట్లే చెప్పాడు.

"పూర్వే విశృంఖలగిరః కవయః ప్రాప్తకీర్తయః
తాన్సమాశ్రిత్య నత్యాజ్యా నీతిరేషా మనీషిణా"

అలంకారికశాస్త్రమంతా భరతాదులు అర్షమైన మనఃప్రవృత్తితో నిర్ణయించి దానిప్రకారం కావ్యముల పరిశీలించినట్లు కనుపిస్తుంది. అలాకాకుండా లక్ష్యాన్ని బట్టి నిర్ణయించినట్లయితే కాళిదాసాదులలో తప్పులు చూపించరు. తెలుగులోవలె మహాకవుల ప్రయోగంబులు గ్రాహ్యంబులయ్యెవి. మహాకవుల కావ్యములలో దోషమేదో ఒకటి ఉన్నా, దాన్ని కప్పిపుచ్చే మంచిలక్షణము లనేకము లుంటవి. అలంకారికుల దృష్టి ప్రకారం దోష మెవరుచేసినా, ఎప్పుడు చేసినా, దోషమే.

"యత్త్వేవంవిధేవిషయే మహాకవీనాప్యసమీక్ష్య కారితాలక్ష్యేద్దృశ్యతే సదోషఏవ. సతుశక్తి తిరస్కృతత్వాత్తేషాం నలక్ష్యత ఇత్యుక్తమేవ"

ఇక నందునికి బలవంతముగా సన్న్యాసమిప్పించ డాన్ని సమర్థించడం మరీ విచిత్రంగా ఉంది. నందుడు వద్దు మొర్రో అంటూ ఉండగా పదిమంది పట్టుకొని సన్న్యాసమిప్పించడం వినటానికే భయంకరంగా ఉంది. దాన్ని అశ్వఘోషుడు తప్పుకొన్న పద్ధతి నిదివఱకే సూచించాను. గణపతిశాస్త్రిగారు అది బుద్ధుడిసంకల్పానికి వదిలివేశారని ఊహించగూడదాఅని ప్రశ్నించారు. ఆ ఊహకు వ్యంజకమైన రచన ఎక్కడ ఉంది అని నాప్రశ్న. మనఇష్టము వచ్చినట్లుగా ఊహించ గూడదు. అలా ఊహిస్తే తప్పులన్నీ ఒప్పులుగానే ఊహించుకోవచ్చు. "ఇలా ఊహించడానికి ఈ రచన వ్యంజకముగానున్న"దని శాస్త్రిగారు విస్పష్టముగా చూపించవలెను. అదిలేకుండా ఊహించడం సాధ్యము కానిపని. వీరియభిప్రాయముప్రకారం సహృదయున కొక నిర్వచనం కనుపిస్తుంది. అదేమిటంటే తప్పుల నధిగమించి కావ్యాలలో ఉన్నవీ లేనివీ ఊహించుకొని "అహో"యని మెచ్చుకోవడం. ఇది మందప్రతిభునిలక్షణం; సహృదయునికి ఏమాత్రం దోషం తగిలినా ప్రాణం చివుక్కుమంటుంది. సహృదయుడు ఆలోచించకుండా మెచ్చుకోడు. ఆలోచించకుండా మెచ్చుకొనేది పామరుడు.

సంగీత మపిసాహిత్యం సరస్వత్యాః స్తనద్వయమ్
ఏకమాపాత మధుర మన్యదాలోచనామృతమ్

అన్నారు పెద్దలు. కావ్యములో లేని భావాన్ని మనం ఊహించి సరిపెట్టుకోగూడదు. బుద్ధుడి సంకల్పానికి వదిలివేశారనుకోడానికితగినబలం లేదు. ఊహని పోషించుకోవడానికి తగినసామగ్రి లేదు. ఆసామగ్రి లేనికావ్యము నేగదా సౌందరనందాన్ని విమర్శించడం. ఆసామగ్రి చూపకపోతే అది సమాధాన మెట్లవుతుంది. అశ్వఘోషుడు తానందుకే విస్పష్టంగా వ్రాసుకొన్నాడు. తెలుగుకవులు తప్పుదారి త్రొక్కారు. అది సమర్థించబడదు.

"సంసరణమహాబ్ధి మగ్నమగు మానవకోటిపయిన్ కృపాఝురుల్"

ఇక్కడ 'కృపాఝురుల్' బాగాలేదని గణపతి శాస్త్రిగారు ఒప్పుకొన్నారు. అది ప్రస్తుతానికి మన అదృష్టం. కాని మళ్ళీ

"కంట నీర్వెట్టతగదు నీవంటివాడు"

అన్నదాన్ని తీసికొని సమర్థించ ప్రయత్నించారు. "కంట నీర్వెట్టతగదు" అనే దానికి దుఃఖించ గూడ దనే అర్థము తీసికొంటే సరిపోతుందన్నారు. ఇలా సమర్థిస్తే పై దాన్నిగూడా సమర్థించ వచ్చును గదా! "కృపాఝురుల్" ఏకంగా రూపకంగా చెప్పుకొని సమర్థించవచ్చు. "కంట నీర్వెట్టతగదు" అన్నదానిలో వాచ్యార్థానికి ప్రాబల్యముంది. అక్కడ గౌణార్థం పట్టదు. పట్టించాలని ప్రయత్నించినా, వాచ్యార్థము పట్టనీయదు. కాబట్టి ఈ సమర్థన కుదురదు. లక్షణార్థం ఎక్కడబడితే అక్కడ చెప్పగూడదు. అలా చెబితే ప్రతిదాన్ని సమర్థించవచ్చు. దుఃఖించడం కన్నీరు లేకుండాకూడా ఉంటుంది. అందుచే కంట నీర్వెట్ట తగదనడంలో వాచ్యార్థమునకే ఎక్కువ ఆస్కారముంది.

గణపతిశాస్త్రిగారు "శబ్దదోషాలున్న కావ్య మేదీ గౌరవం పొందద"న్నారు. అయినప్పుడు రస దోషమున్న కావ్య మెలా గౌరవం పొందుతుంది. అది ఒప్పుకొన్నవారు దీని నెందు కొప్పుకొనరు? ఇంకా శబ్దదోషం సహించవచ్చునేమో కాని రస దోషం సహించరానిది. వీరి విమర్శప్రకారం అలం శాస్త్రాన్ని వదలిపెట్టి, నూతనమార్గం ఏర్పఱచుకో వచ్చు. కాని వ్యాకరణ శాస్త్రం వదలి పెట్టి, నూతన మార్గం ఏర్పఱచుకొనరాదు. ఇదంతా విపరీతవాదన. తానేమి వ్రాయుచున్నాడో తనకే తెలియదు.

తెలుగుదేశములో పూర్వ విమర్శనలన్నీ శబ్దం మీద చేసిన సాములు. అంతేగాని రసవిషయకంగా చేసినవి కావు. శ్రీ గిడుగు రామమూర్తి పంతులు గారు మొదలైనవారు శబ్దవిషయకంగా, సాధుత్వ సాధుత్వములు నిర్ణయించారు. అలంకారిక మార్గాన్ని బట్టి, విమర్శించిన వారు లేరు. మన దేశీయమైన సాంఘిక నాగరికత అంతా, సంస్కృతాలంకారిక మార్గములలో నున్నది. తద్భాషావిమర్శలు చదవడం నాగరిక జాతిలక్షణం. ఆ భాషావైభవం తెలియనివారు అనాగరికులు. శాస్త్రిగారీ సత్యాన్ని తెలిసికోవాలి.

నేను లోకంలో రూఢ్యర్థంగా ఉన్నవని వ్రాసిన శబ్దాలను తీసికొని వారు నిఘంట్వర్థములు చూపిస్తారు. నిఘంటువులో లేదని ఎవరన్నారు? నేనా శబ్దం లోకంలో ఆ అర్థములో రూఢిగా ఉన్న దన్నాను. ప్రాథమిక అన్న శబ్దం లోకంలో *Elementery* అన్న అర్థములోనే రూఢిగా ఉంది.

ఆలంకారికులలో కథా శరీరమును గురించి విమర్శించిన వారు తక్కువ. దాన్ని గురించి కొంతవఱకైనా చెప్పినవాడు ధ్వన్యాలోకకారుడొక్కడే. ఆయన కావ్యంలో కథ ఎట్లు తీర్చవలెనో చెప్పారు. కావ్యమంటే దృశ్యకావ్యం, శ్రవ్యకావ్యం గూడా అవుతుంది.

"రసాది వ్యంజకత్వే ప్రబంధస్య చేద మన్యన్ముఖ్యం నిబంధనం, యత్సంధీనాం, ముఖప్రతి ముఖగర్భావమర్శ నిర్వహణాఖ్యానాం, తదాంగానాం, చోపక్షేపాదీనాం, ఘటనం, రసాభి వ్యక్త్యపేక్షయా"

ఇది నాటకాన్ని గురించేగాని శ్రవ్యకావ్యాలను గురించి కాదని చెప్పటానికి వీలులేదు. ఇది కావ్యములో కథ ఎట్లుండవలెనను సందర్భములో చెప్పినది. అయితేనేం ఉదాహరణలన్నీ నాటకములలోనివే చూపించాడు గదా! అంటే—ఇదే కాదు, రసం,—రసవిరోధములు — నాయకులు మొదలైన వానిని చూపించినప్పుడుగూడా, నాటకాలలో నుంచే ఉదాహరణ లిచ్చారు. అంతమాత్రంచేత శ్రవ్యకావ్యాలలో రసం కాని, రసవిరోధాలు కాని పాటించ నవసరం లేదని చెప్పటానికి వీలుపడుతుందా? ఇక్కడా అంతే! మల్లినాథాదుల వ్యాఖ్యానాలు కథాదృష్టితో చేసినవి కావు. రసదృష్టితో చేసినవి. వ్యాఖ్యాతలందరూ, పంచసంధుల ప్రాముఖ్యాన్ని, నాటకాల మీదగనే పట్టించారు. కాని ఆలంకారికుల దృష్టి ప్రకారం, వానిని శ్రవ్యకావ్యములందు గూడా పాటించవలెను. సామాన్యదృష్టితో చూచినా, ఏ కథయైనా ముఖప్రతిముఖాదులైన కొన్ని సంధులలోనే ఇమిడియుంటుంది. అవి లేని కథను చూపించలేను.

ఇక సౌందరనంద మూలకథకూ, దీనికీ, లక్ష్యం వేరుగావటంచేత, మూలకథ కంటె, విభిన్నంగా, మలచుకొన్నారనటం కుదరదు. కథను మన ఇష్టము వచ్చినట్లు మార్చటానికి వీల్లేదు. మూలకథలో రసానికి అననుగుణమైన స్థితివున్నప్పుడే, దానిని మార్చవలెను. మీరు దానిని రసపోషణకొఱకు మార్చారు?




మీ పాపాయి

చిరాకుపడుట, మాటిమాటికి కోపగించుట

అకారణముగా ఏడ్చుట

ఈ చిహ్నములు కలిగి కడుపు ఉబ్బరించుచున్నవుంటే, బహుశా లివర్ వ్యాధిగా ఉండవచ్చును. ఇది 3 సంవత్సరాలలోపు పిల్లలకు వచ్చుట సహజము.

జమ్మివారి

లివర్‌క్యూర్

లివర్ & స్ప్లీన్ వ్యాధుల చికిత్సకు, నివారణకు.

ఇప్పుడు మాత్రల రూపంలో లభిస్తున్నది.

జమ్మి వెంకటరమణయ్య అండ్ సన్స్,
'జమ్మి బిల్డింగ్స్', మైలాపూర్, మద్రాసు.




JVZ-4 TG

శాఖ: వేరుగంటివారి వీధి, విజయనగరం సిటీ, మరియు ఇతర స్థలములలో.

మన మీనాటి పరిస్థితులు కొన్ని కలిపిద్దామని మార్చ గూడదు. దీనికి ఉదాహరిస్తున్నాను.

"శేషు కథాశ్రయేషు తావత్ స్వేచ్ఛైవ నయోజ్యా, యదుక్తమ్ - "కథా మార్గే న చాతిక్రమః" స్వేచ్ఛాపియదియో జ్యాతద్రసవిరోధినీ నయోజ్యా ............త్రేతివృత్తే యది రసాననుగుణాం స్థితిం పశ్యేత్తాం భక్త్వాఽపి స్వతంత్రతయా రసానుగుణం కథాంతరము పాదయేత్. నహి కవేరితి వృత్తమాత్ర నిర్వహణేన కించిత్ ప్రయోజనమ్"

వ్యాసుడు వ్రాసిన కథను కాళిదాసు రసదృష్ట్యా మలచుకొన్నాడు. రసానికి అననుగుణమైన స్థితి మూల కథలో ఉంటే దాన్ని పరిహరించాడు. కాళిదాసు కథకు నూతనత్వం తెచ్చాడంటే దాన్ని రసవంతపు పాళ్ళలో పోతపోశాడు. మఱి మన సౌందరనంద కర్తలో—మూలములో నున్న రసాన్నిగూడా ఊదమట్టుగా లాగేశారు. ఇదీ ఒకవిధంగా నూతనత్వమే. కాని కాంక్షణీయమైనది కాళిదాసు తెచ్చిన నూతనత్వం.

గణపతిశాస్త్రిగారు – మూలకథలో నున్న బౌద్ధమతం తీసివేశారు అంటే ఖేదమంటారు." మళ్ళి ఒక చోట "కథను విభిన్నంగా మలచా"రంటారు. సౌందరనంద కథ కీతిబుద్ధికి విస్పష్టంగా తెలిసినట్లే లేదు. అన్నీ స్వవచనవ్యాఘాతాలే.

పి. గణపతిశాస్త్రిగారి ధోరణి ఇలా ఉండిగదా దీనికితోడు సురభిని సమర్థించటానికి ప్రయత్నం—తనకు దూరదారిలేదు పైగా మెడకొక డోలట—అవతలివాడు ఏ అవధుల్లోనుండి విమర్శిస్తున్నాడు—ఆ అవధులు మన కందుబాటులో నున్నాయా—మన పద్ధతి—అవతలివాడి పద్ధతి—వీనిలో ఏది ఉదాత్తమైనది—ఈ మొదలైన ఆత్మవిచారము చేసికోకుండా సహృదయుం డెవడూ వాదంలోనికి దిగడు. గణపతిశాస్త్రిగారు తనకు సమాధానము దొరకనప్పుడల్లా "సురభిగారు తగిన సమాధానమిచ్చా"రని సమర్థిస్తూ వచ్చారు. ఆ విమర్శకంతా ఇదివఱకు వ్యాసంలోనే సమాధానము చెప్పాను.

గణపతిశాస్త్రిగారు "యథార్థ ప్రదర్శన దృష్టితో నీ విమర్శన చేస్తున్నా"నని యెంత చెప్పినా, వారి పాక్షికదృష్టి ఎంత సామాన్య పాఠకునికైనా గోచరిస్తుంది. వారిని నేను నిందించను.

గణపతిశాస్త్రిగారికి శాస్త్రాలపై నున్న అవజ్ఞ ఇంతా అంతా కాదు. "అలంకారిక మార్గం అస్పష్టమైన మార్గము"ట. "అంతా శాస్త్రం ప్రకారం జరిపితే కుక్కపిల్లలు పుడతా"యుట. సాహిత్య పరిజ్ఞానం కలిగిన ఏ వ్యక్తి వీరితో నేకీభవించడు. ఇంతకంటె సరస్వతీ ద్రోహముండదు. ఇలాంటి వ్రాతలవల్ల సౌందరనందం నిలువదు. అది రసవంతమైన కావ్యం ఎన్నటికీ కాదు. దానిని రసవంతమైన కావ్యమనటం ములగకొమ్మకు ఉయ్యాలగట్టి ఊగటం.

ఇన్ని దోషా లున్నప్పటికీ దాన్ని ఆస్వాదించే భావుకుడుంటే ఉండనీయండి. నాకేమీ అభ్యంతరం లేదు. ఈ దేశంలో పండిత శబ్దానికీ భావుకశబ్దానికీ విపరీతార్థాలు వచ్చాయి. ఇక నీ విమర్శలకు నేను ప్రత్యుత్తరమీయను. దీనికైనా సమాధానమిచ్చే వాణ్ణి కాదు. గణపతిశాస్త్రిగారి లాంటి విమర్శకులు సామాన్య పాఠకులను ప్రతారిస్తున్నారు. వారి బుద్ధులకు కొంత వివరణగా వ్రాయవలసి వచ్చినది.



# వాయువు - రసాయనిక దృష్టి

★

శ్రీ హరి ఆదిశేషువు

రసాయనికుల దృష్టిలో గాలి మిశ్రమపదార్థము. అందులో నైట్రొజనీ, ఆక్సిజనీ, నీటి ఆవిరీ, బొగ్గు పులుసు వాయువూ కలిసి ఉన్నాయి. ఇంకా వాటితోపాటు ఎంతో తక్కువగా అపరూపపు వాయువులు కొన్ని కూడా కలిసి ఉన్నాయి. ఇవే కాకుండా ఒకచోటులో ఉండే గాలికీ మరోచోటున ఉండేగాలికీ కూడా కొద్దికొద్ది తేడాలు కనిపిస్తుంటాయి. పారిశ్రామికస్థలాల్లో ఉండే గాలిలో దుమ్మూ పొగా ఎక్కువగానూ, పొలాలమీదనున్న పైరు గాలిలో తక్కువగానూ, మురికి నీరు నిలవ చోటుల్లో దుర్వాయువులూ ఉంటూంటాయి. గాలి మిశ్రమన్న విషయాన్ని షీలే, కేవెండిష్ శాస్త్రవేత్తలు ప్రయోగాలవల్ల రుజువు చేశారు. ఆ విషయం కేవలం శాస్త్ర విషయమైయుండడంచేత దాన్ని వదిలి గాలీ దానిలో ఉన్న పదార్థాలూ మనకు ఎలా ఉపకరిస్తున్నాయో మాత్రం తెలుసుకుందాము.

నైట్రొజనీ, ఆక్సిజనీ జీవజాతుల మనుగడకీ, కొన్ని పరిశ్రమల్లో ముడిపదార్థాలుగానూ అవసరం. జీవజాతులు అందులోనూ ముఖ్యంగా మొక్కలు మాత్రమే గాలిలోఉన్న నైట్రొజనిని వినియోగించుకొని మాంసకృత్తు లనబడే ప్రోటీనులని తయారు చేసుకుంటున్నాయి. ఆ విధానాలూ, వాటి వివరాలూ సంగ్రహంగా వ్యావసాయికరసాయన శాస్త్రం అనే అధ్యాయంలో వివరించబడ్డాయి. అదే ఆ వివరణకు ఉచితమైన స్థానంకూడాను. ఇంక నైట్రొజని అమ్మోనియా వాయుపరిశ్రమలో ముడిపదార్థంగా ఉపయోగింపబడుతోంది. తర్వాత అది నైట్రిక్ ఆసిడుగా మార్చబడటమూ రసాయనికపు ఎరువులలో ముఖ్యమైన అమ్మోనియము సల్ఫేటు తయారీలో వినియోగ మవడమూ జరుగుతాయి. అది ద్రవీకరింపబడి రిఫ్రిజిరేటర్ల (శైత్యకరణులు) లో చల్లని పానీయాల్ని తయారు చేసుకోడానికి అవసరమైన శైత్యస్థితిని కల్పించడానికి కూడా ఉపయోగపడుతోంది. మొదటి రెండూ రసాయనిక పరిశ్రమలు. అవికూడా వ్యావసాయిక రసాయన శాస్త్రం అనే అధ్యాయంలో వివరింపబడ్డాయి.

ఇంక మిగిలిన మూడవది వాయుద్రవీకరణ విధానం వల్ల సాధ్యమైంది. దాన్ని గాలిలో ఉన్న ఇతరపదార్థాల వినియోగాల్ని పరిశీలించిన తర్వాత తెలుసుకొందాము.

గాలిలో ఉన్న ఆక్సిజని నైట్రొజనికంటే కూడా ముఖ్యమైంది. దాన్నికూడా గాలిని ద్రవీకరించే వేరు చేస్తారు. ఆక్సిజని, జీవులు ఆహారాన్ని జీర్ణం చేసుకోవడంలో జరిగే రసాయనిక క్రియల్లో వినియోగ మవుతోంది. వాటి వివరాలు జీవరసాయన శాస్త్రాన్ని వివరించే సందర్భంలో వివరించబడ్డాయి. ఈ జీవరసాయన క్రియలు దేహానికి అవసరమైన శక్తిని సరఫరా చేస్తున్నాయి. ఊపిరి తిత్తులలో ఏదైనా వ్యాధివల్ల ఆక్సిజని సరఫరాలో అవరోధం కలిగితే వైద్యులు ఆక్సిజనిని సరఫరాచేసి జీవరసాయనిక క్రియలు నడిచేటందుకూ అందువల్ల రోగికి తగిన శక్తి చేకూరేలాగా చేయగలుగుతున్నారు.

ఆక్సిజని జీవరసాయనక్రియల్లోనే కాకుండా వస్తువులు మండినప్పుడుకూడా వినియోగ మవుతోంది. అందుచేత వంట చేసుకోడానికి కట్టెల్ని మంటపెట్టినప్పుడు రసాయనిక క్రియని నడిపిస్తున్నామనీ, గాలిలో ఉన్న ఆక్సిజనియొక్క కట్టెల్లో ఉన్న కార్బను పదార్థాలయొక్క రసాయనిక గుణాల్ని వినియోగిస్తున్నామనీ భావించాలి. వస్తువులు మండినప్పుడు జరిగే మార్పుల్ని శోధించడంవల్లనే రసాయనశాస్త్రం అభివృద్ధి అయింది. ఈ విశేషాన్ని వివరించడంలోనే లెవాషియర్ అజరామరమైన కీర్తిని సంపాదించాడు. ఈ వివరణమూలాన్నే ఇనపసామాన్లు గాలిలో ఎండకి ఎండి వానకి తడిసినప్పుడు తుప్పు పట్టడానికీ, దూది బేళ్లు హఠాత్తుగా అంటుకొని కాలిపోవడానికీ కూడా మెల్లిగా జరిగే ఆక్సీకరణమే కారణమని తేలింది.

ఆక్సిజని వాయువుని హైడ్రొజని వాయువుతో గాని, అసిటిలీను వాయువుతో గాని మిశ్రంచేసి ఊదుకొలిమిలో (*Blow Pipe*) అంటించినపుడు అత్యం

తోష్ణము లభిస్తోంది. అల్లా లభించే ఉష్ణం సుమారు 3000-3315 డిగ్రీ లుంటుందని అంచనా వెయ్య బడింది. ఆ మహోష్ణంలో ఇనపరేకులూ ఉక్కు రేకులూ కూడా కరిగిపోతాయి. అందుచేత ఇనప రేకుల్ని దూలాల్ని కరగించి అతికడానికి వీలవు తోంది. ఈ కొత్తవిధానంవల్ల ధాతు వినియోగ విధా నంలో కొత్త మెళకువలు లభించాయి. టంకంతో కాని గుండు మేకుల్తో గాని (*Rivets*) పనిలేకుండా యుద్ధపు ఓడల్ని నిర్మించడము వంతెనల్ని కట్టడమూ సాధ్య మైంది. ఈ సందర్భంలో ఒక్కమాట చెప్పవలసి ఉంది. ఆక్సీ అసిటిలీను, ఆక్సీ హైడ్రోజని జ్వాలల్తో పని చేసినప్పుడు ధాతువులు రవలు కక్కుతూ ఉంటు తాయి. అందుచేత పనివారు ముఖానికీ చేతులకీ రక్షణ కవచాల్ని తొడుగుకొని మరీ పని చేయాలి. లేకపోతే అపాయకరము.

గాలిలో ఉన్న వాయుపదార్థాల్లో నైట్రోజనీ ఆక్సిజనీ తర్వాత నీటి ఆవిరీ, బొగ్గు పులుసువాయువూ ముఖ్యమైన అనాలి. నీటి ఆవిరి ప్రమాణం కాలమానా న్ననుసరించి మారుతూంటుంది. దానిలో భేదాల వల్లనే వర్షయోగమూ, పొగమంచూ మబ్బులూ, మబ్బు తెర తీసిన ఎండలూ కలుగుతూంటాయి. కాలమాన పరిస్థితులకు కారణాలూ, నీటి ఆవిరితో వాటికుండే సంబంధాన్నీ వాతావరణశాస్త్రజ్ఞులు వివరిస్తుంటారు.

గాలిలో ఉన్న బొగ్గుపులుసు వాయువుని మొక్కలు ఉపయోగించుకొని కార్బోహైడ్రేటు లనబడే పిండిపదార్థాల్ని తయారు చేసుకుంటున్నాయి. కార్బోహైడ్రేటులు ఆహారపదార్థాల్లో ముఖ్యమైనవి. అవి రసాయనికంగా సృష్టిఅవుతున్న విధానం వ్యావ సాయిక రసాయన శాస్త్రం అనే అధ్యాయంలో వివ రించబడింది. ఇంజన్లు నడిచేటందుకు బొగ్గూ నీరూ ఎంత అవసరమో మానవులు జీవించేటందుకు వారి ఆహార పదార్థాల్లో కార్బోహైడ్రేటులు అంత ముఖ్యము. ఇవి జీవుల దేహంలో జీర్ణమైనప్పుడు ఆక్సి జనితో సంయోగిస్తాయి. ఆ సందర్భంలో తిరిగీ బొగ్గు పులుసు వాయువు తయారై తిరిగి గాలిలోకి జీవుల నిశ్వాసాల రూపంలో కలిసిపోతుంది.

గాలిలో ఉన్న నైట్రోజనీ, ఆక్సిజనీ, బొగ్గు పులుసు వాయువూ జీవులకు వినియోగించడమూ తర్వాత తిరిగి గాలిలో కలిసిపోవడమూ జరుగు తోంది. అందువల్లనే సామాన్యంగా వీటి ప్రమా ణంలో భేదాలు కలగవు.

పారిశ్రామికంగా అవసరమైన నైట్రోజనినీ, ఆక్సిజనినీ విడివిడిగా తయారుచేసేటందుకూ కోటి కొక్కపాలుగా గాలిలో కలిసిఉన్న అపరూపపు వాయుద్రవ్యాల్ని సేకరించేటందుకూ వాయుద్రవీ కరణమూ, ఆద్రవస్వేదనమూ శరణ్యమయాయి. వాయుద్రవీకరణ విధానంలో రసాయన క్రియల కేమీ పనిలేదు. ఐనా అందువల్ల లభించే ద్రవ్యాలకి రసా యనికంగా ఉన్న ప్రాముఖ్యాన్నిబట్టి దాన్ని సంగ్ర హంగా తెలుసుకోవడం అవసరం.

వాయుపదార్థాల్ని ద్రవీకరించడంలో రెండు వైజ్ఞానిక సూత్రాలు వినియోగమవుతున్నాయి. ప్రతీ వాయుపదార్థాన్నీ కొంతవరకూ చల్లార్చి బాగా అది మితే ద్రవీభూత మవుతుందనేదే ఆ విధానంలోని మూలసూత్రం. ఏ వాయుపదార్థాన్నైనా ఎంత వరకూ చల్లార్చాలి? అనే విషయం ఆ వాయుపదార్థం యొక్క స్వభావాన్ననుసరించి ఉంటుంది. బొగ్గు పులుసు వాయువుని 31° డిగ్రీలవరకూ చల్లార్చి 73 రెట్లు అదిమితే వెంటనే ద్రవమవుతుంది. కాని నైట్రోజనీ, ఆక్సిజనుల మిశ్రమైన గాలిని —140 డిగ్రీలవరకూ చల్లార్చి 39 రెట్లు అదిమితేగాని ద్రవము కాదు. వాయుద్రవీకరణానికి అవసరమైన ఈ మూల సూత్రాల్ని అండ్రూస్, అమగట్ అనే భౌతిక రసా యన శాస్త్రవేత్తలు ప్రయోగమూలకంగా కనుగొని నిర్వచించారు. వాయుద్రవీకరణ కవసరమైన మహా శైత్యం ఏ సాధనాలవల్లా సులభసాధ్యం కాదు. అందు వల్లనే దాన్ని ద్రవరూపంలో తయారుచెయ్యడం 1883 వరకూ సాధ్యం కాలేదు. జౌల్, థామ్సన్‌లనే భౌతిక రసాయన శాస్త్రవేత్తల కృషివల్ల వాయు ద్రవీకరణకు అవసరమైన మహాశైత్యం లభించే విధానం చిక్కింది. బాగా అదుమబడిన వాయువును సన్నని సూది బెజ్జంలాంటి రంధ్రంలోనుంచి పైకి విశాలంగా ఉన్న చోటులోకి ప్రసరించేలా చేస్తే అది బాగా చల్లబడుతుందని జౌల్ థామ్సన్‌లు ప్రయోగ మూలకంగానూ, సిద్ధాంతాలనుబట్టీ కనుక్కొన్నారు. నూరు రెట్లు అదుమబడిన గాలిని హిమశైత్యంలో చల్లార్చి సూచీరంధ్రంలోంచి ప్రసారంచేస్తే —25° డిగ్రీలవరకూ చల్లబడుతుంది. —25° డిగ్రీలవరకూ చల్లారి, నూరు రెట్లుఅదుమబడిన గాలిని సూచీ రంధ్రంలో నుంచి ప్రసరింపజేస్తే —53° డిగ్రీలవరకూ చల్లబడు తుంది. తిరిగీ ఆ శైత్యంలో అదుమబడిన గాలిని చల్లార్చి మరోసారి సూచీరంధ్రంలోనుంచి విస్తరింప

చేసినప్పుడు—81.5° డిగ్రీలవరకు చల్లబడుతుంది. ఈ విధానంలో చల్లదనం క్రమాభివృద్ధిని పొందుతూంటుంది. అందుచేత అవసరమైన చల్లదనం లభించగానే వాయువు ద్రవమవుతుంది. ఈ విధానంలో గాలిలోఉన్న నీటి ఆవిరినీ, బొగ్గుపులుసు వాయువునీ ముందుగానే తొలగిస్తారు. అందుచేత మిగిలిన వాయువులో ఉన్న నైట్రొజనీ, ఆక్సిజనీ కలిసి ద్రవమవుతాయి. అపరూపపు వాయువులు ఇంకా వాయురూపంలో తేలియాడుతూంటాయి. వాటిని తొలగించి ఎలక్ట్రిక్ బల్బుల్లో నింపేటందుకూ, గాజుగొట్టాల్లో నింపి రంగురంగుల కాంతులీనే నియాన్ మెరుపుదీపాలను సృష్టించేటందుకూ ఉపయోగిస్తారు.

ద్రవరూపం పొందిన వాయువులోనుంచి నైట్రొజనినీ, ఆక్సిజనినీ ఆంశిక స్వేదనక్రియవలన వేరు చేస్తారు. వాయుపదార్థాల్ని ఎగుమతి దిగుమతులు చేసేటందుకు వీలుగా ఇనప సిలెండరులలో సేకరిస్తారు. సోడాదుకాణాల్లో అవసరమైన కార్బన్ డయాక్సైడు వాయువుకూడా అలాంటి సిలెండరులలోనే సరఫరా అవుతోంది.

గాలిలో అతికొద్దిగా ఇతర మలిన పదార్థాలుంటాయని తెలుసుకున్నాము. అలాంటి వాటిలో హైడ్రొజన్ సల్ఫైడు వాయువూ, సూక్ష్మజీవులూ ముఖ్యమైనవి: హైడ్రొజన్ సల్ఫైడు ప్రమాణంలో కొద్దిపాటిమాత్రమే ఐనా చికాకు కలిగిస్తుంటుంది. ఆ చికాకుకి మూలకారణము రసాయనిక మార్పులే అనీ, వాటికి విరుగుడువంటి ప్రతిక్రియలు కూడా రసాయనిక విజ్ఞానంవల్లనే సాధ్యమయాయనీ తెలుసుకోడం ముఖ్యం. పెద్దవారిమీద గౌరవంచేత మనం వారి చిత్రాల్ని రంగురంగుల్లో చిత్రకళాకుశలులచేత వేయించి గోడకి వ్రేలాడవేస్తాము. రంగులు అందులోనూ ముఖ్యంగా తెలుపురంగుగా వాడబడే సఫేదు సీసపు లవణమే. సీసపు లవణాలు హైడ్రొజన్ సల్ఫైడుతో యోగిస్తాయి. అప్పుడు నల్లటి లెడ్ సల్ఫైడు తయారవుతుంది. ఈ రసాయనిక క్రియవల్లే గాలిలోనున్న హైడ్రొజన్ సల్ఫైడు గోడమీద మనం ముచ్చటగా వేలాడదీసిన పటంలోని తెల్లటి తలపాగాలోనూ కండువాలోనూ ఉన్న తెల్లటి సఫేదు రంగుని నల్లనల్లగా మారుస్తుంది: ఈ నలుపు రంగు అంతటా ఏర్పడినా బాగానే ఉంటుంది. కాని మరకలు మరకలుగా మాత్రమే ఏర్పడటంవల్ల అందవికారంగా తయారై జుగుప్సావహమవుతుంది. అలాంటప్పుడు దూదిని హైడ్రొజన్ పెరాక్సైడు ద్రావకంలో ముంచి ఆ మరకలమీద అరారగా అద్ది ఎండనిస్తారు. హైడ్రొజని పెరాక్సైడు అత్యంత అస్థిరమైనపదార్థము. అది సులభంగా వియోగమై ఆక్సిజనిని సరఫరా చేస్తుంది. అది సద్యోజనితమైందీ చురుకైనదీ అవటంచేత లెడ్ సల్ఫైడుతో యోగించి దాన్ని తెల్లటి లెడ్ సల్ఫేటుగా మార్చేస్తుంది. అందుచేత నల్లటి మరకలన్నీ తిరిగి తెల్లబడతాయి.

గాలిలో ఉండే దుమ్మూ, సూక్ష్మజీవులూ, రోగకారకములైన వవటంచేత, జీవుల కపకారులని పరిగణింపవలసివుంటుంది. వాటివల్ల కలిగే అపకృతిని శాస్త్రవిధానాలవల్లనే అతికట్టడానికి వీలవుతోంది. పారిశ్రామిక నగరాల్లో దుమ్ము మరీఎక్కువైపోకుండా ప్రతియంత్రాగారపు చిమ్నీల్లోనూ లాడ్జి, కాటరెల్ శాస్త్రవేత్తలు సూచించిపేటెంటు తీసుకున్న అవక్షేపకరణాల్ని (*Precipitetors*) అమరుస్తారు. అందువల్ల సన్నటి దుమ్ముకణాలు

ఓహో అదేమిటామాట!

సంతానం కుష్ఠి కృషిస్తూ ఉంటే
తల్లికి క్షోభ కాదూ?

భారతీ - భారతాంబ తన
కుష్ఠు,బొల్లి సంతానం
కోసం ఎంతని విచారిస్తూఉందో?

ఇదుగో మా 33 సంవత్సరముల
అనుభవంతో ఇస్తూఉన్న అభయం

మాకు నేడే వ్రాయండి

రెడ్డి అండ్ కో.,
గోపాలపురం. (తూ.గో.జి.)

కొల్లాయిడు స్థితిలోనే ఉండి గాలిలో తేలి ఆడి పోకుండా అవక్షేపమవుతాయి. ఈ అవక్షేపకరణుల నిర్మాణంలో భౌతికరసాయన శాస్త్ర పరిశోధనలవలన తెలియవచ్చిన కొల్లాయిడు పదార్థాల గుణాలే వినియోగింపబడ్డాయి. కొల్లాయిడు స్థితిలో నున్న కణాలు విద్యుత్ ను ధరించి ఉంటాయనీ విద్యుత్ప్రసారం చేసినప్పుడు అవి ఏదో ఒక ధ్రువం దగ్గరకు ఆకర్షింపబడి అవక్షేప మవుతాయనీ తేలింది. అవే అవక్షేపకరణుల నిర్మాణంలో వినియోగమయ్యాయి. పారిశ్రామిక నగరాల నివాసం అలవాటు లేని మనకి దుమ్మునీ, పొగనీ చెదరగొట్టేందుకు యంత్రాలు అవసరమా అనిపిస్తుంది. ఇంగ్లండులో ఇనుప పరిశ్రమకు ప్రసిద్ధిచెందిన షెఫీల్డు నగర ప్రాంతంలో రాక్షసి బొగ్గు వాడకంవల్ల గాలిలో దుమ్ము ఎక్కువగా ఉంటుంది. ఆ దుమ్ము మూలంగా బట్టలు త్వరగా మాసిపోతాయి. వాటిని ఉతకడానికి అయ్యే అదనం ఖర్చూ, నష్టమైన రాక్షసి బొగ్గు విలువా సంవత్సరానికి 5 కోట్ల పౌనులుంటుందని అంచనా వెయ్యబడింది. ఈ విషయం లాడ్జ్, కాట్రెల్ విధానానికున్న ప్రాముఖ్యాన్నీ, దాని అవసరాన్నీ తెలియజేసేటందుకు చాలు.

గాలిలో ఉన్న సూక్ష్మకణ జీవులు రోగకారులయే అవకాశం ఎక్కువ. జలుబూ, రొంపా, దగ్గూ, న్యూమోనియా, ఇన్ఫ్లుయెంజా, పొంగు మొదలైన వాటి వ్యాప్తికి గాలిలో తేలియాడుతూండే సూక్ష్మ జీవులే కారణము. అందుచేత ముఖ్యంగా ఊళ్లో గాలు చెలరేగినప్పుడు గాలిని స్వచ్ఛపరచడం అవసరం. అందుకోసమే సూక్ష్మక్రిమిసంహారములైన పదార్థాల్ని గాలిలో వ్యాపింపజేసేందుకు సాంబ్రాణినీ, గుగ్గిలాన్నీ, హారతి కర్పూరాన్నీ వెలిగించడమూ, దీపావళి మతాబాల జోరుతో సల్ఫర్ డయాక్సైడుని అంతటా వ్యాపింపజేయడమూ వాడుకలో ఉన్న విధానాలు.

గాలిలో నైట్రోజని, ఆక్సిజనికంటె నాలుగు రెట్లుంది. నైట్రోజని ఆక్సీకరణాన్ని గాని మండటాన్ని గాని ప్రోత్సహించదు. అందుచేత ఆక్సిజని యొక్క చురుకుతనానికి ఇది కళ్లెంలా పనిచేస్తుంది. ఏ కారణంవల్లనైనా గాలిలో ఉన్న ఆక్సిజని హెచ్చిందంటే ఆక్సీకరణక్రియ లతి చురుకుగా నడుస్తాయి. జీర్ణక్రియలుకూడా ఆ తరహాకి చెందినవే. అందుచేత తిన్న ఆహారం కూడా చురుకుగా జీర్ణమై పోతుంది. జీవరసాయన క్రియల్లో ఆక్సీకరణ క్రియల వేగం హెచ్చగానే మానవుల జీవితం మూణ్ణాళ్ళ పట్టపగలై పోతుంది. గాలిలో ఉండే నైట్రోజనీ, ఆక్సిజనులు ఎన్ని రసాయనిక క్రియల్లో ఏ విధానంప్రకారం పాల్గొన్నా తిరిగి గాలిలోకే చేరుకుంటూ ఉండటంవల్ల వాటి నిష్పత్తిలో మార్పు గాని జీవుల జీవితంలో విపరీతాలు గాని జరగటం లేదు.

గాలిలో ఉన్న బొగ్గుపులుసువాయు ప్రమాణం ఎక్కువైనప్పుడు అలాంటి గాలిని పీల్చేవారికి తలనొప్పి రావడం నిశ్చయం. ఈ విషయమే జనసమ్మర్దమెక్కువగా వుండే సినీమాహాలుల్లోనూ, సమావేశాల్లోనూ కొంతసేపైంతర్వాత ఆవలించేవారూ, తలనొప్పితో బాధపడేవారూ ఎక్కువవడానికి కారణం. ఆవలింతలు రావడానికి కారణం పీల్చే గాలిలో కార్బన్ డయాక్సైడు వాయువు ఎక్కువవడమేననీ, అందువల్ల పరిసరాల్లో జనసంచారం ఎక్కువైందనీ యుగంధరుడు గ్రహించి 'గుడుగుడు శబ్దం కుండను నష్టమ్' అని వండుకొన్న అన్నాన్ని చిమ్మేసి తిరిగీ పిచ్చి నటిస్తూ తనది వేషధారణ అని తేలిపోకుండా జాగరూకత వహించాడని స్ఫురించేలా ప్రతాపరుద్రీయంలో వేదం వేంకటరాయశాస్త్రిగారు వర్ణించారు.

సేంద్రియ పదార్థాలు కుళ్ళి అసంపూర్ణంగా ఆక్సీకరణమైనప్పుడూ, అలాగే అవి గాలి బాగా ప్రసరించని స్థలంలో మండినప్పుడూ నీలిరంగు జ్వాలతో మండే కార్బన్ మోనాక్సైడు తయారవుతుంది. నూనెదీపాన్ని వెలిగించి ఆరిపేసినామనే అభిప్రాయంతో కొంచెం జ్వాలని వదిలేసినప్పు డది నీలంగా ఉంటుందని మీరు గమనించే ఉంటారు. అది కార్బన్ మోనాక్సైడుని చిమ్ముతూ ఉండటంచేతనే 'ఊణాత్కమ్మ దీపం ఇంటికి చేటు'నీ 'దీప నిర్వాణ గంధం మూర్కొనతగదు'నీ సామెతలేర్పడ్డాయి.

---




"దీనిని వాడిచూడండి...

...లక్స్ టాయిలెట్ సబ్బుతో

మీరు ఇంక మనోహరముగా నుండవచ్చును"

"సౌందర్యమునకు అద్భుతమైన సహాయము ఇదిగో. మీగడవంటి లక్స్ టాయిలెట్ సబ్బు నురగను చర్మము మీద బాగా రుద్ది తరువాత కడిగి వేయండి. నియమము తప్పకుండ వాడినచో లక్స్ టాయిలెట్ సబ్బు మీ చర్మమునకు ఒక క్రొత్త అందమును ఇచ్చును" అని లలిత చెప్పుచున్నది.

అని లలిత చెప్పుచున్నది

లక్స్

టాయిలెట్ సబ్బు

సినీమా తారలకు

సౌందర్యమునిచ్చు సబ్బు




# రసనిష్పత్తి

★

శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి

"తత్ర విభావానుభావ వ్యభిచారి సంయోగా ద్రస నిష్పత్తిః."

అని రససూత్రము. విభావములు, అనుభావములు, సంచారిభావములు కలసి రసమును నిష్పన్నము చేయుచున్నవి.

స్థాయి, సంచారి, సాత్త్వికభావములను విచారించునపుడు విభావములను, అనుభావములను, సంచారి భావములను సవిశేషముగా ప్రపంచించితిమి. ఇక వీటి సంయోగమెట్లు సిద్ధించునో, రసమెట్లు నిష్పన్నమగునో వివేచింపవలసి యున్నది.

ప్రతి వ్యక్తియందు వివిధస్థాయి భావములు కలవు. వీటిలో నొకటి బలీయమై ప్రాధాన్యము నందినచో దీని నాశ్రయించుకొనిన స్వభావమా వ్యక్తికి రాగలదు. వివిధస్థాయి, సంచారిభావములు ఒక ప్రధాన స్థాయిభావమున కంగములుగా నేర్పడి, తదనన్యత్వము నందినపుడు సిద్ధించున దీస్వభావము. ఒక వస్తువునుగాని, వ్యక్తినిగాని, భావమునుగాని ఉద్దేశించి బయలుదేరి పరిపుష్టమగునదీ స్థాయిభావము. ఎన్ని స్థాయిభావములు కలవో అన్ని స్వభావములు రాగలవని భావము.

ప్రధాన సంచారిభావము లనేకభావములతో కూడినవి. మన స్వైవిధముగా, నేదిక్కుగా ప్రవృత్తమగుచున్నదో తెలుపునది సంచారిభావము. సంచారిభావము స్థాయిభావములో నంతర్గతమైనది. ఇట్టి సంచారిభావ ముద్దీపితమైనపుడు స్థాయిభావము రసముగా పరిణమింప గలుగుచున్నది. వివిధస్వభావములకు పరస్పర విరోధము లేకుండా వాటిని సమన్వయపరచునవి రసములు. ఇట్టి రసములు మానసికములు మాత్రమే కాక, మానవుల బుద్ధిని, ప్రవృత్తిని నియంత్రితము చేయునవి గూడ. ఈవిధముగు రసము లావిర్భవించుటకు స్థాయి సంచారిణులు సమగ్రముగా పరిపుష్టములు కావలెను. ఈ పరిపోష మెట్లు సిద్ధించును?

ప్రతివ్యక్తికి స్వవంశము, కులము, సంఘము, వృత్తి, దేశము మొదలగు సంస్థలలో సభ్యత్వముకలదు. ప్రతిసంస్థయు దేశకాలానుగుణముగా తత్తదుచిత విధులను విధించును. ఒక సంస్థ విధించు కృత్యము మరియొక సంస్థ విధించు కృత్యమున కత్యంత విరుద్ధమై అన్యోన్యానుపయోగి కావచ్చును. ఆత్మరక్షణను స్వకులము విధించుచుండగా దేశము ఆత్మజీవితమునే కోరవచ్చును. ఇటువంటి సమయములందో బయలుదేరు సంఘర్షణ నాధారము చేసికొనియున్నది ధర్మప్రవృత్తి. ప్రతిసంస్థ కొన్ని పురుషార్థముల నభివ్యక్తము చేయునది. ఈ పురుషార్థముల నిజస్వభావమును గుర్తించి ధర్మప్రవృత్తిలో గలుగు భావసంఘర్షణను సమన్వయింప గలుగుచున్నాము. నిజముగు వ్యక్తిత్వ పరిపోషణ కుపకరించు రసముల స్వభావములను గుర్తించి పురుషార్థములలో తరతమ భేదము నేర్పరచుచున్నాము. మనమవగతము చేసికొను ధర్మభావనచే ననుప్రాణితములై నవీ పురుషార్థములు. మనము ధర్మము నెంతవర కవగతము చేసికొన గలుగుచున్నామో, అంతవరకు పరిపోవు రసములే మనలో పరిపుష్టములు కాగలవు. పురుషార్థము (*Values*) లగు రసములలో పూర్వ పూర్వ బలీయస్త్వమును, పరదౌర్బల్యమును, చూప వీలున్నది. ఈ పురుషార్థములు వస్తుతంత్రములని మాత్రము మరువ రాదు.

కొందరు సాహిత్య సమీక్షకులు రసములు, పురుషార్థములు వస్తుతంత్రములు కావని వాదించుచున్నారు. అనేక భావము లుద్దీపితములగునపుడు గల మనోవృత్తు లతిప్రయోజన వంతములు. ఈ భావములు తరుగుటగాని, అప్రవృత్తము లగుటగాని జరుగరాదు. వీటికి చక్కని అన్యోన్యసంబంధ ముండవలెను. వాటి నముగాని, నిరాకరముగాని తగ్గించ జాలిన మనోవృత్తులు ముఖ్యమైనవి. ఈ విధముగు అంతరంగిక విన్యాసము కవితావాహినికి అవసరము. బాహ్యజగత్తులోని సన్నివేశములు స్థాయి మొదలుగాగల భావముల కన్యోన్య

సంబంధమును గొలిపి, ప్రవృత్తి పరము చేయుచున్నవి. అప్పుడు ఆటంక రహితమగు ప్రవృత్తి, విశ్రాంతి, సుఖము కలుగగలవు. ఇట్టి స్థితిలో కవిత్వము బయలు దేరుచున్నది. అంతే కాని కవిత్వబీజము అంతరంగిక సంఘర్షణలో లేదు. ఈ అనుభూతిలోనూ తన విషయమొకటి అవగతము అగుటచే నిది ప్రయోజనవంతము, ధర్మబద్ధమునగును. పాఠక సామాజికులకుగూడ నీ విధమగు అనుభూతియే కలుగుచున్నది. అనుభూతి నాశ్రయించుకొనినది రసము. రసము లనబడు సాహిత్య పురుషార్థములు పురుషవ్యాపార నిష్ఠములని వీరి వాదము.

ఈ వాదమును పరిశీలించుటకు ముందు రసము లనేవో, అవి యెట్లు సిద్ధించుచున్నవో తెలిసికొనవలెను. తద్ద్వారా రసజగత్తున గల పురుషార్థముల స్వరూప స్వభావములు విశదములు కాగలవు.

ప్రతి రసమున ఆధారభూతముగా నొక ప్రధాన స్థాయిభావముకలదు. స్థాయీ భావాంతర్గతమగు సంచారి భావ ముద్దీపితముకాగా స్థాయి ప్రవృత్తమై రసముగా పరిణమించుచున్నది. రసమొక మిశ్రితపదార్థము వంటిది. రసాయన, భౌతిక శాస్త్రములు జగత్తులోని వివిధవస్తువులను విశ్లేషించి ప్రతివస్తువు అణువులతో నేర్పడుచున్నదని, అణువులో సహితము వివిధాంశములు కలవని చెప్పుచున్నవి. ఈ అంశముల సంఖ్య ననుసరించి వివిధలోహములు ఏర్పడుచున్నవి. కాగా లోహములలో ఎన్ని "ఎలక్ట్రాన్" లనబడు అంశములున్నవో, ఆసంఖ్య ఆలోహమున కీయబడుచున్నది. జీవితమున మనకీ "ఎలక్ట్రాన్" లు సామాన్యముగా నిరుపయోగములు. వీటి సంయోగముచే నేర్పడు వస్తుజాతమే మన కుపకరించునది. ఇట్లే ప్రతి రసములోను స్థాయి సంచార్యాది భావములున్నను మన ప్రవృత్తి చోదకములు రసములే యగుచున్నవి. ఒక విషయము నుద్దేశించి బయలుదేరు స్థాయి, సంచారి భావముల అంగాంగిభావము రసమున ముఖ్యముగా గోచరించును. ఇచ్ఛానంద శక్తిసంవలితమై మనస్సును దృఢముగా జేయునది రసము.

బెల్లము మొదలుగాగల పదార్థములతోను, వ్యంజన ద్రవ్యములతోను రుచులు బయలుదేరునట్లు నానాభావోపగతములగు స్థాయిభావములు రసములుగా పరిణమించుచున్నవని భరతుడుకూడా చెప్పుచున్నాడు. వివిధపదార్థములలో భిన్నరుచులు గలిగియున్నవి. వీటి నేకత్ర సమావేశపరచి భుజించినచో వీటికన్న విలక్షణ మగురుచి వచ్చుచున్నది. ఇట్లే వివిధభావములకు తత్తదుచిత స్వరూపస్వభావము లున్నను, ఇవన్నియు కలసి తద్భిన్నమైన స్వరూప స్వభావములు గల రసముల నీయగల్గుచున్నవి. భావము లంగములై రసమను అంగిని పోషించుచు, రసముచే నుపజీవ్యమానము లగుచున్నవి. ఈ అంగాంగి భావమును సముదాయ రూపముగా గ్రహింపరాదు. వివిధాంగములతో అంగి (*Whole*) ఏర్పడుచున్నను, అంగముల సముదాయముకన్న అంగి అధికమగుచున్నది. అంగిద్వారా అంగముల కనన్యత్వ సంబంధము సిద్ధించుచున్నది.

విషయమునుగాని, వస్తువునుగాని, వ్యక్తినిగాని ఉద్దేశించి ప్రవృత్తములగునవి స్థాయిభావములు. స్థాయి భావము ప్రవృత్తమగుటకు తదంతర్లీన సంచారిభావము మేల్కొనవలెను. సుప్తావస్థను సంచారిభావము వీడుటకు విభావము అవసరము; అప్పుడది సాత్త్వికాద్యను భావములద్వారా నభివ్యక్తమగును. విభావములచే నుద్దీపితమై, సాత్త్వికాద్యను భావముల ద్వారా నభివ్యక్తమగు సంచారిభావము స్థాయిని ప్రవృత్తిపరము చేయగా రసము సిద్ధించునని నిశ్చయింపవచ్చును. శుద్ధతత్త్వ రూపజ్ఞాన స్వభావములగు వ్యభిచార్యాది భావములు చిత్తవృత్తులని విస్మరించరాదు.

స్థాయ్యాత్మకమగు చిత్తవృత్తి నుత్పన్నము చేయుటకు విభావము కారణము. విభావానుభావసంచారి భావములకు స్థాయిభావముతో సంయోగము కలుగగా రసము నిష్పన్నమగును. అనుభావములు రసజన్యములు కావు. రసకారణములుకూడ కావు. అనుభావములు భావములను వ్యక్తీకరించు శారీరకములగు మార్పులు. వ్యభిచారి భావములు స్థాయిలవంటి చిత్తవృత్తులు కావు గాని వాసనాత్మకములుగా, సంస్కార రూపములుగా స్థాయియందుండునవి. కాగా విభావాను భావాదులచే ఉపచితమైనది రసమని భట్టలొల్లటుడు రసనిష్పత్తి సూత్రమును వ్యాఖ్యానించినాడు. "రతిః శృంగార తాంగతా రూప బాహుల్య యోగేన" అని, "అధిరుహ్యపరాం కోటిం కోపో రౌద్రాత్మ తాంగతః" అని మొదలుగాగల వాక్యములలో దండికూడ ఈ ఉత్పత్తి వాదమునే గ్రహించినాడు. విభావములవలన జనించి, అనుభావముల వలన ప్రతీతిపదమునకు తీసుకొనిపోబడి, వ్యభిచారి భావములచే నుపచితమై, ముఖ్యవృత్తిద్వారా నాటకమునగల పాత్రలో తద్రూపతాను సంధానవశమున నటునియందు ప్రతీయమానమగు స్థాయియే రసమని ఈ వాద సారాంశము. ప్రథమమున స్థాయిగానుండి,

భావములచే పరిపుష్టమగుచు రసముగా పరిణమించునని భావము.

ఈ వాదము రసస్వరూపమునుగాని, రసస్వభావమునుగాని చెప్పుటలేదు. రసమెట్లు నిష్పన్నమగునో అను విషయమును మాత్రమే వరించుచున్నది. సంచారి భావముతో ప్రారంభమై రసమున పర్యవసితమగు ప్రవృత్తిలో స్థాయిభావ మనుస్యూతముగా నున్నదని ఈ వాదమున గలదు. నిష్పన్నమగు రసము తత్కారణమగు స్థాయికన్న విలక్షణముగాక తప్పదు. ఉత్పాద్య విషయమున ఉత్పాదకహేతు స్వభావమున్నను, ఉత్పాద్యస్వభావము తద్విలక్షణమే యగుచున్నది. కాగా ఈ వాదమున రసస్వభావ స్వరూపములు నిర్వచింప బడకపోవుటచే ఈ వాదము ప్రపంచించు రసనిష్పత్తి ప్రక్రియను నిరసించుట తగదు. శంకుకాదులీ ప్రక్రియను పరిత్యజించిరేని వారికి రస నిష్పత్తి తెలియదనవలసి వచ్చును. లోల్లటాదులు చెప్పదలచని విషయమును ప్రస్తుతించి తూలనాడుట వితండవాదములోని దగును.

భూత భవిష్యద్వర్తమాన పరిసరముల సాధారమగ జేసికొని, పరిసరములతో సన్నిహిత సంబంధములు కలది రసములు. పరిసరములయందు విభావములున్నవి. తద్ద్వారా అనుభవములుగూడ రాగలవు. వీటిని సంచారిభావములను ఏకత్ర సమావేశపరచుచు, అంతర్వ్యాపిగా నున్నది రసము. బాహ్యజగమున, అనుభవించు వ్యక్తియందుగల వివిధ విషయములు రసము ద్వారా సంవలితములై పరస్పరోపకారకము లగుచున్నవి. తదంతర్గత భావాదులకన్న విలక్షణము, సమగ్రము, ఉత్తమమునైనది రసము. ఈ దృష్ట్యా విచారించినచో లోల్లటుని వాదము గ్రాహ్యమే యగుచున్నది. ఈవాదము ఆధునిక మన స్తత్వ శాస్త్రవేత్తల అభిప్రాయములతో ఏకీభవించుచున్నది.

రతుల, సంగమము, వినయము, ప్రకర్ష, ఆత్మకామన, స్నేహము, వాత్సల్యము, ప్రేమ మొదలుగా గల భావములు కలసి లలితము, సుకుమారమునగు వ్యక్తినుద్దేశించి ప్రవృత్తములైన శృంగారరసము వచ్చును. వివిధసుకుమారభావములను తనలో నంతర్లీనము చేసికొను రతి ఇచట గల ప్రధానస్థాయి భావము. ఇది ఉజ్జ్వల వేషాత్మకము. ఉత్తమ యువప్రకృతిగల్గి స్త్రీపురుష హేతుకమైనదిది. ఈ శృంగారము విషయముతో తన్మయత్వమును తెచ్చుచున్నది. శృంగారము సంభోగవిప్రలంభములను రెండురూపములుగా గలదు. ఋతు, మాల్య, అనులేపన, అలంకార, ఇష్టజన విషయ, వరభవన, ఉపభోగ, వనగమన, అనుభవన, శ్రమ, దర్శన, క్రీడ, లీల మొదలుగా గల విభావముల ద్వారా సంభోగశృంగార ముత్పన్నమగుచున్నది. నయనచాతురీ, భ్రూక్షేప, కటాక్షసంచార, లలిత మధురాంగహారవాక్యాదు లిచట అనుభావములుగా కన్పించగలవు. ఆలస్యము, ఉగ్రత, జుగుప్స, అను సంచారి భావములుతప్ప మిగిలినవన్నియు నిచట రావచ్చును. విప్రలంభ శృంగారమునని ర్వేదము, గ్లాని, శంక, అసూయ, శ్రమ, చింత, ఔత్సుక్యము, నిద్ర, సుప్తి, విబోధము, వ్యాధి, ఉన్మాదము, అపస్మారము, మోహము, మరణము మొదలుగా గల సంచారిణులుండునని భరతుడు చెప్పినాడు. ఇట్లు ప్రతి రసమునకు స్థాయి, సంచారిభావములు, విభావాను భావములు గలవు.

ఈవిధముగా సిద్ధించు రసములే ప్రధానముగ ప్రవృత్తిహేతువు లగుచున్నవి. వీటిద్వారా మానవ స్వభావమును తెలిసికొనవచ్చును. జీవితములో కన్పించు పురుషార్థములను తెల్పునవి రసములు. ఈపురుషార్థములను కేవలము పురుషవ్యాపార నిష్ఠములుగా గ్రహించుట పొరబాటు. ఉద్దిష్టార్థ విషయప్రాప్తికి స్థాయిభావములవు ప్రవృత్తి నెరవేరుట సుఖప్రదముగా గ్రహించబడుచున్నది. ఇట్లు నెరవేరనిచో నసుఖప్రదమని యెంచుచున్నాము. ఇతరకారణములనీ వివేచనలోనికి దింపకుండా, ఒకవస్తువు స్వాభావికముగా సుఖప్రదమని ఇచట ఎంచుచున్నాము. ఈ సుఖప్రదత్వము స్థాయిగాదు, సంచారిభావముకూడ గాదు. ఇది చిత్తవృత్తి కాజాలదని భావము. పురుషార్థము లీసుఖప్రదత్వమునకు సంబంధించినవగుటచే వీటిని వస్తుతంత్రములుగా స్వీకరించక తప్పదు.

స్థాయ్యాదిభావములకు పరస్పరసంబంధము కుదిరగా ఒకదానికొకటి ఉపకరించ గలవు. ఇచ్చట పరస్పరసంబంధము అంగాంగిభావముగావచ్చునది. జగత్తులోని విషయములన్నియు ఈవిధముగ అంగాంగి భావమును తీసికొనవచ్చుటకే వినియుక్తము లగుచున్నవని యెంచరాదు. బాహ్యజగత్తులోనివిషయము తీక్ష్ణత్వమును నెరవేర్చుచున్నను, బాహ్యజగము జ్ఞానవిషయమని మరువరాదు. విషయజ్ఞానమే స్థాయ్యాదుల నుద్దీపించుచున్నది. భయజ్ఞానము లేనిది ఎవడును పరుగెత్తుకదా! బాహ్యజగత్తును జ్ఞానగోచరమునట్లు చేసికొనుటద్వారా మన మనస్సులు ప్రవర్తించుచున్నవి. కాగా విషయములు, విషయజ్ఞానము

లేనిచో రసము లనబడు పురుషార్థము లర్థశూన్యములు కాగలవు.

పురుషార్థములు బాహ్యజగత్తున అంతర్లీనముగా నున్నవి. మన అనుభూతు లభివృద్ధినందుకొలది ఇవి అవగతములు కాగలవు. స్వార్థరహితమగు కృత్యమును శుభమని మేము తెలిసికొనినపుడు ఈ శుభము నారక్త నాళములలోగాని, నరములలోగాని, ఇంద్రియములలోగాని ఉన్నదికాదు. ఇట్లే రసములుకూడ పురుషవ్యాపారనిష్ఠములు కావు. అనుభవించు వ్యక్తి అనుభూతనగువిషయముతో అనన్యత్వము చెందునపుడు తెలియబడున వీపురుషార్థములు.

సౌందర్యముగాని, రసముగాని కేవలము బుద్ధిస్థమైనదని రొంచితిమేని, లలితకళల ప్రయోజనము లలితకళానిష్ఠముగాక మన బుద్ధినిష్ఠము కావలసివచ్చును. పైగా ఈ ప్రయోజనమును గ్రహింపజాలనిచో లలితకళలలో సౌందర్యము లేదనవలసివచ్చును. ప్రయోజనరహితమగు విషయము స్థాయ్యాదులను చలింపజేయజాలదుకూడ. పురుషార్థములు (*Values*) బాహ్యజగన్నిష్ఠములైనవని గ్రహింపగలిగిననే మానవస్వభావము సరిపుష్టము కాగలదు. కావున నీపద్య మందముగానున్నదని యనునపుడు అందము పద్యమందున్నదేగాని, మనబుద్ధినుండి పద్యమున కాపాదింపబడినదిగాదని నొప్పుకొలకుచున్నది. పద్యగతప్రయోజనము నవగాహనము చేసికొనవలెనుచో కవి పద్యమందు నిరూపించిన అనుభూతి మనది కావలెను. తద్ద్వారా భావనాపమున్మిషితమైన అనుభూతి సంతృప్తి నందగలదు. సంతృప్తమైన అనుభూతి విషయగతప్రయోజనమును తనతో నేకము చేయుచున్నది.

పురుషార్థమనగా విషయమున సంలీనమై, విషయములో సంతర్వ్యాపితమై, విషయమునకు యాథార్థతను, అర్థమును సంపాదించు తత్త్వము అని చెప్పికొనవలెను. రసములద్వారా నీతత్త్వము మన కవగత మగుచున్నది. ఈ తత్త్వము శ్రేయోరూపమగు ధర్మముకన్న విలక్షణము కాదు. కాని భావనానుప్రాణితమైన ధర్మమే మహత్తరప్రభావముతో మనల నిట నావేశించుచున్నది. ఈ ఆవేశించుటయే తన్మయీభావన మనబడును. కాగా పురుషార్థములు మానసికములుగావు, శారీరకములుగూడ కావు. ఇట్టి ఉత్తమపురుషార్థములు సత్యము, ధర్మము, (లేక శివము) సౌందర్యము అని పిలువబడుచున్నవి. వీటిలో గల సౌందర్యము సాహిత్యాది లలితకళల విషయము. ఈ సౌందర్యము వివిధ భావము లనభివ్యక్తము చేయుచు భావనాపమున్మిషిత మగుటచేతను, ఇతర ఉత్తమపురుషార్థములతో నభిన్న మగుటచేతను, అభినవగుప్తుడు ఎనిమిదిరసములను ధర్మార్థకామమోక్షము లనబడు పురుషార్థములతో సమన్వయించినాడు.

---

శ్రీమదాంధ్ర

మహాభారతము

ఉద్యోగపర్వము

వెల ఒకరూపాయి

కాపీలకు:

ఆంధ్రగ్రంథమాల,

నెం. 7, తంబుచెట్టివీథి, మద్రాసు 1.

# గ్రంథ విమర్శనము

## ఊర్వశి

మూలం: శ్రీ రవీంద్రనాథ ఠాకూరు. అనువాదకులు: శ్రీ బెజవాడ గోపాలరెడ్డి. ప్రకాశకులు: త్రివేణీపబ్లిషర్సు, మచిలీ పట్టణము. వెల: రెండున్నర రూపాయలు.

దీనిలో రవీంద్రుని వంగమాతృకలనుండి రచించిన 'ఊర్వశి' మొదలైన ఇరవై ఖండకావ్యాల అనువాదాలున్నాయి. తెలుగులోకి ఇతఃపూర్వం వచ్చిన రవీంద్రకవి కవితానువాదాలన్నీ ఆంగ్లభాషలోనించి చేసినవే. ఇంతకుపూర్వం ఒకరిద్దరు అనువాదకులు మాత్రం వంగమాతృకలననుసరించి తెలుగులోకి అనువాదాలు చేశారు.

వంగభాషలోనించి స్వయంగా ఆంగ్లంలోకి అనువదించినప్పుడు రవీంద్రుడే కొన్ని కొన్ని మూల భావాలు పదాలు మొదలయినవి తొలగించివేశాడు. ఉదాహరణకు వంగభాషలోని ఊర్వశి కావ్యంలో పాదాంతాల చివరవచ్చే 'సురేంద్రవందితా' 'అనిందితా' మొదలైనవి విశేషణాలు ఆంగ్లానువాదాల్లో లేవు. బహుశః ఆంగ్లపాఠకుల కవి సముచితంగా ఉండవనే కారణంచేత రవీంద్రుడీ విధాలయిన విశేషాలన్నీ తన అనువాదాల్లోనించి తొలగించి ఉండవచ్చును. నిజానికి రవీంద్రుడాంగ్లంలోనికి చేసిన అనువాదాలన్నీ ఆ పాఠకుల మానసిక సంప్రదాయాలననుసరించి చేసిన వినూతన సృష్టులే.

అయితే వంగాంధ్రభాషలకు సాంప్రదాయికంగా వచ్చేభావాలన్నీ చాలావరకు ఒకేవిధంగా ఉండడంవల్ల యథామూలంగా అనువదించడంలో చాలా సౌకర్యాలున్నాయి.

శ్రీ గోపాలరెడ్డిగారీ అనువాదాలు కేవలం గద్యంలోగాని నియమబద్ధమైన మాత్రాఛ్ఛందస్సులలోగాని రచించకుండా ఆంగ్లంలో వెర్స్ లైబర్ (*Verse Libre*) వంటి స్వేచ్ఛాఛందస్సులలో అనువదించారు. ఈవిషయంలో వీరవలంబించినవిధానంవల్ల పాఠకులకు మూలకవితామాధుర్యం చాలా సన్నిహితంగా ఆస్వాదించడానికి వీలవుతున్నది. ఈ క్రింది గీతిక 'నవవర్ష' అనే ఖండకావ్యంలోనిది. వీటినిబట్టివీరి అనువాదపద్ధతి స్పష్టంగా గ్రహించుకోవచ్చును.

'నాహృదయము నృత్యము చేయుచున్నది నేడు!
మయూరముమాడ్కి నృత్యము చేయుచున్నది!
హృదయము నృత్యము చేయుచున్నది!
శతవర్ణముల భావోచ్ఛ్వాసములు
కలాపమువలె వికాసమునొందుచున్నవి!
ఆకులప్రాణము ఆకసమును గాంచుచు
ఉల్లాసమున దేనిని యాచించుచున్నదో!
నాహృదయము నృత్యము చేయుచున్నది నేడు!
మయూరముమాడ్కి నృత్యము చేయుచున్నది!"

అనువాదంలో వీరు మరికొన్ని క్రొత్త పద్ధతులు కూడా ప్రవేశపెట్టారు. వంగభాషలో సంస్కృత సమాసరచనలో పదాలసంధులు చెయ్యకుండా వేరువేరుగా ప్రయోగించే సంప్రదాయం ఇటీవల ఏర్పడినది! దీనిమీద బాగా తర్జనభర్జనలు జరిగి చివరకది పండితుల అంగీకృతి పొందినదని శ్రీ గోపాలరెడ్డిగారు పీఠికలో తెలియజేస్తూ, అందరికీ అంగీకార్యంఅయినా కాకపోయినా క్రొత్తగా ఈ పద్ధతి తమ అనువాదాలలో ప్రవేశపెట్టామని వ్రాశారు. 'ఊర్వశి' కావ్యంలోని ఈ క్రిందిసంస్కృతవిసంధిప్రయోగం దీనికి ఉదాహరణగా ఇవ్వవచ్చును.

'స్వర్గ ఉదయాచలమున ఉషోమూర్తివినీవు!
ఓ భువనమోహిని! ఊర్వశీ'

'స్వర్గ ఉదయాచల' వంటి ఒకే సంస్కృత సమాసంలో విసంధి ప్రయోగంవంటిదికొంతతీవ్రవాదులైన వ్యావహారిక భాషావాదులు కూడాఅంగీకరిస్తారని తోచదు. ఒక నూతన ప్రయోగ (*Experiment*) దృష్టితోనే శ్రీ గోపాలరెడ్డిగారిటువంటి ప్రయోగాలక్కడక్కడ వాడిఉండడంవల్ల మనం కూడా ఆదృష్టితోనే ఇవి స్వీకరించాలి.

శ్రీ గోపాలరెడ్డిగారీ సంపుటిలో రవీంద్ర కవితలోని ఇరవైరచనల కనువాదాలు రచించి అవన్నీ ఈ సంపుటిలో చేకరించారు. వీటిలో 'ఊర్వశి' వంటి ఉన్నతభావనోజ్జ్వలములైన గీతాలే కాక, భారతతీర్థము, మేఘదూతం, శివాజీ ఉత్సవము మొదలైన వస్తువైవిధ్యంకల గీతికలుకూడా ఉన్నాయి. వీరి అనువాదాలలో మూలకవితాముద్ర స్వాదువుగా హృదయాలకు హత్తుకుంటున్నది.

TELUGU ACADEMY, COCA

రవీంద్రుని రచనలన్నీ వంగభాషలో ఎన్నో సుందర సంపుటాలుగా వెలువడ్డాయని తెలుస్తున్నది. ఆ మహాకవి రచనలన్నీ వంగమూలాలలోనుంచి తెలుగు భాషలోకి అనువదింపబడవలసిన అవసరం ఎంతైనా ఉన్నది. త్రివేణి పబ్లిషర్సువారు ప్రకటించిన ఈ సంపుటి సర్వాంగసుందరంగా ఉన్నది. ఈ సంపుటి ప్రకటన క్రమంగా యథామూలంగా చేసే రవీంద్రానువాద గ్రంథావళికి నాంది కాగలదనీ, తద్వారా ఆంధ్రలోకంలో తిరిగి రవీంద్రరచనల అభిమానం రేకెత్తగలదనీ ఆశిస్తున్నాము.

---

## ఆంధ్ర వ్యాకరణ సంహితా సర్వస్వము.

[రెండవ సంపుటము]

కళా ప్రపూర్ణ వజ్ఝల చిన సీతారామస్వామి శాస్త్రి. ప్రకాశకులు. ఆంధ్ర విశ్వ కళాపరిషత్. ప్రతులకు. రిజిస్ట్రారు. ఆంధ్ర విశ్వవిద్యాలయము, వాల్తేరు. వెల 25 రూపాయలు.

దీని ప్రథమభాగాన్ని గురించి ఇదివరకే ఒకసారి భారతిలో సమీక్ష జరిగింది. దానికిది ద్వితీయభాగము. దీనిలో కారక సమాస, తద్ధిత క్రియాకృత్ ప్రకీర్ణక పరిచ్ఛేదాలను గురించిన కూలంకష వ్యాఖ్యానమున్నది.

ఈ వ్యాఖ్యానంలో వీరు తెలుగులో ప్రామాణికాలుగా అంగీకరింపబడిన వ్యాకరణాలన్నీ తీసుకుని సాంప్రదాయిక వ్యాకరణ సమన్వయ పద్ధతిలో ఆయా వ్యాకరణాలలో గల సందేహాలు ప్రదర్శిస్తూ, అన్నిటికీ ఏకవాక్యత సంపాదించడానికి ప్రయత్నించారు. అవసరమయిన చోటుల తెలుగు వ్యాకరణాలలో అనుక్తంగా ఉండిపోయిన సంస్కృత వ్యాకరణ సంప్రదాయ పద్ధతికూడా వివరించి చూపించారు.

ఈ విధంగా ఈ గ్రంథం సాంప్రదాయికము లయిన ఆంధ్ర వ్యాకరణాల కన్నింటికీ ఒక మహాభాష్యం వంటిదంటే అది అతిశయోక్తి కానేరదు.

అయితే వీరి వ్యాఖ్యానంలో ఒకచోట 'లోక వ్యవహారస్థ కృత్తులెల్ల సాధువులు కావు' అనే 1709 పుట శీర్షికలో సూరి వ్రాసిన మహాజన వ్యవహారాను సారేణగా అనే చోట మహా పదానికి మహాజను లనే అర్థం చెప్పకూడదనీ, జన వ్యవహారమనే దానికి 'మహాకవి వ్యవహారమే' అని అర్థం చెప్పాలనీ వ్రాశారు. సూరి వ్రాసిన మహాసూత్రం బాగా విశాలార్థపరంగా కనిపిస్తున్నది. పూర్వ శాస్త్ర సంప్రదాయాన్ని బట్టి చూచినా 'శిష్టులు' అని అర్థం చెప్పే 'మహాజన' పదమే సముచితమైనదిగా కనిపిస్తున్నది. ఒకవేళ వీరు వ్యాఖ్యానించిన 'మహాకవి' అనే అర్థం చెప్పుకున్నా ఆ అస్పష్టత అలాగే ఉండిపోయింది. మహాకవులంటే కవిత్రయం వారేనా? మరి శ్రీనాథుడు, పోతన మొదలైనవారు మహాకవులు కారా? మహాకవి ఎల్లాగ నిర్ణయించాలి అనే సమస్య ఒకటి ఏర్పడుతుంది.

అందుచేత శ్రీ సీతారామస్వామిశాస్త్రిగారి వ్యాఖ్యానంలో కూడా అస్పష్టత ఏర్పడుతూండడం వల్ల సూరి వ్యాఖ్యానమే సమంజసమైనదిగా కనిపిస్తున్నది.

సాంప్రదాయికమైన ఆంధ్ర వ్యాకరణ సూత్ర సమన్వయంలో వచ్చే క్లిష్టసమస్య సూచించడానికే నేనీ విషయం ఇక్కడ ఉదాహరించాను.

శ్రీ శాస్త్రిగారు మిగిలిన సాంప్రదాయిక వ్యాకరణ శాస్త్ర విషయాలలో చేసిన పరిష్కారాలన్నీ సునిశితము, విస్తృతము అయిన వారి వ్యాకరణ శాస్త్ర పాండిత్యానికీ, బహ్వాంధ్ర గ్రంథ పరిశీలనకు తార్కాణంగా ఉన్నాయి.

ఈ రెండవ సంపుటం రాయల్ సైజులో సుమారు పద్దెనిమిదివందల పుటలుగల సంపుటము. ఈ గ్రంథ ముద్రణాదులన్నీ ప్రశస్తంగా ఉన్నాయి. ఖరీదు కొంచెం ఎక్కువే అయినా మన తెలుగు వ్యాకరణాలకు సంబంధించిన విషయాలన్నిటికీ ఇది పెన్నిధి వంటిది.

ఇటువంటి అత్యుత్తమ గ్రంథం ప్రచురించిన ఆంధ్ర విశ్వవిద్యాలయంవారు, మన భాషకు మహోపకారం చేశారు.

ఆంధ్ర విశ్వవిద్యాలయంవారి ఆధ్వర్యంలో శ్రీ శాస్త్రిగారి మహోత్తమకృతు లింకా వెలువడగల వని ఆశిస్తున్నాను.

---

Printed & published by S. Sambhu Prasad at the Andhra Parika Press
No 7, Thambu Chetty Street, Madras. Editor: S. Sambh Prasad·